# వర్ణాశ్రమధర్మములు

వావిలాల వేంకటశివావధాని గారు

శ్లో. నత్వా భగవతేఽజాయ లోకానాం ధర్మసేతవే, వక్ష్యే సనాతనం ధర్మం నారాయణ ముఖాచ్ఛ్రుతం,
యోఽవతీర్యాఽఽత్మనోంఽశేన దాక్షాయణ్యాం తు ధర్మతః, లోకానాం స్వస్తయేఽధ్యాస్తే తపో బదరికాశ్రమే
ధర్మమూలో హి భగవాన్ సర్వవేదమయో హరిః, స్మృతం చ తద్విదాం రాజన్ యేన చాఽఽత్మా ప్రసీదతి.

—భా. ౭. అ ౧౧. ౫. ౬. ౭. శ్లో.

లోకధర్మవ్యవస్థాపకుండును జన్మరహితుండు నగు నారాయణునకుఁ బ్రణమిల్లి యాత్మాంశమున దక్షునికొమార్తెయగు మూర్తియందు ధర్మునకు నరుతోఁగూడ నవతరించి లోకక్షేమార్థ మిప్పటికిని బదరికాశ్రమమునఁ దపము సేయుచున్న నారాయణుని వలనవినిన సనాతనధర్మమును నారదుఁడు ధర్మరాజునకుఁ జెప్పెను. సర్వవేదమయుండైన హరి ధర్మమునకుఁ బ్రమాణము. వేదవిదులగు మన్వాదులరూప మెత్తి హరియే ధర్మవ్యవస్థను జేసెను. ఆమన్వాదుల స్మృతులు ధర్మనిర్ణయంబునఁ బ్రమాణంబులు. అందువలన నాత్మ ప్రసన్న మగును. ఆమన్వాదులగు స్మృతిపురాణేతిహాసకర్తలు, కరుణాపరులు, సాధువులు, శాంతులు నైన నారాయణపరులు, గాన ధర్మము నితరులకంటె లెస్సఁగ నెఱుంగుదు రనియుఁ గూడ నారదులు సెలవిచ్చిరి. వారందఱకు నమస్కరించి వర్ణాశ్రమధర్మసంగ్రహముఁ జేసెద. వర్ణాశ్రమధర్మములను నహంకారమమకారములు ఫలాభిసంధి లేక యనుష్ఠించినచో నవి ప్రవృత్తిరూపమునుండి నివృత్తిరూపముగ మారి మోక్షమునకుఁ బరంపరాకారణము లగునని నారదుఁడు ధర్మరాజునకును శ్రీకృష్ణుఁ డర్జునోద్ధవకుచేలాదులకును సెలవిచ్చిరి. గాన నాధర్మములకుఁ బ్రవృత్తినివృత్తిరూపములు రెండు. ప్రవృత్తిరూపము లగు ధర్మములను విపులముగను, నివృత్తిరూపధర్మములను సంక్షేపముగను మన్వాదిధర్మశాస్త్రములు నిరూపించును. పురాణాదులలో నివృత్తిధర్మము ప్రాధాన్యముగ వర్ణింపబడును.

## ౧. ఆర్యదేశాచారములు

హిందూస్థానమగు భారతవర్షమునకు వాయవ్యమూల నుత్తరహిందూస్థానమునకుఁ జాలకాలముక్రింద వచ్చి యక్కడ నివసించినవా రార్యులనియు, వారే వర్ణాశ్రమధర్మముల నేర్పఱచిన ట్లిప్పటి చరిత్రకారులు దివ్యజ్ఞానులును తలంచిరి. మన్వాదిప్రాచీన స్మృతులలోఁ గూడ నాయూహ నిరాకరింపఁబడినట్లు తోఁచదు. ఆర్యులనఁ బూజ్యులు. వారి యాచారములు మంచివి, కాన వారికా పేరు గలిగెను. వారుండెడిదేశ మార్యావర్త మనఁబడు. ఆర్యులను మ్లేచ్ఛు లాక్రమించి బాధపెట్టినను, తిరిగితిరిగి యాదేశమును వదలక పుత్రపౌత్రాదిపరంపరగ నార్యులు దానియందే జన్మించిరి; గాన దానికి నార్యావర్తమని పేరు గలిగె నని మనువు ననుసరించి మేధాతిథి వ్రాసెను. మనుస్మృతిలో (మను. అ. ౨. ౧౬. ౨౨.) నార్యావర్తములోని భాగములును, పరిహద్దులును వివరింపఁ బడినవి. సరస్వతీదృషద్వతీనదుల మధ్యనున్న దేశము బ్రహ్మావర్తము. ఇది పుణ్యభూములలో నుత్తమము. దీనిలోనుండు బ్రాహ్మణాది చతుర్వర్ణముల వారికిని, సంకరజాతులకును, బరంపరగ వచ్చిన యాచారవ్యవహారములు ప్రశస్తములు. దీనికంటెఁ దక్కువపుణ్యముగలది బ్రహ్మర్షిదేశము. కురుక్షేత్రమగు డిల్లీ మత్స్య (రాజపుత్రస్థానము) దేశము, కన్యాకుబ్జము (కనౌజ్) శూరసేనక మగు మధురాప్రాంతము నను నాలుగుదేశములకుఁ గలిసి బ్రహ్మర్షిదేశ మనిపేరు. ఇది యమునాసరయూనదుల మధ్యదేశము. ఈదేశపు బ్రాహ్మణాదుల యాచారవ్యవహారములుగూడ నితరులకుఁ బ్రమాణములుగ నంగీకరింపనగు. హిమవద్వింధ్యలకును సరస్వతి యను నదికిని బ్రయాగకును నడుమనుండు దేశము మధ్యదేశము. పూర్వపశ్చిమసముద్రములకును హిమవద్వింధ్యలకును, నడుమనున్న దేశమునకు ఆర్యావర్త మనిపేరు. కాన మనుస్మృతిప్రకారము రాజపుత్రస్థానము, పాంచాల (పంజాబులోని తూర్పుభాగము) డిల్లి ఆగ్రా మధుర ప్రయాగ కాశీ పాట్నా గయాదులు గల బంగాళాదేశము వఱకు నుండు నుత్తరహిందూస్థాన మంతకు నార్యావర్త మనిపేరు. వశిష్ఠస్మృతి బోధాయనసూత్రముల ప్రకారము, పతంజలి వ్యాకరణమహాభాష్యప్రకారమును, హిమవంతము పారియాత్రము కాలకవనము ఆదర్శము ననుకొండ లార్యావర్తమునకు, వరుసగ నుత్తరదక్షిణపూర్వపశ్చిమ హద్దులు. పారియాత్రము వింధ్యలోని పశ్చిమభాగమునకుఁ బేరు. కాలకవనము బర్మాకును తూర్పు బంగాళమునకును, నడుమనుండు కొండలు. ఆదర్శము పంజాబునకును బెలూచిస్థాను అఫ్ఘనిస్థానులకును నడుమనుండు సులీమాను కొండల గుంపు. ఆర్యావర్తము సామాన్యముగ నుత్తరహిందూస్థానమని చెప్పవచ్చును. ఇప్పటి యాదేశాచారవ్యవహారములలో ననేకములు బహుకారణములచే మన్వాదిధర్మశాస్త్రములలోఁ జెప్పఁబడినవానికంటెఁ జాల భిన్నములుగ నున్నవి. కాన నవి మనకుపాదేయములు కావు. వింధ్యకు దక్షిణమున నున్న కిష్కింధ గంధిక శక యవన కార్యక్రాంచాదులగు దేశముల

లోని గ్రామఘోషనగరాదులలోఁగూడ నార్యులు నివసించిరని వ్యాకరణభాష్యాదులలో నున్నది. ఆర్యావర్తమునుండి యీదేశములున్న దక్షిణహిందూస్థానమున కార్యులలో గొందఱు వచ్చి కాపురముఁజేసిరని తేలును. దీని కనుకూలముగ, క్రీస్తు పుట్టుటకు ౫,౬ శతాబ్దులకు ముందున్న ౨౫౦౦ ఏండ్లక్రింద నున్న బోధాయనులు, శిష్టులు (ఆర్యులు) ఉత్తరదక్షిణోభయదేశములందు గలరనియు, వారివారి యాచారములు (ధర్మశాస్త్రమునకు విరుద్ధము లయినను) సదాచారములు గాన నాయాదేశములందు నంగీకరింపవలసిన దనియుఁ జెప్పి కొన్ని దృష్టాంతము లిచ్చిరి. అవి యేవియనః—వింధ్య మొదలు కన్యాకుమారివఱకు నుండు పంచద్రావిడ (ఘూర్జర మహారాష్ట్ర కర్ణాటకాంధ్ర ద్రావిడ) దక్షిణ హిందూదేశములో, ఉపనయనము గాని పిల్లవానితోను భార్యతోను పాత్రలో నన్నమును తినుటయు, చద్దియన్నమును (తరవాణి) దినుటయు, మేనమామ మేనత్తకూతులను పెండ్లియాడుటయు అను నైదాచారము లనాదిగ వచ్చుచున్నవి గాన వానిని మన శిష్టు లంగీకరించిరి. బొచ్చు అమ్మి జీవించుటయు, భంగు త్రాగుటయు గుఱ్ఱము కంచరగాడిదె లోనగువానితో వ్యాపారము జేయుటయు బ్రాహ్మణాదులు సిపాయికొలువులోఁ బ్రవేశించి కత్తిపట్టుకొని జీవించుటయు, వారు సముద్రయానముఁ జేయుటయు, నుత్తరదేశశిష్టు లంగీకరించినారు కాన వానిని మనము నిందింపఁ గూడదు. ఇప్పుడు రైలు మొదలగు ప్రయాణాదిసౌకర్యములు మెండుగ నుండుటచేతను మనదేశము పరరాజ్యపరిపాలనములో నుండుటచేతను పరదేశములకు విద్యావాణిజ్యాదుల నిమిత్తము వెళ్లినఁ గాని ధనార్జన నాగరకత దేశాభివృద్ధియుఁ గలుగమిని స్వరాజ్యసంపాదనమునకు ముఖ్యముగ నింగ్లాండు లోనగు దేశములకు వెళ్లి యక్కడ నున్న ప్రజలతోను మంత్రులతోను నా విషయమై చర్చించుటకు యవసరము గనుకను, హిందూస్థానమునం దంతటను పైని చెప్పిన పది యాచారములే గాక ఇతరాచారములు గూడ మన మభ్యసింపవలసిన కాలము వచ్చెను. ఈ పదింటిని గౌతముఁ డొప్పకున్నను క్రీస్తు పుట్టిన వెనుక ౧౪-వ శతాబ్దిలో నున్నట్టియు, శ్రుతి స్మృతి వ్యాఖ్యాతయు సర్వజ్ఞుఁడు నగు మాధవాచార్యులు కూడ నంగీకరించిరి. నేటికిని వాని ప్రచారము మెండుగఁ గలదు.

## ౨. వర్ణోత్పత్తిక్రమము

వర్ణోత్పత్తి వేదగత మగు పురుషసూక్తములో నిట్లున్నది: "బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్ బాహూ రాజన్యః కృతః, ఊరూ తదస్య యద్వైశ్యః పద్భ్యాగ్ం శూద్రో అజాయత." దీని కర్థము: భగవంతుఁడు పురుషరూపము నెత్తి సృష్టిచేయుటలో ముఖమున బ్రాహ్మణులను, బాహువులఁ క్షత్రియులను, తొడల వైశ్యులను, పాదముల శూద్రులను బుట్టించెను. ప్రాచ్య పాశ్చాత్యులు దీని యర్థము నిట్లు వివరించిరి: విద్యను, దేహబలమును, ఓర్పును, సేవను వరుసఁగ మోము బుజములు తొడలు కాళ్లు సూచించును గాన భగవంతుని యవయవముల నుండి నాలుగు వర్ణములవారు గలిగినట్లు చెప్పఁబడిన దని పురుషసూక్తవాక్యమునకుఁ దాత్పర్యము. ఆ నలుగురు తెలుపు, ఎఱుపు, పసుపు, నలుపు, రంగులు గలవారనియుఁ బురాణములలో జెప్పఁబడినది గాన వర్ణ మనఁగ రంగని మొదటి యర్థము. ఈ పురుషసూక్తార్థము బృహదారణ్యోపనిషత్తులో నిట్లు వివరింపఁబడినది:

"బ్రహ్మ వా ఇద మగ్ర ఆసీ దేక మేవ తదేకగ్ం సన్న వ్యభవత్, త చ్ఛ్రేయోరూప మత్యసృజత. క్షత్త్రం యాన్యేతాని దేవత్రా క్షత్త్రాణీంద్రో వరుణ స్సోమో రుద్రః పర్జన్యో యమో మృత్యు రీశాన ఇతి తస్మాత్ క్షత్త్రా త్పరం నాస్తి తస్మాద్బ్రాహ్మణః క్షత్త్రియ మధస్తా దుపాస్తే రాజసూయే క్షత్త్ర ఏవ తద్యశో దధాతి సైషా క్షత్త్రస్య యోని ర్యద్బ్రహ్మ. తస్మాద్యద్యపి రాజా పరమతాంగచ్ఛతి బ్రహ్మైవాంతత ఉపనిఽశ్రయతి స్వాం యోనిం య ఉ ఏనగ్ం హినస్తి స్వాగ్ం స యోని మృచ్ఛతి స పాపీయా న్భవతి యథా శ్రేయాగ్ంసగ్ం హిగ్ంసిత్వా. ౧౧. స నైవ వ్యభవ త్స విశ మసృజత యా న్యేతాని దేవజాతాని గణశ ఆఖ్యాయంతే వసవో రుద్రా ఆదిత్యా విశ్వేదేవా మరుత ఇతి ౧౨. స నైవ వ్యభవ త్స శౌద్రం వర్ణ మసృజత పూషణ మియం వై పూషేయగ్ం హీదగ్ం సర్వం పుష్యతి యదిదం కించ. ౧౩. స నైవ వ్యభవ త్తచ్ఛ్రేయోరూప మత్యసృజతధర్మం తదేతత్ క్షత్త్రస్య క్షత్త్రం యద్ధర్మ, స్తస్మా ద్ధర్మాత్పరం. ౧౪. త దేత ద్బ్రహ్మ క్షత్త్రం విట్ శూద్ర స్తదగ్నినైవ దేవేషు బ్రహ్మభవ ద్బ్రాహ్మణో మనుష్యేషు క్షత్త్రియేణ క్షత్త్రియో వైశ్యేన వైశ్య శ్శూద్రేణ శూద్రః." ౧౫."

సృష్టికాలమున దేవతలలో నగ్నిరూప మెత్తిన బ్రహ్మ మనుష్యులలో బ్రాహ్మణుఁడుగ మారెను. తర్వాత వారి కర్మపరిపాలనము కొఱకు బ్రాహ్మణులవలన క్షత్త్రియులను, ధాన్యాది సంపాదనము కొఱకు బ్రాహ్మణులవలన వైశ్యులను, బ్రాహ్మణకర్మపోషణము కొఱకు వారివలన శూద్రులను బుట్టించి వర్ణవిభాగముఁ జేసెను. కాన నొకటియే వర్ణ మనియు, రానురాను బ్రాహ్మణులు విస్తరించుకొలఁది పరులగు మ్లేచ్ఛాదులు వారి నాక్రమింప వారి శ్రౌతాది కర్మములను జెడకుండఁ జేయుటకు రాజులును, భూమినుండి పంటపండించి దేశీయులకు దానిని వ్యాపింపఁజేసి ధనసమృద్ధి చేయుటకు వైశ్యులును, వారి ముగ్గురను సేవించుకొఱకు శూద్రులును, నా బ్రాహ్మణులలోనివారే వారి గుణకర్మముల నాశ్రయించి యుదయించినట్లు పై శ్రుతి చెప్పుచున్నది. దాని యర్థము నే భగవద్గీత యనువదించుచున్నది: (భూ. గీ. ౪ అ. ౧౨ శ్లో.) బృహదారణ్య శ్రుతి ననుసరించి దేవతలలోఁ గూడ బ్రాహ్మణాది వర్ణవిభాగము కలదని రంగరామానుజులు శ్రుతప్రకాశాచార్యులును వ్యాఖ్యజేసిరి. జ్యోతిశ్శాస్త్రములు గూడ గ్రహములలో వర్ణవిభాగముఁ గావించెను. ద్వైతాఽద్వైతాచార్య శ్రీ శ్రుతులు దేవతావర్గ విభాగము విషయమయి యర్థవాదము లని నుడివి మనుష్యులలోని బ్రాహ్మణాదివర్ణములకు నగ్ని యింద్రాది దేవత లధిష్ఠాతలు గాన వారి వర్ణములు గూడ ప్రా

దేవతల కుపచారకములుగఁ బ్రయోగింపఁ బడినవి యనిరి. శంకరులు గీతాభాష్యములో (గీ. ౪-౧౩.) మనుష్యలోకములో మాత్రమే వర్ణ విభాగము కలదని వ్రాసిరి. రామానుజులు 'మానుషేలోకే' అను వాక్యము స్వర్గముఁగూడఁ దెలియఁజేయు ననిరి. కాన దేవతలలో విభాగ మున్నను లేకున్నను మనుష్యజాతిలోనున్నట్లు స్పష్టము. భాగవతపంచమస్కంధములో జంబూద్వీపమునందువలె తక్కినద్వీపములలోఁగూడ చాతుర్వర్ణ్యము కలదు అని యున్నది.

౧ జంబూద్వీపములో:—

బ్రాహ్మణుఁడు క్షత్రియుఁడు వైశ్యుఁడు శూద్రుఁడు

౨ ప్లక్షద్వీపములో:—

హంసుఁడు పతంగుఁడు ఊర్ధ్వాయనుఁడు సత్యాంగుఁడు

3 శాల్మలిద్వీపములో:—

శ్రుతిధరుఁడు వీర్యధరుఁడు వసుంధరుఁడు ఇషుంధరుఁడు

౪ కుశద్వీపములో:—

కుశలుఁడు కోవిదుఁడు అభియుక్తుఁడు కులకుఁడు

౫ క్రౌంచద్వీపములో:—

గురువు ఋషభుఁడు ద్రవిణుఁడు దేవకుఁడు

౬ శాకద్వీపములో:—

ఋతవ్రతుఁడు సత్యవ్రతుఁడు దానవ్రతుఁడు అనువ్రతుఁడు

పుష్కరద్వీపములోమాత్రము నొకటియే వర్ణము.

కాన బ్రాహ్మణక్షత్రియవిట్ఛూద్రులవలె నితరద్వీపములలోఁ గూడ వర్ణవిభాగముండుట సహజము. అట్లు లేనియెడల సంఘము లోని వ్యవహారవ్యవస్థ బాగుగ నుండనేరదు.

పై నుదాహరించిన బృహదారణ్యశ్రుత్యర్థమును మహాభారత పురాణాదులుగూడ ననువదించుచున్నవి:

శ్లో. "న విశేషోఽస్తి వర్ణానాం సర్వం బ్రాహ్మ మిదం జగత్
బ్రహ్మణా పూర్వసృష్టంహి కర్మభి ర్వర్ణతాం గతం.
కామభోగప్రియా స్తీక్ష్ణాః క్రోధనాః ప్రియసాహసాః
త్యక్తస్వధర్మా రక్తాంగా స్తే ద్విజాః క్షత్రతాం గతాః.
గోభ్యో వృత్తిం సమాస్థాయ పీతాః కృష్యుపజీవినః
స్వధర్మా న్నానుతిష్ఠంతి తే ద్విజా వైశ్యతాంగతాః.
హింసానృతప్రియాలుబ్ధా స్సర్వకర్మోపజీవినః
కృష్ణా శ్శౌచ పరిభ్రష్టా స్తే ద్విజా శ్శూద్రతాంగతాః.
ఇత్యేతైః కర్మభి ర్వ్యస్తా ద్విజా వర్ణాంతరం గతాః.

మ. భా. శాం. ౧౮౮.

శాంతిలో ౧౮౯ అధ్యాయములో బ్రాహ్మణ క్షత్రియ శూద్రమ్లేచ్ఛ పిశాచ రాక్షసాదుల గుణకర్మములను జెప్పి తుదకు

"శూద్రే చైత ద్భవే ల్లక్ష్యం ద్విజే తచ్చ నవిద్యతే,
నవై శూద్రో భవే చ్ఛూద్రో బ్రాహ్మణోనచ బ్రాహ్మణః"

(౮) అని భృగువు భరద్వాజులతోఁ జెప్పెను. ఇచట 'శూద్రే చైత త్సత్యాది సప్తకం ద్విజే త్రైవర్ణికే, ధర్మఏవ వర్ణవిభాగే కారణం, నజాతి రితి' అని నీలకంఠవ్యాఖ్య. కాన జాతి తెలియనప్పుడు సత్యశమాదిగుణముల వలననే వర్ణము నిర్ణయింప నగు. అట్లే సత్యము పలికినందువలన సత్యకామజాబాలి బ్రాహ్మణుఁ డని నిర్ణయింపఁబడి నట్లు ఛాందోగ్యశ్రుతి చెప్పుచున్నది. పూర్వోదాహృతశాంతిపర్వ గతాధ్యాయార్థమును వాయు పాద్మ గరుడ వామన నృసింహాదిపురాణము లనువదించుటయే గాక యీ యర్థమునే శంకరులు సర్వ సిద్ధాంతసంగ్రహములో వ్యాసమత మని ఈ తీరున వివరించిరి:—

"చతుర్వ్యూహాత్మకో విష్ణు శ్చతుర్ధైవాఽకరో జ్జగత్
బ్రహ్మక్షత్రియవిట్ఛూద్రాంశ్చాతుర్వర్ణ్యాన్ గుణాత్మకాన్.
విప్ర శ్శుక్లో నృపో రక్తః పీతో వైశ్యో ఽంత్యజోఽసితః
విస్తృత్య ధర్మశాస్త్రేహి తేషాం కర్మ సమీరితం.
ఏకస్మిన్నేవ వర్ణేతు చాతుర్వర్ణ్యం గుణాత్మకం
మోక్షధర్మేఽధికారిత్వసిద్ధయే ముని రభ్యధాత్.
స కర్మ దేవతాయోగ జ్ఞానకాండే ష్వనుక్రమాత్
ప్రవర్తయతి తత్కర్మపరిపాకక్రమం విదన్.
ఋజవ శ్శుద్ధవర్ణాభాః క్షమావంతో దయాళవః
స్వధర్మనిరతా యేస్యు స్తే ద్విజేషు ద్విజాతయః.
కామభోగప్రియా స్తీక్ష్ణాః క్రోధనాః ప్రియసాహసాః
త్యక్తస్వ ధర్మరక్తాంగా స్తే ద్విజాః క్షత్రతాం గతాః.
"గోషు వృత్తిం సమాధాయ పీతాః కృష్యుపజీవినః
న స్వకర్మ కరిష్యంతి తే ద్విజా వైశ్యతాం గతాః
హింసా నృత ప్రియాః క్షుద్రా స్సర్వకర్మోపజీవినః
కృష్ణా శ్శౌచ పరిభ్రష్టా స్తే ద్విజా శ్శూద్రతాం గతాః."

—౪౭-౫౪ శ్లోకములు.

వీని తెలుగర్థ మిట్లు: నాలుగు వ్యూహము (వాసుదేవ సంకర్షణ ప్రద్యుమ్నానిరుద్ధులు) లను రూపములు గల విష్ణువు జగత్తును నాలుగు విధములు (ఉద్భిజ, స్వేదజ, అండజ, జరాయుజములు)గను, బ్రాహ్మణ క్షత్రియ వైశ్య శూద్రులను, వారి వారి గుణానుసారముగను, సృజించెను. బ్రాహ్మణుని వర్ణము తెలుపు, క్షత్రియునివర్ణమెఱుపు, వైశ్యువర్ణము పసుపు, శూద్రునిరంగు నలుపు. వారి వర్ణాశ్రమ ధర్మములు ధర్మశాస్త్రమందు వివరింపఁబడినవి. ప్రతి వర్ణము వారికి మోక్షమును బొందు నధికారము గలదని చెప్పుటకుఁ బ్రతివర్ణములో గుణముల ననుసరించి నాలుగు వర్ణముల స్వభావముగలవారున్నారని వేదవ్యాసులు సెలవిచ్చిరి. వారికర్మ పరిపాకక్రమము ననుసరించి, వేదోక్త కర్మకాండయందుఁ గొందఱను, దేవతాకాండయందు గొందఱను,జ్ఞానకాండయందుఁ గొందఱకునభిరుచిఁ గలిగించి వ్యాసులు ప్రవేశ పెట్టించెను. బ్రాహ్మణజాతిలోఁ బుట్టినవారిలో, న్యాయ ప్రవర్తనము గలవారు శుద్ధమగు వర్ణకాంతి గలవారు ఓర్పుగలవారు దయాళువులు స్వధర్మనిరతులు మాత్రమే నిజమయిన బ్రాహ్మణులు. తమ కిష్టము లగు విషయముల ననుభవింప నాసపడువారు, తీక్ష్ణులు, కోపము గలవారు, సాహసులు, స్వస్వధర్మములను వదలిన వారు; ఎఱుపు రంగు దేహకాంతి గలవా రగు బ్రాహ్మణజాతి వారే, క్షత్రియు లైరి. పశువులను పాలించువారు పచ్చని రంగుగల

వారు, వ్యవసాయవృత్తివలన జీవించువారు (కాన) స్వకర్మమును జేయనివా రగు బ్రాహ్మణజాతివారే వైశ్యు లయిరి. భూతహింసను గావించువారు, అసత్యము నాడ వారు, అల్పులు, తమ పొట్టకొఱకే పని నైనను జేయువారు సల్లనివారు శౌచము లేనివారు నగు బ్రాహ్మణజాతివారే శూద్రు లయిరి.

## ౪. వర్ణోత్పత్తికాలము

వర్ణోత్పత్తికాలమును గూర్చి భగవానులగు శ్రీకృష్ణు లుద్ధవున కిట్లు సెలవిచ్చిరి: (భా. ౧౧ స్కం. ౧౭ అ. ౪-౧౪ శ్లో)

"ధర్మ్య ఏష తవ ప్రశ్నో నైశ్శ్రేయసకరో నృణాం
వర్ణాశ్రమాచారవతాం త ముద్ధవ నిబోధ మే
ఆదౌ కృతయుగే వర్ణో నృణాం హంసఇతి స్మృతః
కృతకృత్యాః ప్రజా జాతా స్తస్మా త్కృతయుగం విదుః
వేదః ప్రణవఏవాగ్రే ధర్మోహం వృషరూపధృత్
ఉపాసతే తపోనిష్ఠా హంసం మాం ముక్తకిల్బిషాః
త్రేతాముఖే మహాభాగ! ప్రాణా న్మే హృదయా త్త్రయీ
విద్యా ప్రాదురభూ త్తస్యా అహమాసం త్రివృన్మఖః
విప్రక్షత్రియవిట్చూద్రా ముఖబాహూరుపాదజాః
వైరాజా త్పురుషా జ్జాతా య ఆత్మాచారలక్షణాః
గృహాశ్రమో జఘనతో బ్రహ్మచర్యం హృదో మమ
వక్షస్థలాద్వనే వాసో న్యాస శ్శీర్షణి సంస్థితః
వర్ణానా మాశ్రమాణాంచ జన్మభూమ్యనుసారిణః
ఆసన్ కృతయుగే నృణాం నీచైర్నీచో త్తమో త్తమాః."

వీని తెలుఁగర్థమిది: ఉద్ధవా! నీ ప్రశ్నంబు ధర్మవిరుద్ధంబు వర్ణాశ్రమాచారవంతులైన నరులకు మోక్షదాయకంబు; దానిం జెప్పెద నాకర్ణింపుము. కల్పాదియందలి కృతయుగంబునందు నరుల వర్ణము హంసాఖ్యం బయ్యె. అందు జనులు జన్మమాత్రమునఁ గృతకృత్యులైరి. కావున నయ్యుగంబు కృతం బనం బఱగె. తొలుతఁ బ్రణవమొక్కండే వేదంబు. వృషరూపధరుండైన నేను ధర్మంబు. జనులు తపోనిష్ఠులయి ముక్తకిల్బిషులయి హంసరూపధరుండైన న న్నుపాసింతురు. పిదపఁ ద్రేతాయుగంబున నాహృదయమునుండి త్రయీవిద్య యావిర్భవించుటయు హోత్రాధ్వర్యూద్గాత్రములఁ ద్రిరూపంబైన యజ్ఞంబు నేనైతి. అప్పుడు వైరాజపురుషుని ముఖబాహూరుపాదముల నాత్మాచారలక్షణంబులతో బ్రహ్మక్షత్రియ విట్చూద్రులు జనించిరి. మదీయజఘనహృదయవక్షస్థలశీర్షములం గ్రమమున గార్హస్థ్య బ్రహ్మచర్యవనస్థతాసన్యాసాశ్రమంబు లుదయించె. జన్మస్థానములకుఁ దగినట్లు నరులకు వర్ణాశ్రమంబులు నీచోత్తమమధ్యమప్రకృతు లేర్పడియె. కాన వేదయజ్ఞవర్ణాశ్రమధర్మములకుఁ ద్రేతాయుగమునుండి మనదేశములోఁ బ్రచారముగలిగినట్లు దీనివలనఁ దెలును. భూతభవిష్యద్వేదులై యోగసిద్ధులగు అనిబెసం టమ్మ లెడ్బీటరుగార్లు (Man or) 'మానవోత్పత్తివృద్ధి' యను నింగ్లీషు గ్రంథములో (౩౩౪-౩౩౪ పుట) జగత్సృష్టి పిదపఁ జాలకాలము క్రింద నీదేశములో నార్యవ్యాప్తి గలిగినట్లు వ్రాసిరి:

ఇప్పటికి సుమారు ౧౧,౫౦౦ ఏండ్ల క్రింద నార్యులు వారి జన్మభూమి నుండి అఫ్ఘనిస్థానమును బెలూచిస్థానమును ప్రవేశించి అక్కడ ౨౦౦౦ ఏండ్లుండి పిదప భరతఖండమునకు రాసాగిరి. అక్కడ చాలమంది 'అట్లాంటియను' (Atlantians) 'అట్లాంటో-లెమోరియన్' (Atlanto-Lemorians) జాతు లుండుటచే వారితో నార్యులు సంబంధము చేయు భీతి నావహిల్లి వివాహము చేయఁ కూడ దని వైవస్వతిమను వాజ్ఞచేసి యిప్పటికి సుమారు ౮౦౦౦ ఏండ్ల క్రింద వర్ణవ్యవస్థ నేర్పాటు చేసిరి. మొదట బ్రాహ్మణ క్షత్రియ వైశ్యు లను మూఁడు వర్ణముల నే మను వేర్పఱచెను. బ్రాహ్మణులు శుద్ధార్యులు. క్షత్రియులు ఆర్యులును (Aryans) టాల్టెక్కులు (Taltecs) ను గలిసిన సంతతివారు, వైశ్యు లార్యులు మంగోలియనుల సంతతివారు అక్కడనుండి యీ జాతులకు వర్ణములను రంగు లేర్పడినవి. స్వచ్ఛు లగు నార్యులు (బ్రాహ్మణులు) తెల్లనివారు. ఆర్యులు టాల్టెక్కులు కలిసినమీద బుట్టిన క్షత్రియుల రంగు ఎఱుపు. ఆర్యమంగోలియనుల మిశ్రణమువలనఁ గలిగిన వైశ్యుల రంగు పసుపు. మొదట నీ మూఁడు వర్ణములవారు పరస్పరము పెండ్లియాడ నంగీకరించిరి. తర్వాత నే వర్ణమువారు ఆ వర్ణమువారిలో మాత్రమే పెండ్లిచేసికొను నియమము నంగీకరించిరి. పిదప నార్యులు కాని వారికి అందఱకు శూద్రు లని పేరు గలిగె. ఈ శూద్రదేహములలోఁ గూడ గొంతవఱకు నార్యరక్తము వ్యాపించినది. కొండ వారిలో చాలమందిలో నార్యరక్తము కొంత ప్రసరించినది. కొందఱు పూర్తిగ నార్యులే!

## ౫. వర్ణవిభాగము గుణకర్మానుసృతము

ఈ వర్ణధర్మములకుఁ గారణములు వానిని చేయువారి పూర్వగుణకర్మము లని భగవంతు లర్జునునకు 'చాతుర్వర్ణ్యం మయా సృష్టం గుణకర్మ విభాగశః' (గీ. ౪-౧౩. శ్లో.) అని సెలవిచ్చిరి. దానికిఁ బ్రమాణముగ 'బ్రాహ్మణోఽస్య ముఖ మాసీత్' లోనుగాఁ గల శ్రుతుల శంకరాచార్యు లుదాహరించిరి. ఆనందగిరులు వర్ణాశ్రమధర్మోత్పత్తియు దాని హేతువులు నీశ్లోకములోఁ జెప్పఁబడిన వనిరి. దీనిలోని 'గుణ' శబ్దమునకు సత్త్వరజస్తమము లని శాంకరభాష్యము.

'బ్రాహ్మణక్షత్రియవిశాం శూద్రాణాం చ పరంతప,
కర్మాణి ప్రవిభక్తాని స్వభావప్రభవై ర్గుణైః."

గీత. అ. ౧౮. శ్లో. ౪౧.

ఇక్కడ స్వభావశబ్దమునకు మూఁ డర్థములను శంకరులు స్వీకరించిరి. (౧) స్వభావ మనఁగా—ఈశ్వర ప్రకృతియుఁ ద్రిగుణాత్మికమును నగు మాయ (౨) బ్రాహ్మణాదిస్వభావమునకు సత్త్వాదిగుణవికారము కారణము, (౩) పూర్వజన్మమందుఁ జేసిన కర్మముయొక్క వాసనారూప మగు సంస్కారము. ఆ సంస్కారము ప్రాణు లిప్పటి జన్మమునఁ జేయఁబోవు కార్యములను ప్రకటించును గాన దానిని స్వభావ మందురు. ఆ స్వభావము గుణములకు హేతువు. దీనికి ఆనందగిరియిట్లు టీకను వ్రాసెను: ప్రాణుల పూర్వజన్మవాసన

ఈ ప్రకృతిజన్మములో నభివ్యక్తము లగు ప్రాణుల సత్వాదిగుణము లకు నిమిత్తకారణము. ఆగుణములకు నుపాదానకారణము ప్రకృతి ("ప్రకృతిజై ర్గుణైః") గుణములు కారణము లేనిది పుట్టవు గనుక వాని యుభయకారణములను నానందగిరులు తేటపఱచిరి. సాంఖ్యులు గూడ నాత్మలు గుణకర్మవశముచే బ్రహ్మ మొదలు స్థావరము వఱకు సృష్టిలో నుండు రూపములను ధరించుచున్నా రనిరి. సర్వసిద్ధాంతసంగ్రహములోని ౩౦ వ శ్లోకముం జూడుడు.

"ఆత్మానః ప్రళయే లీనాః ప్రకృతౌ సూక్ష్మదేహినః,
గుణకర్మవశా ద్బ్రహ్మ స్థావరాంత స్వరూపిణః"

ప్రళయములో జీవులు తమ సూక్ష్మదేహములతోఁ బ్రకృతిలో లీనమై వాని గుణకర్మముల ననుసరించి సృష్టిలో బ్రహ్మ మొదలు స్థావరమువఱకు నుండు దేహములను బొందుచున్నవి.

## ౬. వర్ణపరిణామము, తత్కారణము

సాధారణముగ నొక వర్ణమువారు మఱియొక వర్ణముగ మాఱుట లేదు. ఈ నియమమునకు హేతువు వారి సూక్ష్మశరీరముల లోని భూతసూక్ష్మముల భేదము లని ఆనిబిసెంటమ్మ గారు The Pidigree of man అను గ్రంథములో వ్రాసిరి. వర్ణాశ్రమధర్మానుష్ఠానము బాగుగ నున్నప్పుడే యీనియమమున కపవాద మరుదుగఁ గలిగినట్లు విశ్వామిత్రఋష్యశృంగులే దృష్టాంతము. కాన నొక జన్మమందే వర్ణము మాఱుట పుణ్యపాపకర్మోత్కటమువలనఁ గలుగు నని మనువుగూడ తన స్మృతిలో నిట్లు సెలవిచ్చిరి:—

తపోబీజప్రభావై స్తు తే గచ్ఛంతి యుగేయుగే,
ఉత్కర్షం చాఽపకర్షం చ మనుష్యే ష్విహ జన్మతః
శనకై స్తు క్రియాలోపా దిమాః క్షత్త్రియజాతయః,
వృషలత్వం గతా లోకే బ్రాహ్మణాదర్శనేన చ.
పౌండ్రకా శ్చౌడ్ర ద్రవిడాః కాంభోజా యవనా శ్శకాః,
పారదా పహ్లవా శ్చీనాః కిరాతా దరదా శ్శకాః" (౧౦-౪౨-౪౪)

నాలుగుజాతులలోఁ బుట్టినవారును ప్రతిలోమానులోమజాతులం దుదయించిన వారును, (విశ్వామిత్రునివలెఁ దపోప్రభావముచేతను (ఋష్యశృంగునివలె) బీజప్రభావముచేతను, అన్ని యుగము లందు నుత్కృష్టతను పొందుచున్నారు. అట్టి ప్రభావము లేనందున నీ జన్మమందే తక్కువ వర్ణమును పొందుచున్నారు. బ్రాహ్మణుని సేవింపకపోవుటచేతను నుపనయనము మొదలగు కర్మముల లోపముచేతను మీఁదఁ జెప్పఁబడిన క్షత్త్రియజాతులు నానాట శూద్రత్వముఁ బొందిరి. పౌండ్రకము, ఓఢ్రము, ద్రవిడము, కాంభోజము, యవనము, పారదము, శకము, అను దేశముల నేలినవా రందఱు మీఁదఁ జెప్పినట్లు శూద్రు లయినారు. పృషధ్రుఁ డను క్షత్త్రియుఁడు గురుశాపముచే శూద్రత్వమును, దిష్టుఁ డను క్షత్త్రియ సుతుఁడగు నాభాగుఁడు కర్మముచే వైశ్యత్వమును నా జన్మమునందే పొందిరని యున్నది. "(భాగ. స్క. ౯ అ. ౨. ౨౩ శ్లో.) మఱియు క్షత్త్రియుఁడగు గర్గునకు శిని, అతనికి గార్గ్యుఁడు బుట్టిన నా వంశము బ్రహ్మకులం బయ్యె. మహావీర్యునకుఁ ద్రయ్యారుణి, కవి, పుష్కరారుణి యను ముగ్గురు కొడుకులు పుట్టి బ్రాహ్మణు లైరి......అజమీఢునకుఁ బ్రియమేధాదు లయిన కొందఱు తనయులు జనించి బ్రాహ్మణు లయిరి." (భా ౯-౨౧ ౧౯, ౨౦ శ్లో.) ఇట్టి దృష్టాంతము లన్ని స్కంధములలోఁ గూడఁ బెక్కులు గలవు. విశ్వామిత్రాజాతశత్రు మరుదేవాదులు క్షత్త్రియులై యుదయించి తుదకు బ్రహ్మర్షు లయినట్టు భారత స్త్రీపర్వాదులలో నున్నది. క్షత్త్రియుఁడగు వీతహవ్యుఁడు భృగ్వనుగ్రహముచే వారి యాశ్రమములో బ్రాహ్మణుఁడాయెను. ఆపస్తంబులు గూడ నిట్లే సెల విచ్చిరి:—"ధర్మచర్యయా జఘన్యో వర్ణః పూర్వం పూర్వం వర్ణ మాపద్యతే జాతిపరివృత్తౌ" అధర్మచర్యయా పూర్వోవర్ణోఽన్యం వర్ణ మాపద్యతే జాతిపరివృత్తౌ (౫-౧౦-౧౧) "వర్ణోత్కృష్ట మవాప్నోతి నరః పుణ్యే నకర్మణా" (శాం. ౨౮౧ అ. ౫ శ్లో) అని వర్ణారోహణమును వక్కాణించుచున్నది.

శ్లో. "జ్ఞానవిజ్ఞానసంపన్న స్సంస్కృతో వేదపారగః
విప్రో భవతి ధర్మాత్మా క్షత్త్రియ స్స్వేన కర్మణా
ఏతైః కర్మఫలై ర్దేవి! న్యూనజాతికులోద్భవః
శూద్రో ప్యాగమసంపన్నో ద్విజో భవతి సంస్కృతః
బ్రాహ్మణో వాఽప్యసద్వృత్త స్సర్వసంకరభోజనః
బ్రాహ్మణ్యంతు సముత్సృజ్య శూద్రో భవతి తాదృశః
కర్మభిః శ్శుచిభి ర్దేవి! శుద్ధాత్మా విజితేంద్రియః
శూద్రోఽపి ద్విజవ త్సేవ్య ఇతి బ్రహ్మానుశాసనం
స్వభావం కర్మచ శుభం యత్ర శూద్రోఽపి తిష్ఠతి
విశిష్ట స్స ద్విజాతే ర్వై విజ్ఞేయ ఇతి మే మతిః."

భా. అను ౧౪౩ అ. శ్లో. ౪౬. ౪౯.

ఈశ్లోకములలో శివుఁడు పార్వతికి వర్ణారోహణావరోహణములు వృత్తమువలనఁ గలుగు నని యిట్లు నిగమించెను.

"న యోని ర్నాఽపి సంస్కారో న శ్రుతం న చ సంతతిః,
కారణాని ద్విజత్వస్య వృత్త మేవ తు కారణం"

(౫౦)=జన్మముగాని సంస్కారముగాని విద్యగాని వంశముగాని ద్విజత్వమునకు హేతువు గాదు వృత్త మొకటియే దానికిఁ గారణము. ధర్మరాజుగూడ నిట్లే నహుషున కుత్తర మిచ్చెను:—సత్యము, దానము, క్షమ, శీలము, అహింస,తపస్సు, దయ, ఎవనియం దున్నవో యతఁడే బ్రాహ్మణుఁ డనియు లేనివాఁడు శూద్రుం డనియు నిర్ణయింపవలయును గాని జాతిచేతనే వర్ణనిశ్చయముఁ జేయఁదగదు. కాన వృత్తమే బ్రాహ్మణాదినిర్ణయమునకు హేతు వనుటకు స్మృతిభారతాదికము ప్రమాణము.

## ౭. గుణకర్మజాతుల బలాబలములు

కాని "తపస్సు, శాస్త్రపాండిత్యము, జాతి అని బ్రాహ్మణవర్ణమునకు మూఁడు హేతువులు గాన, తపస్సు శాస్త్రపాండిత్యము లేనిచో జాతికి బ్రాహ్మణుఁడు మాత్ర మగు" నని భగవంతు లగు పతంజలి వ్యాకరణమహాభాష్యములో నిట్లు సెల విచ్చిరి:—

"తపశ్శ్రుతం చ జాతి (యోని) శ్చే త్యేత ద్బ్రాహ్మణకారకం,
తపశ్శ్రుతాభ్యాం యో హీనో జాతిబ్రాహ్మణ ఏవ సః"

ఇట్లే పరాశరులు వ్యాసులు సెలవిచ్చిరి: "బ్రహ్మబీజసముత్పన్నో మంత్ర సంస్కారవర్జితః, జాతిమాత్రోపజీవీ చ స భవేన్నామధారకః." (ప. స్మృతి. అ. 3 ఆ. ౬. చూ. మాధవీయవ్యా.) ఇట్లే శ్రీమ ద్భాగవతైకాదశాధ్యాయాంతమందు నారదులు ధర్మరాజునకు వర్ణాశ్రమధర్మముల నుపన్యసించి యిట్లు నిగమించిరి:—"యస్య యల్లక్షణం ప్రోక్తం పుంసో వర్ణాభిసూచకం, య దన్యత్రాపి దృశ్యేత త త్తేనైవ వినిర్దిశేత్ (భా. ౭-౧౧-౩౫) = (ఏవర్ణంబున కేలక్షణంబు సెప్పఁబడియె నయ్యది యితరులలోఁ గన్పట్టునేని దాన నతనిఁ దద్వర్ణ యోగ్యుం గా నిర్దేశింపఁ దగు). దానికి శ్రీధరాచార్యు లిట్లు టీక వ్రాసిరి:—"శమాదిభి రేవ బ్రాహ్మణాదివ్యవహారో ముఖ్యః న జాతి మాత్రా దిత్యాహ-యస్యేతి-యదితి-అన్యత్ర వర్ణాంతరేపి దృశ్యేత త్తద్వర్ణాంతరం తే నైవ లక్షణనిమిత్తేనైవ వర్ణేన వినిర్దిశేత్. న తజ్జాతినిమిత్తే నేత్యర్థః" అనఁగ ముఖ్యముగ గుణకర్మములచేతనే వర్ణవ్యవస్థను చేయవలయును గాని జాతిమాత్రముచేత చేయఁదగ దని శ్రీధరాచార్యు లాశ్లోకమున కర్థము వ్రాసిరి. అట్లే శంకరు లపశూద్రాధికరణభాష్యములో విదురధర్మవ్యాధులు సంకరజాతు లైనను సిద్ధులు గాన వారికి వర్ణాశ్రమధర్మనియమములు వర్తింప వని నిర్ణయించిరి. మహారాష్ట్రోత్తరహిందూస్థానములలో నున్న బ్రాహ్మణేతర వర్ణ లగు భక్తులును, దక్షిణదేశమున నుండిన శైవవైష్ణవాదు లగు నికృష్టజాతిభక్తులును, అతివర్ణ లనియు నత్యాశ్రము లనియు నిర్ణయింప నగు.

"అత్యుత్కటై రిహాత్యు స్తు పుణ్యపాపై శ్శరీరభృత్,
ప్రారబ్ధం కర్మ విచ్ఛిద్య భుఙ్క్తే త త్తత్ఫలం బుధాః.

అత్యుత్కటపుణ్యపాపము లొక జన్మములో నొనరించినచోఁ బ్రారబ్ధ కర్మఫలమును గూడ నతికట్టి యాపుణ్యపాపకర్మములఫల మాజన్మములోనే యనుభవమునకు వచ్చు నని పరాశరులు తమ యుపపురాణములలో సెలవిచ్చినట్లు మాధవాచార్యులు వ్రాసిరి. స్కాందపురాణమందీశ్వరవరముచే వ్యాఘ్రము గణేశత్వము నొందినట్లును మహాభారతములో నహుషున కింద్రత్వము సర్పత్వము నొక జన్మములోనే కలిగినట్లును గూడఁ జెప్పఁబడినవి. ఈప్రమాణదృష్టాంతము లన్నిటివలనను బ్రాహ్మణాదివర్ణములకు ముఖ్యకారణములు గుణకర్మములు గాని జాతి గా దనియు, నత్యంతాతిశయపుణ్యపాపకర్మాచరణముచే నీచోచ్చవర్ణముల కొక జన్మమందే యారోహావరోహణములు విశ్వామిత్రనాభాగ నహుషాదులవలె నగు ననియుఁ దేలును.

## ౭. వర్ణాశ్రమధర్మములు

వర్ణాశ్రమధర్మములు రెండు తెఱంగులు:-సాధారణములు నసాధారణములు అని. మన్వాదిస్మృతిపురాణేతిహాసములలో వాని వివరము లున్నవి. ధర్మార్థకామము లగు మూఁడు పురుషార్థములను మాత్రము నుద్దేశించి చేయఁబడినచో లౌకికాలౌకికకర్మములు ప్రవృత్తిరూపము లగుఁ గాని అహంకారమమకారములు లేకయు నాకర్మములఫలమును గోరకయు నాఫలము భగవదర్పణపురస్సరముగ శ్రద్ధాభక్తులతోఁ జేసినచో, అవియే నివృత్తిరూపములై సత్త్వశుద్ధిని గలుగఁజేసి తద్ద్వారా మోక్షదాయకము లగుననియు శాస్త్రకారుల దృఢాశయము. దీనినే పలుమాఱు బహుప్రకారముల భగవంతు లర్జునోద్ధవకుచేలాదులకును భాగవతు లగు నారద ప్రహ్లాదాదులకును నొక్కి యుపదేశించుటచే దీనిని హరిమత మనెదరు. మనము చేయుపనికి 'కర్మ'మని పేరు. శ్రుతిస్మృత్యాదులలో నేవర్ణము వారేయాశ్రమి ఏ యే కర్మములను జేయ నగు ననియు, సర్వవర్ణములవా రేకర్మమును చేయనగు ననియు నిర్ణయింపఁబడినదానికి 'ధర్మ' మని పేరు. కాన జగత్తులోని ప్రజలను గలిపి రక్షించును గాన 'ధర్మ' మని పేరు గలిగినట్లు మహాభారతములోఁ గలదు—"ధారణా ద్ధర్మ మిత్యాహు ర్ధర్మో ధారయతి ప్రజాః" మ. భా. క. ౬౯. శ్లో. ౫౮. కాని 'కర్మ' 'ధర్మ' శబ్దములు శాస్త్రములందుఁ బర్యాయపదములుగ వాడఁబడుచున్నవి. స్వాభిప్రాయకృత మగు కర్మమాత్రము కేవల క్రీడాకర్మము గాని ధర్మ మనిపించుకొన దనియు, నది ప్రయోజనకారి కా దనియు, స్మృతిజ్ఞానముచేఁ జేయఁబడు కర్మమే యనంతఫలకారి యనియుఁ గూడ వృద్ధు లీ తీరున సెలవిచ్చిరి:—

"స్వాభిప్రాయకృతం కర్మ క్రీడాకర్మైవ కేవలం,
స్మృతిజ్ఞానా దనుష్ఠాన మనంతఫలదం విదుః."

కార్యాకార్యములందు శాస్త్రము నరసి ధర్మమాచరింపవలయు నని గూడ గీతాదిప్రమాణములు చెప్పుచున్నవి.

## ౮. సాధారణధర్మములు

నరమాత్రు లందఱు హిందువులవలె వర్ణాశ్రమధర్మము లున్నను బౌద్ధులవలె లేకున్నను నాచరింపఁ దగిన ధర్మములను సాధారణ ధర్మము లనియెదరు. సత్యము (యథార్థభాషణము గాని సమదర్శనము గాని), దయ (పరులదుఃఖమును పోఁగొట్టవలయు నను కోరిక), తపము (కాయశోషణము), శౌచము (స్నానాదికముచేఁ గలుగు దేహశుద్ధి) తితిక్ష (శీతోష్ణాదిసహనము), యుక్తాయుక్తవివేకము, మనస్సంయమ మను శమము, బాహ్యేంద్రియజయ మను దమము, అహింస (అన్నివిధముల నితరులకుఁ బీడ చేయకుండుట), బ్రహ్మచర్యము (పరస్త్రీవర్జనమును, నిషిద్ధదేశకాలాదులందు స్వస్త్రీవర్జనమును) దానము, స్వాధ్యాయము (యథోచితవిద్యామంత్రజపాదికము), ఆర్జవము (మనస్సులోఁ గౌటిల్యము లేకుండుట), సంతోషము (తనకర్మమువలన లభించినదానితోఁ దృప్తి నొందుట), సర్వులను సమముగఁ జూచు మహాత్ముల సేవ ప్రవృత్తిరూపము లగు నన్ని కర్మములను మెల్లఁగ వదలుట, నరులు సేయు కొన్ని కార్యములవలనఁ బ్రయోజనము పుట్ట కుండుట. అరయుట, మౌనము (వృథాప్రలాపము లేకుండుట), దేహాదివ్యతిరిక్తుఁ డాత్మఁ డని యనుసంధించుట, అతిథిభృత్యాదిభూతములకుఁ దగిన ట్లన్నవస్త్రాదుల నిచ్చుట, పశ్వాదిసర్వభూతములయెడ విశేషించి మనుష్యులయెడ నాత్మత్వదేవత్వబుద్ధి, మహాత్ములను రక్షించువారి గుణకర్మ

ములను వినుటయుఁ గీర్తించుటయు, హరిస్వరూపగుణవిభూతులను స్మరించుటయుఁ బూజించుటయు, నమస్కరించుటయు దాసుని వలె భగవంతునందు సకల కర్మఫలసమర్పణ మను దాస్యము, హరి యందు విశ్వాసాధిక మగు సఖ్యంబును తన్నుఁ దనవారిని హరిసంబంధు లని భావించి, హరికి వారి నర్పించుట యను నాత్మసమర్పణమును, హరిభక్తిప్రకారంబులు తొమ్మిదియుం గూడ ముప్పదిలక్షణంబులఁ దనరు సర్వాత్మతోషణం బైన యుత్తమధర్మంబు సర్వవర్ణ సాధారణంబు.

## ౧౦. అసాధారణ (విశిష్ట) ధర్మములు

బ్రాహ్మణక్షత్త్రియ వైశ్య శూద్ర సంకరవర్ణములలో నాయా వర్ణములకు నాయా యాశ్రమములకుఁ బ్రత్యేకముగ నుండుధర్మము లసాధారణము లనఁబడు. అవి మూఁడు తెఱంగులు:— వర్ణధర్మములు, ఆశ్రమధర్మములు, వర్ణాశ్రమధర్మములు అని. "మంత్రపూర్వకంబుగ గర్భాధానాదిసంస్కారములఁ బడసిన బ్రాహ్మణక్షత్త్రియ వైశ్యులు ద్విజు లనఁబడుదురు. అధ్యయనము (వేదము నర్థముతోఁ జదువుట) యజనము (యజ్ఞాదికర్మలను జేయుట) దానము (ధనాదికముఁ దగినవారి కిచ్చుట) అనునివి, ఆశ్రమోచితకర్మంబులును జన్మకర్మశుద్ధు లైన ద్విజులకు విహితంబులును, "అందు బ్రాహ్మణులకు నధ్యాపనము (వేదము నితరులకుఁ జెప్పుట) యాజనము (యజ్ఞాదికర్మములను జేయించుట) ప్రతిగ్రహము (దానమును దీసికొనుట) లు, జీవనాధారము లగువృత్తులు. రాజులకుఁ బ్రజాపాలనంబు, విప్రేతరులవలనఁ బన్నులు మొదలగువానిఁ గొనుటయు నాపత్సమయంబున యాజనాధ్యాపనంబులును, వృత్తియగుఁ గాని, ప్రతిగ్రహం బెన్నఁడుం దగదు. కృషివాణిజ్య కుసీదగోరక్షణములు వైశ్యులకు వృత్తులు. శూద్రులకు ద్విజసేవ ధర్మమును వృత్తియు. వీనిలోఁ గృష్యాది జీవిక యయాచితధనగ్రహణము నిత్యధాన్యయాచన శిలోంఛవృత్తి (క్రిందఁ బడినగింజల నేఱికొనుట) యను నాలుగు బ్రాహ్మణునకు వృత్తులు. కలిలోఁ గృష్యాదులు బ్రాహ్మణునకు వృత్తులు అని పరాశరు లంగీకరించిరి. వాణిజ్యము. నీచసేవ స్వవృత్తి, అత్యంత నింద్యం బైన నీచసేవ బ్రాహ్మణక్షత్త్రియులకు నిత్యవర్జనీయంబులు. ఇంద్రియమనోనిగ్రహము, తపము, శౌచము, సంతోషము, పరాపరాధసహనము, ఆర్జవము, జ్ఞానము, దయ, విష్ణుపరత్వము, సత్య మనునివి బ్రాహ్మణలక్షణములు. యుద్ధోత్సాహము, ప్రభావము, ధైర్యము, ప్రాగల్భ్యము, దాన, మాత్మజయము, క్షమ బ్రహ్మణ్యత, ప్రసాదరక్షణ మనునివి క్షత్త్రియలక్షణంబులు. దేవగుర్వార్య గోభక్తి త్రివర్గపరితోషణమాస్తికత్వము నిత్యోద్యమము నైపుణ్య మనునివి వైశ్యలక్షణంబులు. వినయము శౌచము నిష్కపట మగు స్వామిసేవ, నమస్కారమంత్రమునఁ బంచయజ్ఞాచరణము చౌర్యవర్జనము గోవిప్రరక్షణ మనునివి శూద్రలక్షణంబులు. పతిశుశ్రూష తదనుకూలత్వము తద్బాంధవానువర్తనము తద్వ్రతధారణనిత్యత్వ మనునివి పతివ్రతాలక్షణంబులు. ఇల్లు అలికి ముగ్గువెట్టి తీరుదీర్చి యలంకరించి గృహోపకరణంబులు నిర్మలములు గావించి తాను నలుఁగుపెట్టికొని జలక మాడి కట్టి తొడిగి పూసి కైసేసికొని యలబ్ధంబుల కాసింపక లభించినమాత్రకు సంతసిల్లుచు నాలస్యంబును బ్రమాదంబును బరిహరించి ధర్మమెఱింగి ప్రియసత్యంబుల నుడువుచు శుచియై స్నేహము వినయము శాంతియుం బెంపార నానాకామంబులతోఁ బతితుఁడు గానిపతిని బతివ్రత తఱితో నుపసర్పించుట ధర్మంబు శ్రీదేవి హరి నెట్లో అట్లు హరిభావమునఁ బతిని గొలుచుసతి హరితోడి శ్రీవిధమునం బుణ్యలోకమునఁ బతితో సుఖించు. అంత్యజు లైన రజక చర్మకార నట బురుడ కైవర్త భిల్లులకుఁ అంతావసాయు లైన చండాలపుల్కస మాతంగాదులు మున్నగు సంకరజాతులకుఁ జోరత్వము హింసాది పాపవృత్తియుఁ దక్కఁ గులాగతకృత్యంబులు వృత్తి యగు. వేదదర్శనుల ప్రతియుగమున వారివారి స్వభావమున కనుగుణంబుగా విధించినధర్మ మయ్యయివారి కిలోకంబునను నాలోకంబునను సుఖము నాపాదించు. స్వభావముచేఁ దిరిగితిరిగి స్వధర్మంబు నాచరించువాఁడు మెల్లమెల్లన స్వభావజనితకర్మంబును బరిహరించి క్రమమున నైర్గుణ్యంబుఁ గాంచు. ఎల్లప్పుడును బీజములు చల్లుచునే యుండిన గాలక్రమంబున నాక్షేత్రంబు నిర్వీర్యంబై ప్రరోహయోగ్యంబు గాక బీజములకే చేటు గావించువిధమునఁ గర్మములనే మీదుమిక్కిలి యనుష్ఠించుచుం గామములనే సేవించుచుండినం గ్రమంబున గామాసక్తి వీడు. కామములును మొలవవు. మఱియు నాకామములు నశించు. ఘృతము మితముగఁ బోసిన నగ్ని ప్రజ్వరిల్లును గాని యమితముగఁ బోసిన చల్లాఱుఁ గదా ఏవర్ణంబున కేలక్షణంబు చెప్పఁబడియె నయ్యది యితరులలోఁ గన్పట్టునేని దాన నతనిఁ దద్వర్ణయోగ్యుం గా నిర్దేశింపఁ దగు:— (ఆంధ్ర వచనభాగవతము సప్తమస్కంధము 206,7 పుటలు). ఈవర్ణధర్మసంగ్రహముచే మన మరయఁ దగిన యంశ మేమన:— ప్రతియుగమున ధర్మములు మాఱు ననియు, ధర్మాచరణముయొక్క మహాఫలము కామ్యకర్మము వదలి నిష్కామకర్మ నాచరించి భగవదర్పణమును జేసినఁ గాని సత్య శుద్ధి గలుగ దనియుఁ దర్వాత ముక్తి యలవడ దనియుఁ దేలును. ఇందులకుఁ బ్రమాణము:—

నేహ యత్కర్మ ధర్మాయ న విరాగాయ కల్పతే,
న తీర్థపదసేవాయై జీవన్నపి మృతో హి సః.

(భా. 3. ౨౩. ౫౬)

స్వభావజనిత మైన కర్మమునకు బదులు శాస్త్రవిహిత మగు కర్మము నాచరింపవలయు. శాస్త్రోక్తము లగు కామ్యకర్మములను వదలి నిత్యనైమిత్తికకర్మములను లౌకికకర్మములను నహంకారమమకారఫలాభిసంధులు లేక యనుష్ఠింపవలయు. అట్లయినఁ గాని తీవ్రవైరాగ్య ముదయింపదు. అట్టి విరాగములో సర్వకర్మములు భగవదర్పణము చేయనిది సత్యశుద్ధి గలుగ నేరదు. చిత్తమలముపోయి శుద్ధసత్త్వము ప్రకాశించినఁ గాని జ్ఞాన ముదయింపదు. అది ప్రజ్వరిల్లినఁ గాని ముక్తి యలవడదు. ఈన్యాయమే యాశ్రమధర్మములకు ననువర్తించును.

## ౧౧. ఆశ్రమధర్మములు

బ్రాహ్మణులలో నాలు గాశ్రమములు:— బ్రహ్మచర్యము, గృహస్థాశ్రమము, వానప్రస్థము, సన్న్యాసము. ఉపనయనమైన, పిదప నియమము నవలంబించి గురువునొద్ద వేదమును తదంగములను చదువు చుండుట బ్రహ్మచారిధర్మము. జీవితకాల మంతయు నట్లున్న యెడల వానిని నైష్ఠికబ్రహ్మచారి యందురు. కొంతకాల మట్లుండి తర్వాత గృహస్థాశ్రమమును స్వీకరించువానిని ఉపకుర్వాణుం డందురు. సాంగవేదాధ్యయనమును పూర్తిచేసి పెండ్లిచేసికొని స్వధర్మాచరణమును జేయువాఁడు గృహస్థుఁడు. పుత్రోత్పత్త్యనంతరము వనవాసముఁ జేయుచు ఫలాదులను భక్షించుచు భగవదారాధనముఁ జేయువాఁడు వానప్రస్థుఁడు. భార్యాదిక మగుసర్వసంసారమును త్యజించి తల గొరిగించుకొని కావిరంగు గల గుడ్డగోచిని బెట్టికొని దండమును కమండలమును ధరించి జనులు లేనిచోటులను తీర్థములందును వసించి, గ్రామములలో భిక్ష మెత్తి భగవదారాధనమును మాత్రముఁ జేయువాఁడు సన్న్యాసి. క్షత్త్రియవైశ్యులకు మొదటి మూఁడాశ్రమములును శూద్రునకు గృహస్థాశ్రమము మాత్రమును, విధింపఁబడినవి. ఈశ్వరారాధనము సర్వవర్ణాశ్రమములకు సాధారణధర్మము. శ్రీశంకరాచార్యులు క్షత్త్రియవైశ్యులకు సన్న్యాసాశ్రమము కొన్నిశ్రుతులలోని లింగప్రమాణము ననుసరించి లే దన్నను వారిశిష్యు లగుశ్రీసురేశ్వరాచార్యులు బృహదారణ్య వార్తికములో న్యాయరహిత మగులింగము ప్రమాణము కా దనియు, నితరశ్రుతులఁ గంఠోక్తిగ క్షత్త్రియవైశ్యులకుసన్న్యాసము కల దని చెప్పుటచేతను, వారికిఁ గూడ సన్న్యాస మున్న దని వ్రాసిరి దానికి. శ్రీ ఆనందగిరులు మహాభారతవాక్యమును ప్రమాణముగ నుదాహరించిరి. కొందఱు స్మృతికర్త లట్లే తలంచిరి. భాగవతములోఁ గొందఱు క్షత్త్రియులు సన్న్యాసము స్వీకరించిన ట్లున్నది. బుద్ధగయ యందున్న ఆనందగిరిమఠములోని సన్న్యాసి పూర్వాశ్రమమునందు క్షత్త్రియుఁడ నని నాతో 1894-వ యేటఁ జెప్పెను. శూద్రులలో బైరాగులు, పండారులు, అనుసన్న్యాసులు కలరు. వారు శ్రుతిస్మృతుల ననుసరించినవారు కారు. సిక్కుల సాంప్రదాయము శైవదీక్ష లోనగువాని ననుసరించినవారు.

## ౧౨. ఆశ్రమావాంతరభేదములు

బ్రహ్మచర్యగార్హస్థ్యవానప్రస్థసన్న్యాసాశ్రమములలోఁ బ్రత్యేక మొకటిలో నాలుగు భేదములుగ నుండి మొత్తమున ౧౬ భేదములు గల వని మహాభారతములోను కాత్యాయనస్మృతిలో నున్నది. బ్రహ్మచారులు గాయత్ర, బ్రాహ్మ, ప్రాజాపత్య (బృహన్) నైష్ఠికు లని నాలుగు తెఱంగులు:—౧. ఉపనయనానంతరము, క్షారలవణములు వర్జించి మూఁడు రాత్రు లన్నముఁ దిని గాయత్రి నుపాసించిన బ్రహ్మచారి గాయత్రుఁడు. వాఁడు ౪౮ ఏండ్లు వేదముఁ జదువుచు బ్రహ్మచర్యము జరుపవలయు. ౨. ప్రతివేదమును ౧౨ లేక ౧౦ ఏండ్లునాని యర్థముతోఁగూడ వచ్చువఱకుఁ గాని చదువు వాఁడు బ్రాహ్మఁడు. ౩. తనభార్యతో ఋతుకాలమందు మాత్రమే సంగముఁ జేయుచు నితరులభార్యల నెప్పుడును చూడ కుండువాఁడు ప్రాజాపత్యుఁడు. ౪. చనిపోవువఱకు గురువులను వదలక వారియొద్దనే యుండువాఁడు నైష్ఠికుఁడు లేక బృహన్నైష్ఠికుఁడు. గృహస్థులు వార్తాకవృత్తి శాలీనవృత్తి, యాయావర, ఘోరసన్న్యాసికు లని నాలుగు తెఱఁగులు:—(౧) వ్యవసాయము, గోరక్షణము, వర్తకము, భూతములకు హింస లేకుండ నాచరించుచు, నారేండ్లు కర్మములను జేయుచు నాత్మను బ్రార్థించువాఁడు వార్తాకవృత్తుఁడు. (౨) కర్మములను జేయుచు నితరులకుఁ జేయింపకయు వేదముఁ జదువుచును, నితరులకు వేదముఁ జెప్పకయు, నితరులకు దానముఁ జేయుచుఁ దాను దానమును బట్టకయు, నూరేండ్లు కర్మములను జేయుచు నాత్మను బ్రార్థించువాఁడు శాలీనవృత్తుఁడు. (౩) కర్మములఁ జేయుచు, వేదముఁ జదువుచును, నితరులకుఁ జెప్పుచు దానమిచ్చుచుఁ బుచ్చుకొనుచు నుండి నూరేండ్లుకర్మములను జేయుచు నాత్మను బ్రార్థించువాఁడు యాయావరుఁడు. (౪) తనకుఁ గావలసినవీళ్లను తానే తోడుకొని నిత్యకర్మములను నిర్వర్తించుకొనుచుఁ, బ్రతిదినమును తనతావును తానే బాగుచేసికొనుచు ఉంఛవృత్తి నాచరించుచు, నూరేండ్లు కర్మములను జేయుచు నాత్మను బ్రార్థించువాఁడు ఘోరసన్న్యాసికుఁడు. వానప్రస్థులు వైఖాన సౌదుంబర, వాలఖిల్య, ఫేనపు లని నాలుగు తెఱఁగులు:—(౧) మనుష్యులచే నాటఁబడని యోషధులవలన బుట్టిన దుంపలను, వృక్షములవలన బుట్టినఫలములను, ఊరిబయలున వండి పంచమహాయజ్ఞము లను నిత్యకర్మములను చేయుచు, ఆత్మను బ్రార్థించువాఁడు వైఖానసుఁడు. (౨) రేఁగులు, నీవారములు మున్నగుగింజలను వండి పంచమహాయజ్ఞములను జేయుచు, నాత్మను బ్రార్థించువాఁడు ఔదుంబరుఁడు. (౩) జడలను ధరించి నారచీరలను తోళ్లను బెరడులను, కట్టుకొని, కార్తికపూర్ణిమనాఁ డదివఱకు సేకరించినధాన్యమును వదలి, తిరిగి క్రొత్తవాని నార్జించి మిగిలిన యెనిమిది నెలలకు నుంచుకొని, పంచమహాయజ్ఞములను జేయుచు నాత్మను బ్రార్థించువాఁడు వాలఖిల్యుఁడు. (౪) వాడినయాకులను బండ్లను దిని యొక్కడనైన నుండువాఁడు ఫేనపుఁడు. సన్న్యాసులు, కుటీచక, బహూదక, హంస, పరమహంస లని నాలుగు తెఱఁగులు. (౧) తనకొడుకులయిండ్లలో భిక్ష మెత్తుచు నాత్మను బ్రార్థించువాఁడు కుటీచకుఁడు. (౨) త్రిదండమును కమండలమును, జలపవిత్రము లగు పాదుకలను, దర్భాసనాదులను, శిఖాయజ్ఞోపవీతములను, కాషాయమును, ధరించి సాధువు లగుబ్రాహ్మణులగృహములందు భిక్షను జేయుచు నాత్మను బ్రార్థించువాఁడు బహూదకుఁడు. (౩) ఒక్కదండమును మాత్రమే పట్టుకొని శిఖాయజ్ఞోపవీతములను ధరించి కమండలువుఁ జేతిలోఁ దీసికొని యొక్కొక్క రాత్రి నొక్కొక్క యూర నివసించుచుఁ బుణ్యక్షేత్రములందు నెనిమిది గాని అయిదు గాని దినము లుండుచు నొకరాత్రి గాని రెండు రాత్రులు గాని కృచ్ఛ్రచాంద్రాయణాదిప్రాయశ్చిత్తములను జేయుచు నాత్మను బ్రార్థించువాఁడు హంస (౪) ఒకదండమును, బొంతను, గోచిని ధరించి

యాశ్రమచిహ్నములను గనఁబఱచుచు, పిచ్చివాఁడు కాకున్నను పిచ్చి
వానివలె నుండుచు, త్రిదండకమండలములను ఉట్టిని తనకాలినీటిచే
బవిత్రము లగుపాదుకలను, దర్భాద్యాసనములను, శిఖాయజ్ఞోపవీత
ములనువదలి పాడుకొంపలలోను, గుళ్లలోను బసజేయుచు ధర్మా
ధర్మములనుగాని, సత్యాసత్యములనుగాని, లక్ష్యపెట్టక సర్వవిధముల
శీతోష్ణసుఖదుఃఖాదులను సహించుచు మట్టిబెడ్డ, రాయి, బంగారు,
లోనగువానియందు సమత్వబుద్ధిని గలిగి లోకములోనున్న బ్రాహ్మ
ణాదినాలుగువర్ణములలో భిక్షఁ జేయుచు నాత్మకు మోక్షసంపా
దకముఁ జేయువాఁడు పరమహంస. బ్రహ్మపురాణాదులలో వాన
ప్రస్థసన్న్యాసములను కలియుగంబున వర్జింపఁదగునని చెప్పినను
స్మృతికంటె శ్రుతి యొక్కవప్రమాణము గలదని యెంచి శంకర
రామానుజ మధ్వాద్యాచార్యులు సన్న్యాసము నంగీకరించిరి. ఇప్ప
టికిని బరమహంస లగునద్వైతులు ద్వైతులును శిఖాయజ్ఞోప
వీతములు గలవుటీచక, బహూదకులును విశిష్టాద్వైతులు నున్నారు.
వానప్రస్థులు మాత్ర మరుదు.

## ౧౩. వర్ణాశ్రమధర్మవిశేషములు

బ్రాహ్మణవర్ణములోఁ బుట్టి గృహస్థాశ్రమమం దున్నవాఁడు
మాత్రమే బృహస్పతిసవమను కర్మముఁ జేయనగుఁ గాని క్షత్రియ
గృహస్థుఁడుగాని, వైశ్యగృహస్థుఁడుగాని చేయఁగూడదు. అట్లే
క్షత్రియగృహస్థునకే రాజసూయయాగము విహితము గాని లాతి
యిరువురకుఁ గాదు. అట్లే వైశ్యస్తోమమను క్రతువును వైశ్యగృహ
స్థుఁడుమాత్రమే చేయనగును గాని యితరులు చేయరాదు. ఇట్లే ఉప
నయనాదిసంస్కారములలోఁ గూడ (ద్విజత్రయములోఁ గూడ)
భిన్నధర్మములు గలవు. వేదశాఖ లనేకము లుండుటచే నాయాశాఖా
ధ్యేత లగువారికి భిన్నభిన్నధర్మములు గలవు.

## ౧౪. వర్ణాశ్రమధర్మసూక్ష్మములు

పూర్వయుగములలోఁ గొందఱు పెద్ద లాచరించినధర్మములు
మన్వాదిధర్మశాస్త్రముల నతిక్రమించుచున్నవి. క్షత్రియు లగు
శ్రీరామచంద్రులు శబర్యాతిథ్యము నంగీకరించుటయు, శ్రీబలరామ
కృష్ణులు క్షత్రియు లయినను వైశ్యుఁ డగు నందునింట 10,11 ఏండ్లు
పెరుగుటయు, విదురాదులయింటఁ గుడుచుటయు, లోనుగాఁగల
దృష్టాంతములు స్మృతిపురాణేతిహాసములలో మెండుగ గలవు.
పూర్వయుగములలో బ్రాహ్మణులు, క్షత్రియులు కలసితిన్నట్లును
బ్రాహ్మణులు గోఘాగాదిమాంసభక్షకు లయినట్లు నున్నది. ద్వాపర
కలిసంధిలో నుదయించిన కృపద్రోణాశ్వత్థామాచార్యులు బ్రాహ్మ
ణవర్ణ లయినను నాయుధీయకమే (అస్త్రశస్త్రవిద్య) వారివృత్తియై
నందులకు భారతము ప్రమాణము. అది వారికి నాపద్ధర్మము గాదు. ద్రో
ణాచార్యులకు ద్రుపదరాజురాజ్య మగుపాంచాలములోని సగము వారి
శిష్యోత్తముఁ డగునర్జునుఁడు గురుదక్షిణగ నీయఁగ నాచార్యులు
దానిని బాలింపలేదా? అది క్షత్రియధర్మము గాదా? కురుపాండవు
లకు గురువులు, బ్రాహ్మణులు నగు ద్రోణకృపాశ్వత్థామాచార్యులకు
తమ ధర్మముకానిదియుఁ బరధర్మము, నధర్మమయు క్షమను నగు యు
ద్ధముఁ గావింపలేదా? అది ధర్మమా? ధర్మాభాసమా? అశ్వత్థామ
రాత్రి నిద్రించుచున్న పాండవసేనను జంపుటయు, నపాండవముఁ
గావింప నస్త్రమును బ్రయోగించుటయు ధర్మమా? అధర్మమా? ఇట్టి
ధర్మాభాసములు భారతాదులలోఁ జాల పొడగట్టును. ద్వాపరాం
తమునతో మత్స్యగంధియందుఁ బరాశరర్షులకు శ్రీవేదవ్యాసు లుద
యించినను, బీజప్రభావముచే బుష్యశృంగునివలె విప్రర్షిగనే పరి
గణింపఁబడెను. క్షేత్రజులగు పాండవులు దేవబీజోత్పన్ను లయినను
దల్లిది యగు క్షత్రియకులమువారుగ నెన్నఁబడిరి. తపోబలాదులచే
విశ్వామిత్రమరుదేవాపి లోనగు క్షత్రియు లొకజన్మమందే రాజర్షు
లుగను బ్రహ్మర్షులుగను గణనముఁ జేయఁబడిరి. నహుషున కొకజన్మము
లోనే యుత్కృష్టాపకర్షజంతుత్వము లభించెను. నాభాగకొడుకులు
జన్మమున క్షత్రియులయినను వృత్తిచే వైశ్యు లయినట్లు భాగవత
ములోనున్నది. కసాయివృత్తి నాచరించు ధర్మవ్యాధుఁడు బ్రాహ్మణున
కధ్యాత్మగురు వయినట్లు వనపర్వములో వివరింపఁ బడినది. ఇట్టి ధర్మ
సూక్ష్మము లనేకములు మన ప్రాచీనమతగ్రంథములందుఁ గలవు.
మఱియు, శల్యకర్ణసంవాదమువలన మద్రాంగాదిదేశములలో వివాహ
నియమములు లేవనియు తఱచుగ నా దేశస్థులు స్త్రీసంగులు పానా
సక్తు లనియు మ్లేచ్ఛాచారపరులు ననియు స్పష్టపడఁగలదు. ధను
శ్శాస్త్రపరీక్షలో (ఆదిపర్వము 136,137 అ.) కృపాచార్యుఁడు
కర్ణునికర్ణ మడుగ దుర్యోధనుఁడు రాజులకు సత్కులీనము, శూరత్వ
ము, సేనలను నడుపుట యను మూఁడుకారణము లని చెప్పెను.
కర్ణుఁడు బదులు చెప్పక తలవంపఁగ దుర్యోధనుఁడు కర్ణున కంగ
రాజ్యాభిషేకముఁ జేసి రాజును జేసెను. అంత భీమసేనుఁడు కర్ణుఁడు
సూతపుత్త్రుఁ డనియు, యుద్ధముఁ జేయుటకును, రాజ్యము చేయుట
కును నతఁడు తగఁ డనియు నతనిధర్మము సారథ్య మనియు నధిక్షే
పింపఁ గర్ణుఁడు నిర్విణ్ణుఁడై యూరకుండె. దుర్యోధనుఁ డిట్లు త్తర
మిచ్చెను: నదీమూలమువలె రాజులజన్మము గుప్తము. జగత్తును మ్రింగు
బడబాగ్ని జలమునఁ బుట్టును. దానవులను జంపువిల్లు మర్త్యుఁ డగు
దధీచిరాజుయొక్క వెన్నెముకవలనఁ జేయఁబడినది. సర్వదేవతలశక్తి
గలిగిన కుమారస్వామి యుత్పత్తి తెలియదు. కొంద అగ్నికిఁ బుట్టె
ననియు, కొందఱు కృత్తిక కనియుఁ, గొందఱు రుద్రదేవునకనియుఁ,
గొందఱు గంగాదేవికి ననియు బల్కుదురు. క్షత్రియకులములోఁ
బుట్టినవారు బ్రాహ్మణు లయినట్లు విన్నారము. విశ్వామిత్రు లగు
జాతిక్షత్రియులు బ్రహ్మణును బొందిరి. గురువులకు గురు వగు
ద్రోణాచార్యులు మానికలోఁ బుట్టిరి. కృపాచార్యులు గడ్డిదుప్పలోఁ
బుట్టెను. మీ (పాండవుల) జన్మకారణము వారుఁ దెలియును. అస్త్ర
శస్త్రకౌశలముచేఁ గర్ణుఁ డంగదేశమునకే గాదు జగత్తున కంతయును
నధిపతిగ నుండదగును. కానని నహుషునకు ధర్మరాజు మనుష్యులలో
మహనీయకము లగు గుణకర్మములు లోపించిన ననియు, బ్రాహ్మణ
గుణము లితరవర్ణములయందును లాతివర్ణులలో విప్రగుణములును నగ
పడుచున్నవనియు, వర్ణసంకరము కనిపించుచున్నదనియు, వృత్తము

లేక ప్రవర్తనము, లేనిచో సర్వులు శూద్రప్రాయు లనియుఁ దెలియ నగు నని చెప్పెను. (వనపర్వము ౧౮౦ అ.)

## ౧౯. వర్ణాశ్రమాభాసములు

కాన ద్వాపరాంతమునుండి వర్ణాశ్రమధర్మములలో గొన్ని మన్వాదిశాస్త్రానుగుణములుగ నున్న ట్లగపడదు. పిదప రానురాను క్షత్రియప్రభువులుక్షీణించుటచేతను, బ్రాహ్మణాదు లార్యావర్తము వదలి వింధ్యదక్షిణమున వ్యాపించుటచేతను గురువులుగ నుండవలసిన బ్రాహ్మణు లర్థకామపరులై ధర్మము నంతఁగఁ బాటింపక పోవుటచేతను, బౌద్ధయవనమ్లేచ్ఛప్రభుత్వములు ద్రావిడసాంగత్యములు వృద్ధికాఁగను, బౌద్ధజైనమ్లేచ్ఛసిక్కు క్రీస్తుమతాదులవ్యాప్తివలనను, దేశకులగృహాచారములు క్రమముగ మారి పూర్వధర్మములలో వ్యత్యయము గలిగించెను. జనులధర్మములు దేశకాలానుగుణముగఁ దప్పక మారును. వానిమార్పు నీరు పల్లమును వెదుకునట్లు స్వభావసిద్ధము. గుణకర్మములవలనఁ బుట్టినవర్ణములకు రానురాను ధర్మచ్యుతి గలిగెను. దేశకాలనిమిత్తములచే స్మృతిసూత్రకారులు ధర్మవ్యవస్థ నప్పుడప్పుడు చేయుటకు వాని మారుదలయే కారణము. "ధర్మజ్ఞసమయః ప్రమాణం వేదాశ్చ" అని ధర్మమును దెలిసినవారి కట్టుబాటు వేదమువలెఁ బ్రమాణ మని సూత్రకారులు సెల విచ్చిరి. కాననే ప్రబలవ్యాప్తిగల యాచారములను శిష్టు లంగీకరించుటచే నవి శాస్త్రవిరుద్ధము లయినను, వానిని ధర్మములుగ స్వీకరింపవలయు నని బోధాయనర్షులు ౨౫౦౦ ఏండ్లక్రింద నుడివెను. అట్లే గౌతమాస్తంబాశ్వలాయనకాత్యాయనాది ఋషు లితరయాచారములను మన్నించిరి. తర్వాతఁ గూడ ౨౮ గురు ధర్మశాస్త్రజ్ఞులు తైత్తిరీయశిక్షావల్ల్యుపాంతానువాకాదుల ననుసరించి ధర్మసంగ్రహము చేసిరి. పిదప బంగాళోఢ్రదేశములకు జగన్నాథాదులు, గుజరాతీమహారాష్ట్రములకు మయూఖాకారాదులు, నితర హిందూస్థానమునకు విజ్ఞానేశ్వరమాధవాచార్యాదులు స్మృతులలోని యాచారవ్యవహారప్రాయశ్చిత్తకాండముల నన్నింటికిఁగాని లేక కొన్నింటికిఁగాని వ్యాఖ్యలను జేసి, వానిలో నప్పటి శిష్టాచారములను గలిపిరి. అంతకు ముందే బహ్వాచారభేదములచే బ్రాహ్మణాదులు గౌడు లనియు ద్రావిడు లనియు విభక్తులైరి. ఆయుభయదేశముల మధ్యను వింధ్యపర్వతము గలదు. దానికి నుత్తరమున నున్నవారి నౌత్తరాహు లనియు దక్షిణమున నున్నవారిని దాక్షిణాత్యు లనియు, ననియెదరు. ఈ యాచారములలోఁ బ్రాచీనము లగు కొన్నింటిని 'ఆర్యదేశాచారము' లను శీర్షికక్రింద నీ వ్యాసారంభమున సంగ్రహించినాను. వాని ప్రచారము బోధాయనకాలమునకుఁ బూర్వము నుండి నేఁటివఱకుఁ గలదు. వానిని మాధవాచార్యులు ౬౦౦ ఏండ్లక్రింద ననువదించి యంగీకరించిరి. అట్లే కర్ణాటకమహారాష్ట్రాంధ్రాది శిష్టు లంగీకరించిన మేనఱికము లోనగు వివాహాచారములను ఋగ్వేదగత సర్వ సూక్తము ననుసరించి స్మృతులకు వ్యతిరేకము లయినను మాధవాచార్యులు సమర్థించిరి. కాని యాయుర్వేదజ్ఞులును, 'దేశస్థులలో దేహపాటవ ముండుట యావశ్యక' మనువారును, నౌత్తరాహులును, దాని నొప్పరు. అరవ ద్రావిడులలోఁ గూడ నీ యాచారము ద్రవ్యాశాదులచేఁ బ్రవేశించిన దని వగచుచున్నాను. కనుకనే ప్రాయికముగ ద్రావిడులకంటె గౌడులలో కాయపుష్టిగలవారు మెండు. మఱియు నేపాళములో మహిషమాంసమును బ్రాహ్మణులు భక్షింతురు. కాశ్మీరదేశములో మహమ్మదీయులు హిందువుల సేవకులు. వారు వంటఁజేసినచో బ్రాహ్మణులు వైశ్వదేవమును జేసి భుజించెదరు. పూర్వము శూద్రులు వండినచో విప్రులు వైశ్వదేవముఁ జేయనగు నను నాపస్తంబవాక్యము వలె నీయాచార మిప్పుడున్నది. ఓఢ్రబంగాళమైథిలీబ్రాహ్మణులు మత్స్యములను బంగాళములోని శక్తిపూజను జేయువిప్రులు మేకమాంసమును తినియెదరు. సింధుదేశములో వైశ్యులు బ్రాహ్మణక్షత్రియులకు వంటఁ జేయుదురు. ఉత్తరపశ్చిమదేశములలో భోజనకాలమందు విప్రులకు దృష్టిదోషము లేదు. శ్రీజగన్నాథములో వర్ణవిచక్షణము లేకయు, నెంగిలి లేకయు, స్వామిప్రసాదమును నాలుగువర్ణములవారు స్వీకరింతురు. మాళ్వా లోనగు ప్రదేశములలోఁ దోళ్లతిత్తులలోని నీరును బ్రాహ్మణాదులు ప్రకృతపు కొళాయినీరువలె గ్రహింతురు. ఉత్తరదేశములలో బ్రాహ్మణేతరులు తెచ్చిననీరు విప్రులు వాడుదురు. ముట్టయినస్త్రీని మహారాష్ట్రదేశములో దూరముగ నుంచరు. మడిబట్ట కట్టుట దేహశౌచనిమిత్త మేర్పడినను దానివిషయమై యాంధ్రద్రావిడగౌడాదులలో భిన్నాచారములు గలవు. విచారించినచో నన్నింటిలోను లోపములఁ గనిపెట్టనగు. దక్షిణవైష్ణవాద్యాలయములలో నన్నవినియోగము, నన్నవిక్రయము, నెంతటి యనాచారమునకును దుర్వృత్తమునకును దావిచ్చుచున్నవో. వివేకు లరయ నగు. ఉత్తరదేవాలయములలో నున్న సత్త్వభక్తివిరక్తిహేతువులు దక్షిణదేవతాగృహములందుఁ గానరాక రాజసతామసవికారములు మెండుగఁ బొడఁగట్టును. ఇది శోచనీయము. ప్రపత్తి యనుసాకు బెట్టుకొని శ్రౌతస్మార్తాదికర్మములకుఁ బ్రయోజనము లే దని వానికి సున్న చుట్టి సర్వఫలములు దేవాలయములోని అర్చావిగ్రహపూజవలననే లభ్యము లని ద్రవిడప్రబంధరహస్యార్థము. నెఱుగక ప్రవర్తించువారి మోహ మేమని చెప్పవచ్చు? మఱియుఁ, బరమతస్థు లగు రాజులు మన దేశపాలనముఁ జేయుటచేతను, శైవశాక్తవైష్ణవాద్యాగమప్రాబల్యముచేతను, బ్రాహ్మణాదులు నదృష్టమగుఁ బరలోకఫలముకంటె దృష్ట మగు నీలోకఫలమునే యెక్కువ కోరుటచేతను, విప్రులకు ద్రవ్యఖ్యాతిపూజాధికారములం దాస హెచ్చగుటచేతను, వేదశాస్త్రవిద్యలను యాచారములను వదలి క్రొత్తత్రోవలఁ ద్రొక్కిరి. కాననే 'నందాంతం క్షత్రియకులం' అని పురాణములలో నుండుటంబట్టియుఁ, బూర్వక్షత్రియు లిప్పటికి సుమారు ౨౩౦౦ ఏండ్లక్రింద నంతరించిన ట్లగపడును. ౬౦౦ ఏండ్లక్రింద మాధవాచార్యులు శ్రుతిస్మృతిసూత్రాదులలోఁ జెప్పిన ముఖ్యబ్రాహ్మణముఖ్యశూద్రులు లే రనియు, క్షత్రియవైశ్యులస్వరూపమే లే దనియుఁ, బరాశరస్మృతివ్యాఖ్యలో స్పష్టముగ వ్రాసిరి. ఇప్పటికి షుమారు ౨౦౦ ఏండ్లక్రింద నున్న వేంకటాధ్వరుల విశ్వగుణాదర్శములో భారతములోనిదేశముల వివిధాచారములవర్ణనముఁ జూడ నింక

నెక్కువవ్యత్యయము లగపడు. అప్పుడు తురకమునకును, నిప్పు డింగ్లీషునకును వ్యాప్తి. అప్పుడు తురకలు రాజులు. ఇప్పు డింగ్లీషువారు ప్రభువులు. మఱియు, రాజరాజనరేంద్రుని కాలమునుండి యాంధ్రదేశములో సంస్కృతముకంటె తెలుఁగు చదువునకు వ్యాప్తి. ప్రాచీన విద్యాచారములు హిందూదేశమం దంతటను మాఱుటకు నింక నొక ప్రబలకారణము గలదు. బౌద్ధమతస్థులను మనదేశములోనుండి తఱిమినతర్వాతఁ బురాణాగమాదులవ్యాప్తి యిప్పటికి ౨౦౦౦ ఏండ్లనుండి హెచ్చి వివిధాచారములు ప్రబలి పూర్వాచారములలోఁ గొన్నింటిని గప్పి; గొన్నింటిని మార్చినవి. బౌద్ధకాలము (బి. సి. ౫౦౦-ఏ. డి. ౨౦౦) నుండి దేశభాషలప్రాబల్యము, శూద్రప్రాయు లగు క్షత్రియేతరుల రాజ్యపాలనము హెచ్చెను. ౧౫౦౦ ఏండ్లనుండి వైదికు లగు ద్రమిడ, టంక, భర్తృ, ప్రపంచ, కుమారిల, శంకర, రామానుజ, మధ్వ, వల్లభ, నింభార్క, విజ్ఞాన భిక్షు లోనగు మతాచార్యులును, వారిశిష్యప్రశిష్యులును, వేదవేదాంతాదులకు భిన్నభిన్నార్థములను వ్రాసి వానిని వ్యాపింపఁజేయుటచేఁ గర్మవిషయములోఁ గూడ వారియనుయాయులు భిన్నమార్గస్థు లయిరి, దానిచే వర్ణాశ్రమధర్మములు వే ఱయినవి. ౧౦౦౦ ఏండ్లనుండి మనదేశమున భక్తు లనుదాసకూటము బయలువెడలి, భక్తిజ్ఞానవైరాగ్యలోకోపకారములను బుట్టింపని కేవల శ్రౌతస్మార్తకర్మమును నిరసించి దైవభక్తినివృద్ధిపఱిచిరి. ఉత్తరహిందూస్థానమున గురునానక్, తులసీదాసు, కబీరుదాసు, కమల్దాసు, శ్రీకృష్ణచైతన్యులు లోనగువా రుదయించి కొందఱు వేదభిన్నధర్మములను, గొంద ఱేకవర్ణమునుఁ జెప్పి కర్మముకంటె భక్తిజ్ఞానవైరాగ్యములే మోక్షదాయకము లనియు వర్ణవిభాగ మంతఁగ గమనింపఁగూడ దనియు, బోధించిరి. అట్లే మహారాష్ట్రములో నివృత్తి, సోపానుఁడు, ముక్తాబాయి, జాని, అకోబాయి, వేణుబాయి, నామదేవుఁడు, ఏకనాథుఁడు, రామదాసుస్వామి, తుకారాం, షేక్ మహమ్మదు, దామాజీ, చొక్కమేళ, నరహరి, సానారుఁడు మున్నగువారు బోధించిరి. ఆంధ్రదేశములో వేమన, రామదాసు, నృసింహదాసు, నిట్టలప్రకాశదాసు, రంగదాసు లోనగువారి చర్యలు గూడ నట్లే పరిణమించినవి. ద్రవిడదేశములో నమ్మాళ్వారు, పెరియాళ్వారు, తొండరప్పొడియాళ్వారు, తిరుమంగయాళ్వారు, లోనగు వైష్ణవాగ్రేసరులు, అప్పర్, అవ్వ, మాణిక్యవాచకర్, సుందరర్, తాయుమానవర్, లోనగు శైవభక్తులు, కన్నడదేశములో, పురందరదాసు, జగన్నాథదాసు, కనకదాసు, బసవేశ్వరుఁడు, లోనగు విష్ణుశివభక్తులుఁ దేశభాషలలో గద్యపద్యయక్షగానములలో బోధించిరి. ఇట్లే ద్వైతాద్వైతవిశిష్టాద్వైతశైవాదిమతములను వ్యాపింపఁజేయు బ్రహ్మక్షత్రియాది పీఠస్థులు గూడఁ బూర్వకర్మములను వారిమతముల కనుకూలముగ మార్చిరి. ద్రావిడదేశములో శూద్రు లగు పండారపీఠస్థులు శైవాగమములను, కన్నడ తెలుఁగు దేశములలో నున్న శూద్రు లగు వీరశైవపీఠస్థులు శైవదీక్షను వ్యాపింపఁ జేసి, కర్మములను మార్చిరి. భక్తిప్రపత్తిమార్గములకు వ్యాప్తి ఇన్ని కారణములచే నెక్కువ యయ్యె. ఈ భక్తుల మతవ్యాప్తియు దీనికి ముం దున్న బౌద్ధజైనాదిమతవ్యాప్తియు, దానికి ముం దున్న భాగవతభాగవతాదుల వ్యాప్తియు, హింసాపూర్వకము లగు శ్రౌతకర్మములకంటె నహింసారూపము లగు శ్రవణ కీర్తన జప స్మరణాదుల వారిహార భక్తిబోధకము లను నమ్మకమును గలిగించెను. కాననే శంకరరామానుజమధ్వశుకాచార్యులు బ్రహ్మమీమాంసలోని 'అశుద్ధ మితి చేన్న శబ్దాత్' అను సూత్రమున కర్థము హింసాపూర్వక మగు శ్రౌతకర్మము వేదప్రమాణము గలది గానఁ జేయ నగు నని వ్రాసినను, మాన్యులు పిష్టపశువుతో యజ్ఞాదులను చేయుచున్నారు. తెంగలి వైష్ణవవల్లభీయులు వానిని చేయుటలేదు. ద్వైతాద్వైతవిశిష్టమతవ్యాప్తి ప్రబలఁగ నామతస్థులలో దేశాదినిమిత్తములచే భిన్నాచారము లెక్కువై పెక్కునిబంధన గ్రంథములు ప్రబలినవి. నిర్ణయసింధువు, ధర్మసింధువు, హేమాద్రి, కమలాకరము, వైద్యనాథదీక్షితీయము, ఆనందాఙ్పిళ్ల, తోళప్పర్ స్మృతి, లోనగునవి దృష్టాంతములు. ఇవి బయలువెడలి, యాంధ్రమహారాష్ట్రకర్ణాటద్రవిడదేశములలోని శిష్టు లంగీకరించుటచే నూతనాచారములను ధర్మములుగ నెన్నఁబడినట్లు ప్రకటనముఁ జేసెను. తర్వాత రాను రాను నాయాచారములు మారినవి. చాళుక్యతుళురెడ్ల ప్రభుత్వకాలమునుండి వారివ్యవహారము లాంధ్రదేశములో బ్రాహ్మణాదులు సాగించుటచే లౌకికవృత్తిలోఁ బ్రవేశించిన కొందఱు బ్రాహ్మణు లధ్యాపన యాజనప్రతిగ్రహము లగు మూఁడు జీవికలను వదలిరి. వారిజీవనము దేశప్రభువులసేవవలన జరుగుచుండుటచే నాకర్మములను వీడిరి. వారును వారిసంతతివారును, వారి యనుయాయులును, రెడ్లక్రిందను నితరమ్లేచ్ఛాదిరాజులక్రిందను రాజ్యతంత్రములలోను సేనాధిపత్యములలోను, దేశపాండ్యమొదలు గ్రామకరణికమువఱకు నుండు నుద్యోగములలోఁ బ్రవేశించి మనదేశమున కభివృద్ధిని జేసిరి. వారినే నియోగిబ్రాహ్మణు లందురు. ఇంగ్లీషు ప్రభుత్వము వచ్చినపిదప నితరబ్రాహ్మణు లగు వైదికులుగూడ నింగ్లీషును జదివి లౌకికోద్యోగములలోను ప్లీడరు మొదలగు ప్రాడ్వివాకపదవులలోను వర్తకవ్యాపారములలోను బ్రవేశించుటచే నిపుడు లౌకికపనులలో మెలగు బ్రాహ్మణులలో వైదికులు నియోగులు నను భేదము నామమాత్రావశిష్ట మయినది. వేదశాస్త్రసంపన్ను లగు వైదికులపిల్ల లింగ్లీషు నభ్యసించి లౌకికపుపనులు సేయుట మనము ప్రతిదినముఁ జూచుచున్నాము గద! మఱియు, బ్రాహ్మణు లందఱు నొకవర్ణమువా రయినను దేశభాషాచారములు భిన్నము లగుటచేతను, నొకభాషను మాటాడువారిలో వివాహాదిసంబంధమును జేయుచు వచ్చినారు. మఱియు నాంధ్రబ్రాహ్మణులలో నుండు నవాంతరదేశములను బురస్కరించికొని వేగినాఁడు, వెలినాఁడు, తెలుఁగునాఁడు, మురికినాఁడు, కాసలనాఁడు లోనగు భేదములు స్వల్పాచారభేదములచేఁ గలిగి వివాహాదిసంబంధముల నేనాఁడివా రానాఁడియందే చేయుదురు. వానిలోఁగూడ నవాంతరభేదములు గలవు. వీరు నియోగిబ్రాహ్మణులతో సంబంధమును జేయరు. నియోగులలో నారువేలవారు, పాఁకనాఁటివారు అని రెండు తెగలు. వారు పరస్పరము సంబంధమును జేయరు. ఆరువేలవారి యాడపిల్లలను గోలకొండవ్యాపారు

లగుఁ తెలగాణ్యనియోగులు, శ్రీవైష్ణవులును, మాధ్వులును నిత్తురు. కాని ఈ యుభయులపిల్లలను నియోగులపిల్లవాండ్రు కీయరు. శ్రీవైష్ణవబ్రాహ్మణులు తెనుఁగే మాటాడినను, ద్రావిడులు నాంధ్రులు నను రెండు తెగలుగా నుందురు. వారిలో 'వడి' సంఘము అను నవాంతరభేదము లనేకము లుండుటచేఁ బరస్పరము భోజనసంబంధములను జేయరు. మాధ్వులలో గృహస్థులు ఆచార్యులు అనుభేద మున్నను భోజనసంబంధములు గలుగును. "సంగిసంగు" లనువారు మాత్రము స్మార్తగంధము తాకరు. అట్లే శూద్రులలో వెలమ, కమ్మ, కాపు, తెలగ, బలిజ, సెట్టిబలిజ, లింగబలిజ, జంగము, సాతాని, ముతరాసు, రెడ్డి, రెడ్డిక, కాళింగి, మేదర, గొల్ల, గాజులు, గవండ్ల, ఈడిగ, జాండ్ర, సాలి, పట్టుసాలి, పల్లె, మరకాడు, బోగము, సాని, చాకలి, మంగలి, బోయ, యానాది లోనగు పలు తెగలు నాచారములు గలవు. కంసాలి, కంచర, వడ్రంగి, చిత్రకారు లగు మచ్చెవారు, రంగిరీజు, నంబి, తంబళి లోనగువా రవాంతరవర్ణులు. వా రందఱిలోఁ బరస్పరము భోజనసంబంధాదులు లేవు. వీ రందఱు పంచమవర్ణు లగు మాల మాదిగలచే భూమియొక్క వ్యవసాయపుపనులను, పశుపాలనమును జేయించుదురు గాని, వారిని యిండ్లదగ్గఱ గాపురము నుంచరు. వారి నంటరు. వారిని వేఱుపాలెములలోఁ గాపుర ముంచెదరు. ద్రావిడ కర్ణాటకమహారాష్ట్రఘూర్జరగౌడాదులలోఁ గూడ ననేకులు భిన్నము లగు తెగలవారు కలరు. ఆంధ్రక్షత్రియులలోఁ జాలమంది శూద్రాచారము నవలంబించిరి. వారిస్త్రీలలో ఘోషాయుండుటచే శూద్రుల సేవ వారి కావశ్యకము. ఆ యుభయులకు వ్యవసాయము సమాన ధర్మము. కన్యకాపరమేశ్వరిని కులదేవతఁగ స్వీకరించి శ్రౌతస్మార్త కర్మములను వదలి యాంధ్రవైశ్యులు పురాణాచారముల నవలంబించిరి. కాన వారిని "గౌరకోమటు లందురు. కళింగకోమట్లు మాంసాశనులు వారు గంజాముజిల్లాలోని యుత్తరభాగమున నుండి యున్నారు. వారిభాష యోఢ్రము. ఇటీవల నాంధ్రవైశ్యులలోఁ గొందఱు స్మార్తకర్మమును జేయించికొనుచున్నారు. కాని వారికి ఆ కర్మములను గుఱించిన జ్ఞానము శ్రద్ధయు లేదు గాన దానివ్యాప్తి క్షీణించుచున్నది. ప్రకృతబ్రాహ్మణులకే శ్రౌతస్మార్తకర్మములందు శ్రద్ధ నశించుచున్నది యన నితరవర్ణులకుఁ జెప్పవలయునా? ఇప్పటి బ్రాహ్మణాది సర్వవర్ణులలో వారిస్వధర్మములను వదలి ధాన్యకుంరాదిక్రయవిక్రయలు సభలలో తప్పుడుసాక్ష్య మిచ్చువారు, అగ్రహారాదులు గలవారు, వడ్డీ లోనగు వర్తకమును జేయువారు, లౌకికోద్యోగస్థులు, ఉపాధ్యాయులు, జమీందారులు, పరిచారకులు, భూమిని సాగుచేయువారు, ముష్టి నెత్తుకొనువారు, చౌర్యాది దుర్వృత్తులు గలవా రున్నారు. మొత్తమున సర్వవర్ణులలోఁ జాలమంది వాణిజ్యాదిరూప మగు వైశ్యధర్మమును ద్రవ్యసంగ్రహాయత్నము నిప్పుడు విశేషముగఁ జేయుచున్నారు. సర్వాశ్రములు గృహస్థాశ్రమ ధర్మమును సామాన్యముగ నాచరించుచున్నారు. కృషి గోరక్షణము ముఖ్యముగ శూద్రుల కున్నను బ్రాహ్మణక్షత్రియులలోఁ జాలమంది, వైశ్యులలో గొందఱు మాత్రమే, భూమిని సాగుఁజేయుచుఁ జేయించుచు, దానివలననే జీవించుచున్నారు. కేవల మధ్యాపన యాజన ప్రతిగ్రహములవలన జీవించు బ్రాహ్మణులు స్వల్పసంఖ్యాకులు ౧౦౦౦ మందిలో నొకఁడైనను నిత్య మగు శ్రౌతకర్మమును జేయుట లేదు. ౧౦౦లో నొకఁడైనను స్మార్తకర్మము లగు వైశ్వదేవాదికములోఁ గొన్నింటిని జేయుట లేదు. పూర్వాచార పరాయణు లగు బ్రాహ్మణాదులు పల్లెటూళ్లలోను, బస్తీలలోను బుణ్యతీర్థములలోను, క్షీణించుచున్నారు. సర్వులు సామాన్యముగ నర్థకామపరులై సనాతనధర్మవిముఖు లగుచున్నారు కాన మనదేశమున కనేకము లరిష్టములు సంభవించినవి. ఇంకను రా నున్నవి. మఱియును మన హిందూదేశములో బ్రాహ్మణాదిసర్వవర్ణులలో నవాంతర వర్ణభేదములు 300 పైనున్న వని జనాభాలెక్కలవలన దేలినది. దేశభాషలు పెక్కులు గలవు. అందఱు నార్యమతావలంబులై శ్రుత్యాదులను బ్రమాణముగ నొప్పినను, ననేక వేలయేండ్లనుండి భిన్నాచారులై యున్నారు. పూర్వకాలములోనే ౪ వర్ణములు వాని సంకరములు నగు ననులోమప్రతిలోమజాతు లనేకము లున్నట్లు మన్వాదిస్మృతీతిహాసపురాణములు వివరించినవి. భారతయుద్ధకాలములో నుత్తరహిందూస్థానమున ౧౦౬ తెగలవారును, దక్షిణమున ౫౦ను, నుత్తరమున నుండు నితరజాతీయు లగు యవనాదులు ౨౬ గురు నున్నట్లు భీష్మపర్వములో వర్ణింపఁబడిరి. ఇప్పటికి వారికి రెండింతలుగఁ గలరు. వీరిలో నుండు నార్యులు ప్రాచీనము లగు నాలుగువర్ణులుగ మారినచో వారిలో నైకమత్యత హెచ్చి వారికిని వారి సంతతివారికిని, వారి జన్మభూమి యగు భారతమాతకును సకల విషయంబులలో శ్రేయోదాయక మగు. కాని అది నెంతేవు కోరికయా? ఎప్పుడైన సాధ్యమా? అనుసంశయము మాత్రము తోఁచుచున్నది. కాని పరరాజులు మన కేలిక లగుటచే మనకుఁ గావలసిన సౌఖ్యములు లేకపోవుటచేతను, మనదేశపుద్రవ్యాదు లనేకవిధములుగ వారి దేశమునకును నితరదేశమునకును బోవుటచేతను శిల్పపారిశ్రామికపు పనులు మన దేశమంతటను వృద్ధి జేసినంగాని మన కర్థవృద్ధి కానేరదు గనుకను దానియార్జననిమిత్త మితరదేశములకు నౌకావిమానములమీఁద రాకపోక లగత్యముగానను నిమ్న జాతు లగు పంచమాదుల దురవస్థను మాన్పి వారిని బాగుచేయనిది మనకు పురోభివృద్ధి గలుగదు గనుకను దేశమం దంతటను ప్రాథమికవిద్యావ్యాప్తి యత్యంతావశ్యకము గనుకను దేశస్థులలో నున్న యార్యులలోను, వారికిని నితరమతస్థులకును, నైకమత్య మిప్పు డత్యవసరము కనుకను స్వరాజ్యపాలనమునకు సంఘైక్య మత్యావశ్యకము కనుకను, మన ప్రాచీన ధర్మము లతిత్వరలో మారవలసిన తరుణము వచ్చినదని తోఁచుచున్నది. ఇట్టి హేతుపుంజములచే వర్ణాశ్రమధర్మములు శ్రుతిస్మృత్యాదులలో జెప్పఁబడిన ట్లిప్పు డాచరణములో లేక మాఱినవి. ఇంకను మాఱుచున్నవి. మాఱ నున్నవి. ఇపుడు సర్వవర్ణులు సామాన్యముగ నాచరించుఁ గర్మములు నాచారములలోఁ గొన్ని యుధర్మములు నావనియు, తద్ధర్మాభాసములనియు, స్పష్టముగ నెఱయ వ్రాసెను.

# * వేదములు

కనుపర్తి మార్కండేయశర్మ గారు

శ్లో. చాతుర్వర్ణ్యం త్రయోలోకా శ్చత్వార శ్చాశ్రమాః పృథక్, భూతం భవ్యం భవిష్యచ్చ సర్వం వేదే ప్రతిష్ఠితమ్.—మను.

లోకమునందు జనులయొక్క ప్రవృత్తి కావలసినవానిని సంపాదించుకొనుటయు, వ్యతిరేకము లయినవానిని పోగొట్టుకొనుటయు అను విషయములకు సంబంధించి యుండును. అట్టి ప్రవృత్తి అల్పజ్ఞుఁడగు జీవుఁడు ఏర్పఱుచు కొన్నచో, నతని యల్పజ్ఞతవలన అభీష్టము నిరంతరాయముగ సిద్ధింపదు. కావున "ఇష్టప్రాప్త్యనిష్టపరిహారయో రలౌకిక ముపాయం యో వేదయతి స వేదః" అని ఆర్యులు వచించిరి. ఆవేదము భగవత్కృతము. వేదములు ఋగ్వేదము యజుర్వేదము సామవేదము అథర్వవేదము అని నాల్గువిధములు. వేదము జ్ఞానస్వరూప మగుటచేతను జ్ఞానము పరమేశ్వరస్వరూప మగుటచేతను భగవత్కృత మనియు చిరకాలసముపార్జితమగు తపశ్శక్తిచేత మహర్షులు వేదమంత్రములఁ గనిపెట్టి లోకహితార్థమై శిష్యుల కుపదేశించి రనియు, వారలు క్రమముగఁ దమతమ శిష్యుల కుపదేశించి రనియు ఈ తీరున లోకమునందు వేదము వ్యాపించిన దనియు ప్రాచీనులగు యాస్క, పాణిని, కాత్యాయన, పతంజల్యాది మునివర్యులును, ఆస్తికులగు దార్శనికులును ఏకగ్రీవముగ నంగీకరించుచున్నారు.

## (౧) వేదములు, మూఁడా? లేక నాలుగా?

అనువిషయము మనకు విమర్శనీయము. ఈవిషయము గహనమయినది. తీగెను కదలించిన పొద యంతయుఁ గదలునటుల వేదములన నేమియో ఇప్పుడు గ్రంథరూపములుగ నున్న వేదములస్థితి యేమియో తెలిసికొనినఁ గాని పైవిషయము తెలియఁజాలదు. కావున తద్విషయమును వ్రాయఁబోవుచు వేదములు మూఁడనుటయు నాల్గనుటయు రెండును ఒకవిధముగ యథార్థములే యని మా పాఠకులకు నివేదించుచున్నాను.

## (౨) వేదములు మూఁడనుట ఎట్లు?

మొదట నీశ్వరుని నిశ్శ్వాసభూతము లగు వేదమంత్రములను మహర్షులు బ్రహ్మచర్యాది నియమపూర్వక మైన తపశ్శక్తిచేత సమాధిదశయందుఁ గనిపెట్టినవారై లోకమున వ్యాపింపఁ జేసిరి. అసంఖ్యాకు లగు మహర్షు లసంఖ్యాకము లగు మంత్రముల నిటులఁ గనిపెట్టిరి. ఏమంత్రమును ఏమహర్షి కనిపెట్టినదియు ఇప్పటికిని ఆయామంత్రములకడ వ్రాయఁబడియే యున్నది. ఈవిషయము శౌనకాదికృతసర్వానుక్రమణికలందు స్పష్టము.

మహర్షిదృష్టము లగు మంత్రము లన్నియు రచనాభేదముచేత త్రివిధములు. వానిని ఋగ్యజుస్సామములు అనెదరు.

అనఁగా నియతాక్షరసంఖ్య గల పాదబద్ధమైన శ్లోకము ఋక్కు. పాదబద్ధముకానిది యజుస్సు. గానరూపమయినది సామము. మహర్షులచేత తపశ్శక్తిని కనుగొనఁబడిన మంత్రము లన్నియు ఇట్లు ఋగ్యజుస్సామ రూపమగు త్రివిధరచనలలోఁ జేరి యుండుటచేత, "త్రయీ" అని వ్యవహరింపఁబడుచుండెను. త్రయి అనఁగా ఋగ్యజుస్సామరూప త్రివిధ రచనాత్మకమయినది అని యర్థము.

ఋగ్రూపమంత్ర సమూహముగల వేదము ఋగ్వేదము యజూరూపమంత్ర సమూహముగల వేదము యజుర్వేదము గానరూపమంత్ర సమూహముగల వేదము సామవేదము అని రచనాభేదము చేతను వేదములు మూఁడే కావున "త్రయి" అనుట న్యాయ్యము.

## (౩) వేదములు నాల్గనుట ఎట్లు?

యజ్ఞార్థము భగవంతుఁడు వేదముల నేర్పఱిచె ననియు యజ్ఞమే ప్రధానముగ నందు బోధింపఁబడిన దనియు ప్రాచీనులై తపఃప్రభావమున నాయా వేదములకు వ్యాఖ్యానరూపములగు బ్రాహ్మణములఁ గనిపెట్టిన మహర్షు లందఱు నభిప్రాయపడిరి. కల్పసూత్రకారులు వారినే అనుసరించిరి. అందఱికంటె నవీనుఁడగు యాస్కాచార్యుఁడు మాత్రము మంత్రార్థవిచారసమయమునందు అధియజ్ఞపరముగ నర్థము జేసి తరువాత అధ్యాత్మాధిదైవపరముగఁ గూడ నర్థమును చేసెను. అథర్వయనుమహర్షియే ప్రథమమున యజ్ఞప్రక్రియను ప్రకాశింపఁ జేసె నని ఋగ్వేదమునందే చెప్పఁబడి యున్నది.

యజ్ఞైరథర్వా ప్రథమః పథ స్తతే, (ఋ. సం. ౧. ౬. ౮. ౫.) అగ్ని ర్జాతో అథర్వణా. (ఋ. సం. ౭. ౭. ౮. ౫.) త్వామగ్నే పుష్కరాదధ్యథర్వానిరమన్థత. (ఋ. సం. ౮. ౫. ౨౩. ౩.) అథర్వాణంపితరం దేవబంధుం మాతు ర్గర్భం పితు రసుంయువానం,య ఇమం యజ్ఞంమనసాచికేత ప్రణోవోచ స్తమి హేహ బ్రవః॥ (ఋ.సం. ౭. ౧. ౨.) అని యున్నది. కావున అథర్వమహర్షియే యజ్ఞకార్యసౌకర్యార్థము హోతృమంత్రముల నొక్క గ్రంథముగను అధ్వర్యుమంత్రముల నొక్క గ్రంథముగను, ఉద్గాతృమంత్రముల నొక్క గ్రంథముగను, బ్రహ్మమంత్రముల నొక్క గ్రంథముగను ఏర్పఱిచె ననియు దానివలన నాల్గువేదము లను ప్రసిద్ధి కలిగిన దనియుఁ దెలియుచున్నది.

---

* ఈ వ్యాసమును వ్రాయునపుడు శ్రీ సత్యవ్రత సామశ్రమి విరచిత మగు నైతరేయాలోచనాదికమునుండి చాలవిషయముల గ్రహించినాడను.—క. మా.

హోతృమంత్రములు పెక్కులు ఋగ్రచనాత్మకము లగుటచేత ఋగ్వేదమనియు హోతృవేద మనియు, అధ్వర్యుమంత్రములందు కొన్ని ఋఙ్మంత్రము లున్నను అనేకములగు మంత్రములు యజూరచనాత్మకము లగుటచేత యజుర్వేదమనియు అధ్వర్యువేద మనియు, ఉద్గాతృమంత్రములందు అధిక సంఖ్యగలమంత్రములు సామాత్మకము లగుటచేత సామవేదము అనియు నుద్గాతృవేద మనియు, హోత్రధ్వర్యూద్గాతృమంత్రములకంటె భిన్నము లగుమంత్రముల సంగ్రహమునకు రచనాత్రైవిధ్యము ననుసరించిన నామములు వేదత్రయమునకు చేర్చుటచేత తద్భిన్నమంత్రసమూహమునకు బ్రహ్మవేదమనియు అథర్వమహర్షి యే ఈవ్యవస్థను ఏర్పఱచెను కాన అథర్వవేద మనియుఁ జెప్పఁబడుచున్నవి.

కావున రచనాభేదముచేత వేదములు మూఁడనియు, తత్తన్మంత్రగతహోత్రాదివిషయభేదముచేత వేదములు నాల్గనియు గ్రహించునది. కొందఱు విమర్శకులు మహాభారతాదిగ్రంథములందు వేదములు మూఁడని చెప్పఁబడి యున్న వనియు నవీనము లగు శతపథాదిగ్రంథములందు నాల్గని చెప్పఁబడి యున్న వనియు వచింపుచున్నారు. కాని ఆమాట గ్రంథము నంతయుఁ బరిశీలించి పలికినది కాదు. వారు ఏగ్రంథములందు వేదములు త్రివిధము లని చెప్పఁబడె ననిరో ఆగ్రంథములందే నాల్గనియు నాల్గని చెప్పఁబడె ననిన గ్రంథములందు మూఁడనియు గలదు. చూడుడు: "అగ్నే ర్ఋచో వాయో ర్యజూంషి సామా న్యాదిత్యాత్। స ఏతాం త్రయీం విద్యా మభ్యతపత్॥ (ఛాం. ౬. ౧౭.) ఋగ్వేదం విజానాతి యజుర్వేదం సామవేద మాథర్వణం చతుర్థం॥ (ఛాం. ౭. ౭.) అరే ఽస్య మహతో భూతస్య నిశ్వసిత మేత ద్య దృగ్వేదో యజుర్వేద స్సామవేదో ఽథర్వాంగిరసః॥ (బృహ. ౪. ౪. ౧౦) త్రయో వేదా అజాయంత॥ (శత. ౧౧. ౫. ౮.)

అగ్ని వాయు రవిభ్యస్తు త్రయం బ్రహ్మ సనాతనం
దుదోహ యజ్ఞసిద్ధ్యర్థ మృగ్యజుస్సామ లక్షణం. (మను.౧.౨౩.)
ఏకత శ్చతురో వేదా౯ భారతం చైక దేశతః
పురా కిల సురై స్సర్వై స్సమేత్య తులయా ధృతమ్. (భా. ఆది.)

ఇట్లు ద్వివిధములుగ చెప్పఁబడియుండుటచేతనే ఇదివఱకు వివరించియున్న రచనాభేదసంహితాభేదములే త్రివిధ, చతుర్విధ విభాగములకు హేతుభూతము లని ఎఱుంగునది.

## (౪) వేదశాఖా భేదములు

ఋగ్వేదాదివేదములు యజ్ఞానుష్ఠానార్థము ఏర్పడియున్నవి కావున తత్తన్మహర్షులు తమతమ శిష్యపరంపరకు అధ్యాపన మొనర్చిన క్రమము, అగ్నిహోత్రాదికములందు చేసెడి క్రియలందు గల పౌర్వాపర్యభేదములఁ దెలిపెడి శ్రౌతసూత్రాదికముచేతను శాఖాభేదము లనేకము లేర్పడియున్నవి. పాణినిసూత్రములందు కొన్ని శాఖలపేర్లు చెప్పఁబడినవి. పతంజలిమహాభాష్యమునందు ఋగ్వేదాది శాఖలసంఖ్య ఈ విధముగఁ జెప్పఁబడి యున్నది:

"చత్వారో వేదా స్సాంగా స్సరహస్యాః బహుధాభిన్నా ఏకశత మధ్వర్యుశాఖాః, (యజుర్వే. ౧౦౧.) సహస్రవర్త్మా సామ వేదః (సామ ౧౦౦౦.) ఏకవింశతిధా బాహ్వృచ్యం (ఋగ్వే.౨౧) నవధా ఽథర్వణో వేదః (అథర్వ. ౯.)" అచ్చటచ్చట వేర్వేఱుగను లెక్కింపఁబడినవి. ఋగ్వేదాదివేదములకు క్రమముగా ముక్తికోపనిషత్తు ననుసరించి ౨౧, ౧౦౯, ౧౦౦౦, ౫౦ శాఖలును, మహాభాష్యము ననుసరించి ౨౧, ౧౦౧ ౧౦౦౦, ౯ శాఖలును, స్కాంద పురాణము ననుసరించి ౨౪, ౧౦౧, ౧౦౦౦, ౧౨, శాఖలును గలవు.

ఒక్కొక్కవేదమునకు ఇట్లు శాఖాభేదములు చెప్పఁబడియున్నను భారతాదిగ్రంథములందు ప్రథమద్వితీయపర్వములందు ప్రతిపాదింపబడిన విషయము ఎటుల వేర్వేఱుగ నున్నదో అట్లే ఋగ్వేదశాఖలందు వేర్వేఱువిషయములు చెప్పఁబడ లేదు. ఋగ్వేదాది వేదచతుష్టయశాఖలలో కొన్నిశాఖలపేరులు మాత్రమే తెలియుచున్నవి. కాని ఆ యాశాఖల సంహితాగ్రంథములు మాత్రమే ప్రచారమునం దున్నవి. మండలాధ్యాయసూక్తసంఖ్యాక్రమముగ ౧౦ మండలములు గల విభాగమును శాకలశాఖావాంతర శాఖవా రగు శైశిరీయశాఖవారును; అష్టకాధ్యాయ వర్గవిభాగభేదములచేత ౮ అష్టకములుగ బాష్కలశాఖవారును అధ్యయనమును చేయుదురు. వీరు పైని చెప్పఁబడిన శైశిరీయశాఖవారు పఠింపని వాల ఖిల్యములను ౮౦ మంత్రముల నధికముగఁ బఠింతురు.

దీనివలన శాఖాభేదము, అధ్యయనక్రమభేదముననుం, మంత్రసంఖ్యాప్రయోగసూత్రభేదముననుం ఏర్పడుచున్నది అనఁదగును.

౨. ఇట్లే యజుర్వేదశాఖలలో కృష్ణయజుర్వేదమునకు ౮౬ శాఖలు శుక్లయజుర్వేదమునకు ౧౫ శాఖలు గలవు. వీనిలో కృష్ణయజుర్వేదశాఖలు ౮౬ టి లోను మైత్రాయణి, తైత్తిరీయము లని ప్రసిద్ధిగల ఔఖ్యాపస్తంబీయ కాఠకము లను ౪ శాఖలు గలవు. శుక్లయజుర్వేదశాఖలు ౧౫ లోను మాధ్యందిని, కాణ్వి యనుశాఖలు రెండును నిల్చియున్నవి. ఇతర వేదశాఖలకంటె ఈ యజుర్వేదమునందు కృష్ణశుక్లసంహితలకు చాలభేద మున్నది.

౩. సామవేదము శాఖలు ౧౦౦ లో "రాణాయని, కౌథుమి, జైమిని అను మూఁడుశాఖలు మాత్రము గలవు.

౪. అథర్వవేదము ౯ శాఖలలో "శౌనకశాఖ" యొకటిమాత్రము గలదు.

☞ లోపించిన శాఖలకు సంబంధించిన బ్రాహ్మణగ్రంథములు శ్రౌతకల్పసూత్రములు కొన్నికొన్ని గనంబడుచున్నవి. వాని వివరము నిచట గ్రంథవిస్తరభీతిచే వ్రాయలేదు.

## వేదములు, నవీనవిమర్శకులు

ఋగ్వేదముప్రాచీనమనియుఁ బిదప కొంతకాలమునకు యజుస్సామములు రచితములనియు బ్రాహ్మణగ్రంథములు పుట్టినపిదప ఋగ్వేదాదిమంత్రములందు యజ్ఞపరమగునర్థము శబ్దములందు గనఁబడకపోయినను పూర్వవేదవ్యాఖ్యాతలు తెచ్చి పెట్టుచున్నా

రనియు కొందఱందురు. అథర్వవేదము అతినవీన మనియు, పాణిని సూత్రము లందెచ్చట నథర్వవేదశబ్దము స్మరింపఁబడి యుండలే దనియు శంకరాచార్యాదులు ఉపనిషత్తులను వేదభాగము లని చెప్పుట గ్రంథగౌరవమున కనియు, పాణినిసూత్రములందు ఉపనిషచ్ఛబ్దము నిర్వచనము చేయఁబడ లేదనియు మఱికొందఱు చెప్పెదరు.

ఈవాదము సప్రమాణము గాదు. ఋగ్వేదమే మొదట పుట్టినచో, యజుస్సామవేదములు లేనియెడలను, ఋగ్వేదమునందు యజుస్సామపదము లుండరాదు గదా! కాని ఋగ్వేదమునందు యజుస్సామ పదములే గాక వామదేవ్యము, రథంతరము, బృహత్తు, మున్నగు సామభేదబోధక పదములుకూడ మిక్కుటముగఁ గనంబడుచున్నవి. యజ్ఞకర్తలగు రాజర్షులు తద్దానములు యజ్ఞియఋత్విక్కులహోత్రాదినామములును పలుతావుల చెప్పఁబడియుండుటచేత నిది స్వకపోలకల్పిత మనఁదగును.

పాణినిసూత్రము లందు అథర్వవేదపదము గనంబడనంత మాత్రాన అథర్వవేదము తత్కాలమునందు లేదని తలంచుట యుక్తిసహమా? పాణిని తనకాలమునందు లోకమున వ్యాపించియున్న శబ్దముల కన్నింటికి స్వసూత్రములందు నిర్వచనము నేర్పరచెదను అని ప్రతిజ్ఞ చేసి యుండలేదు.

శాకలబాష్కలాదిశాఖలకు ఋగ్వేదాదినామములు సాధారణములైనట్లే శౌనకాదిశాఖలకు అథర్వవేద మని సాధారణనామము గలదు. పాణినిసూత్రములలో ప్రోక్తాధికారమునందు శౌనకాదిభ్యశ్ఛందసి (౪.3.౧౦౬) అని సూత్రము కలదు. దీనిచేత శౌనకసంహిత పాణినికి తెలియునని సిద్ధించుచున్నది. "ఛందసి" అనుటచేత ఛందోభిన్నమగు శౌనకీయ గ్రంథాంతరము కూడ పాణినికి తెలియుననియు సిద్ధించును. అయ్యది 'శౌనకీయశిక్షాగ్రంథము' ఇదియు పాణినికి తెలిసియే యున్నది. "కాశ్యపకౌశికాభ్యా మృషిభ్యాం ణినిః" (౪. 3. ౧౦3) అను సూత్రమువలన కౌశికఋషిప్రోక్తమును అథర్వవేద కల్పసూత్రమగు కౌశికసూత్రమును సైతము పాణిని ఎఱింగియే యున్నాఁ డనదగును. యాస్కాచార్యుఁడు పాణినికంటె పూర్వుఁ డని పలువు రంగీకరించుచున్నారు. తన్నిరుక్తగ్రంథమున మంత్రవ్యాఖ్యానకాలమునందు "ఇత్యపి నిగమో భవతి" అని అథర్వవేదీయ మంత్రములుకూడ గ్రహింపఁబడియే యున్నవి. అథర్వవేదీయ గోపథబ్రాహ్మణమునుండి కూడ నిరుక్తగ్రంథమునందు ప్రమాణార్థము వాక్యములు గైకొనఁబడినవి. కావున అథర్వవేదము పాణినికి తెలియ దనుటయు, తెలిసినను వేదములం దొకటిగ పాణిని కాలమునందు గ్రహింపఁబడుట లేదనియుఁ జెప్పెడిమాటను వేదజ్ఞులంగీకరింపరు.

జీవికోపనిషదావౌపమ్యే (౧. ౪. ౭౯) అను నీ సూత్రమువలన "ఉపనిషత్కృత్య" అను పదము సిద్ధించును. పాణినికాలమునందు ఉపనిషత్తులప్రచార మంటయే గాక ఉపనిషద్జ్ఞు లగువారిచేత రచనయందు భావమునందు ఉపనిషత్తులతో సమానము లగు గ్రంథములు రచింపఁబడిన వనియు కూడ పాణిని ఎఱింగియున్నాఁడు పాణినికంటె ప్రాచీనుఁ డగు యాస్కుఁడు 'యత్రా ఒనుపర్ణా అమృతస్య' (ఋ. సం. ౧. ౧౬౪. ౨౧.) అను మంత్రమునకు అధిదైవత వ్యాఖ్యాన మొనర్చుచు "ఇత్యుపనిషద్వర్ణో భవతి (నిరు. 3. ౨. ౬) అని చెప్పెను. యాస్కునికే ఉపనిషత్తులఁ గూర్చి తెలిసినట్లు మనకు కనఁబడుచుండగాఁ నతని తరువాతవాఁ డగు పాణినికి ఉపనిషత్ పదము తెలియదనుట చింత్యము.

శుక్లయజుర్వేదము పాణినికి తెలియదని కొందఱందురు. కాని అదియు నసంగతమే.

## ఉపసంహారము

వేదములను గుఱించి వ్రాయునప్పుడు ఆయావేదశాఖల నామములను ఆయాశాఖలకు సంబంధించిన గ్రంథాంతరములను గూర్చి వ్రాయుట అత్యావశ్యకము. అయినను గ్రంథవిస్తరభీతిచేత ఇచ్చట నాల్గువేదములను గూర్చి మాత్రమే సంగ్రహముగ వ్రాసినాఁడను. వేదగ్రంథములను గూర్చియు, తత్కాలీనము లగు ఆచారవ్యవహారాదికములను గూర్చియు వ్రాయఁబూనెడి విమర్శకు లందఱు తదుద్దిష్టము లగు నాయాగ్రంథములను తాము స్వయముగ పరిశీలించి సుతర్కముతో మీమాంసఁజేసి తరువాత వానిని గ్రహించుటనో త్యజించుటనో చేయఁదగు నని ప్రార్థించెదను.

# సంస్కృతభాష-తదభ్యాసము

వ్యాకరణాచార్య నోరి సుబ్రహ్మణ్యశాస్త్రులు గారు

ఆర్యులు నివసించెడు దేశములలో సంస్కృతము ప్రధానముగ నున్న దను విషయము ఎల్లరకును విదితమైనదే. హిందూ దేశమున నున్న భాష లన్నింటిలోను సంస్కృత తత్సమ తద్భవ శబ్ద ప్రయోగములతో కావ్యాదులను రచించుటయే కాక యభిప్రాయములను కల్పనలును గూడ సంస్కృతచ్ఛాయానుసారమే వ్రాయఁబడుచున్నవి. ఇంతియగాక పాశ్చాత్యభాషలలో సైతము విశేషముగ సంస్కృతసంబంధ మున్నట్లు నవీనులు రచించిన భాషాతత్త్వ గ్రంథములచే (Philoeogy) స్పష్ట మగుచున్నది.

భాషకు మూలతత్త్వము లగు వర్ణములు గొన్ని యుచ్చరింపఁబడ కుండుటయు నొక్క వర్ణమే వేరువేరు స్థలములందు పలువిధముల నుచ్చరింపఁబడుటయుఁ గొన్ని వర్ణములు మఱికొన్ని వర్ణముల యుచ్చారణచే గతార్థము లగుటయుఁ గొన్ని భాషలలో వర్ణములు తక్కువగ నుండుటచే గుర్తులచేతనే ఆయాశబ్దములు గ్రహింపఁబడుటయు, నితరభాషలలో నుచ్చరింపఁబడని కొన్ని వర్ణములు తమ భాషలలో గల్పింపఁబడుటయు నీ మున్నగు దోషములు సంస్కరింపఁబడనందున నితరభాష లన్నియు నసంస్కృతము లని నిస్సంశయముగఁ జెప్పవచ్చును. కనుకనే దేవభాషకు సంస్కృత మని పేరు.

కొందఱు భాషాతత్త్వవేత్తలు "సంస్కృతము దేశభాషయా?" యనియు నది గ్రంథములలో వ్రాయఁబడుట మాత్రమే గాని యెప్పుడును దేశభాషవలె సంభాషితము కాలేదనియుఁ గావున నది మృతభాష (Dead Language) యనియు ననిరి. మఱికొందఱు సంస్కృతము సైతము గీర్వాణభాష యని భాషాశబ్దముచే వ్యవహరింపఁబడును గాన 'భాష్యత ఇతిభాషా' యను వ్యుత్పత్తినిబట్టి యేదేశముననో యేకాలముననో ఇదియు వ్యావహారికభాషగా నున్నట్లు తోఁచుచున్న దనియుఁ గాలక్రమమున నశించినందున నది గ్రాంథిక భాషగఁ బరిణమించినను రాజావలంబనాదిసాధనము లుండినచో హూణభాషవలె దేశభాష యగుటకు సందియము లే దనియుఁ జెప్పుదురు.

సంస్కృతభాషలో వ్యావహారికవిషయముల నన్నిఁటిని మాట్లాడుట యెట్లని కొంద ఱడుగుదురు. కాని పూర్వగ్రంథములలోని పారిభాషికశబ్దముల నన్నిఁటిని (అనఁగా ఇడియమ్స్, ఫ్రేజెస్, క్లాజెస్, మొదలగు వానిని) ఇంగ్లీషుభాషలోవలె మనమును వాడుకలోనికి తెచ్చితి మేని వ్యవహారవిషయములను సంభాషించుటకు శక్యము కాకపోదు. కాని ఇందులకు రాజులయొక్కయు ప్రజలయొక్కయు గాఢప్రయత్నము లావశ్యకములు.

సంస్కృతభాషలో నున్న గ్రంథము లన్నియు సాక్షాత్తుగ గాని పరంపరగ గాని లోకుల కిష్టప్రాప్తిని అనిష్టపరిహారముఁ బోధించును అందు వేదములు ప్రభువులవలె మనుష్యుల విధులఁ దెల్పును పురాణములు స్నేహితులవలె హితమును బోధించును' కావ్యములు (కాంతాసమ్మితములు గాన) వ్యంగ్యముచే నీతిని బోధించును. ఈ గ్రంథము లన్నియు ధర్మార్థకామమోక్షము లను చతుర్విధ పురుషార్థములను సిద్ధింపఁజేయుటకుఁ బ్రణీతములై యున్నవి. రామాయణకావ్యము రాముఁడు మొదలగువారివలెఁ బ్రవర్తింపవలె ననియు రావణాదులవలెఁ బ్రవర్తింపఁ దగ దనియు, న్యాయ్యమార్గమునఁ బ్రవర్తించువానికి తిర్యగ్జంతువులు సైతము తోడ్పడు ననియు నన్యాయ్యమున బ్రవర్తించువారిని సోదరుఁడు సైతము విడనాడు ననియు నీతిని బోధించును. అట్లే మహాభారతమున గృధ్రసృగాలోపాఖ్యానముచే స్వార్థపరతను ప్రధానముగాఁ జేసికొన్నందున పరిహాసపాత్రము లగుదురు. కనుక స్వార్థపరులై ధర్మశాస్త్రమును ఇతరులకు బోధింపఁగూడ దని లోకోత్తరమగు నీతిని బోధించుచున్నది.

తర్క వ్యాకరణాదిదర్శనములు, అశ్వశాస్త్ర గోశాస్త్రాదికములు, శుక్రనీతి మున్నగు నీతిగ్రంథములును, ధర్మశాస్త్రములును, ఇవి యవి యననేల? అన్నివిధములగు గ్రంథములును ఈభాషలో నున్న ట్లందఱు నెఱుంగుదురు. ఆయుర్వేదమూలక మగు వైద్యశాస్త్రమునందును, చరకాదిగ్రంథములు భాషాసౌష్ఠవముతో, అ వాజీకరణము సాంగోపాంగముగ నున్నవి. మఱియు, లోకహితమును బోధించుచున్న గ్రంథరత్నము లనేకముల నీభాషలో రచించినట్లు తెలియుచున్నది. ముద్రణయంత్రములమూలమున నవి యన్నియు నిప్పు డందఱకును గన్పట్టుచున్నవి.

పతంజలి యోగశాస్త్రమును చరక మను వైద్యగ్రంథమును వ్యాకరణమహాభాష్యమును రచించెను. వ్యాకరణభాష్యమునకే మహాభాష్య మనిపేరు. ప్రత్యేకముగ దీనిని మహాభాష్య మని యేల యనవలయుననిన: ఇతరశాస్త్రములలోవలె సూత్రకారునిచే జెప్పఁబడని విషయమును భాష్యకారుఁడును భాష్యకారునిచే సవరింపఁబడనివిషయమును వార్త్తికకారుఁడును సవరింపక, ఈ వ్యాకరణశాస్త్రమునందు మాత్రము సూత్రకారుఁడు చర్చింపనివిషయములను వార్త్తికకారుఁడును నాయుభయులు విచారింపని విషయములను పతంజలియు విచారించి సిద్ధాంతీకరించుటచే దీనికి మహాభాష్య మని పేరు వచ్చెను. ఈగ్రంథరత్న ముండునంతవఱకును సంస్కృతభాష లోపించినదని గాని, లోకోత్తరములు సులలితములు నగు వాక్యోపవాక్యములు,

Late Dr. B. Rajagopal.



కీర్తి శేషులైన డాక్టరు బి. రాజగోపాలుగారు.

Pandit Gopalakrishna Sastri Garu.



ముక్తినూతలపాటి గోపాలకృష్ణశాస్త్రిగారు.

Mr. B. Mangaiah Naidu.



Rai Saheb Muthia Chetti.



Mr. K. Krishnaraya Sastri.



కాశీభట్ల కృష్ణరాయశాస్త్రిగారు

Mr. I. Narasimba Chetti.



దువ్వూడ నరసింహా శ్రేష్ఠిగారు.

వాదప్రతివాదములు, తత్పరిహాసములు మొదలగునవి యన్నియు సంస్కృతభాషయందు లేవని గాని, చెప్పుటకు వీలులేదు. ఇంతవఱకును గ్రంథకర్త లందఱును మధుకరన్యాయముగ వాక్యోపవాక్యములు మున్నగువిశేషములను వ్యావహారికభాషాస్వరూపమును ఈ మహాభాష్యమునుండియే గ్రహించిరి.

ఈ పతంజలిచే రచింపఁబడిన యోగసూత్రమునంగు చిత్తవృత్తినిరోధమే యోగ మనియును మైత్రీకరుణాదుల భావనవలన చిత్తప్రసాద మగుననియు చిత్తప్రసాదమూలమున యోగము సిద్ధించు ననియును వివరించిరి. ఇహలోకమందు స్త్రీపురుషు లెల్లరు నీవిషయములను బాగుగ నభ్యసించిరేని క్లేశములు లేకయే పోవును.

"గురూణాం గురుః ప్రాభాకరః" అని బిరుదొందిన మైమాంసికు లగు ప్రాభాకరులు, తర్కశాస్త్రమునందు అనేకగ్రంథములను రచించిన శిరోమణిభట్టాచార్యులు, నూటికంటె నధికముగా సర్వశాస్త్రములందును గ్రంథములను రచించిన విద్యారణ్యులు, అప్పయదీక్షితులు మున్నగువారి మహిమలును వారి సంభాషణలు నెంతటి యుత్కృష్టతను ఈ భాషకు దెచ్చుచున్నవను విషయ మెల్లరకును తెలిసినదియే. ఈభాష మానవలోకమున నందునను మన హిందూదేశమునందు మాత్రమే యుండుట మనయదృష్టము గాన దానిని మనము శక్తికొలదిని ప్రచారములోనికి దెచ్చుట మాతృదేశశుశ్రూషలలో ముఖ్యమయినది

## సంస్కృతభాషాభ్యాసము.

ఆర్యులు వేదాదుల నభ్యసించుసమయమున మొన్న మొన్నటివఱకును నుపనయనసంస్కార మయినవెంటనే వేదము నారంభించి స్వాధ్యాయ దివసములలో వేదమును అనధ్యయనములయందు శిక్ష మొదలగు వేదాంగములను గాని కావ్యకోశాదులను గాని యభ్యసించుచుండువారలు. రానురాను ఆసంప్రదాయములన్నియు నుత్సన్నములగుటచేతను, రాజకీయభాషలు వేరుగ నుండుటచేతను వానియందే పరిశ్రమచేయువారు పెక్కండ్రగుటచేతను, ఈ సంస్కృతభాష విశేషప్రచారమును గాంచలేదు. కాన నీసంప్రదాయములు నానాటికి క్రమముగా తగ్గిపోవుచున్నవి. మఱియు నిప్పుడు సంస్కృతమును మాత్రము కొంద ఱారంభించినను, దానినభ్యసించుటకు సాధనభూతములగు నుపాయములు గమనించుట లేదు. విద్యనభ్యసించుటకు నుపాయములు '(1) గురు శుశ్రూష (2) గురునకు ధనము నిచ్చుట (3) తనవిద్యను జెప్పి వారినుండి తాను మఱియొకవిద్యను గ్రహించుట' అని మూఁడు. గురువులకు ధనమును గాని, విద్యను గాని ఈయ సమర్థుడు గా కున్నను గురుకులవాసమును గాని, శుశ్రూషను గాని చేయుటకు సమితము సాహసించువారిప్పు డెవ్వరును గాన్పింపరు. ఈ సంప్రదాయ ముత్సన్నముగాకుండ గురువులు చెప్పినను చదువువారలు గన్పట్టరు. ఇప్పటి చదువరులు పద్యకావ్యములకంటె గద్యకావ్యములు సులభములు గనుక వానినే చదువుద మనియు, కల్పనాచాతుర్యముగల గ్రంథములు జదువుటచే పెద్దపెద్దకల్పనలే తెలియును గాని వేరుగ నుపయోగము లేదనియుఁ జెప్పుదురు. భాషాసౌలభ్యముగలిగి ప్రకృతిని వర్ణించు గ్రంథములనే పఠింపవలయు ననియు మేఘసందేశము భారవి మొదలగు కఠినకావ్యములఁజదువఁగూడదనియు జెప్పుదురు. మఱియు పూర్వమందు గురుకులములందునివసించుటచేత విద్యార్థులచ్చటి వృక్షచ్ఛాయలందు నివసించి పరిశుద్ధవాయువును సేవించి అరుణోదయమున నదీస్నానము చేయుట మొదలగు సాధనములమూలమున నెంత కఠినమగువిషయము నైనను శీఘ్రముగ గ్రహించుచుండువారు. ఇప్పుడు ప్రతిదినమునను నాహారవిహారములచేతను, మెదడును బాగుచేయు తైలాదులచేతను నెంత ప్రయత్నించినను నాతైక్ష్ణ్యము కాన్పింపదు. కాన ప్రాచీనపద్ధతుల ననుసరించి మనము సంస్కృతభాష నభ్యసించిననే కాని మన కేభాషయందును స్వాతంత్ర్యము కలుగుటకు వీలులేదు. వేదములు బహుశాఖాసమన్వితము లగుటచే నొక్కరే యన్నిశాఖల జదువుట యశక్య మైనందున నాయాకుటుంబముల కాయాశాఖలు పంచిపెట్టఁబడినవి. వా రాశాఖలనే చదువవలయునని నియమముఁ జేయబడినది. అటులనే లోకసామాన్యమునందు సంస్కృతభాషాప్రచార ముండుటకై వారివారికి దగినట్లు విభజించి కొందఱనైన నియోగించి సంస్కృతభాషా సంప్రదాయముల ప్రచారములలో నుంచనియెడల మనదేశమంతయు ఈ క్రింద నుదాహరించు విశ్వగుణాదర్శకారుని సూక్తికి పాత్రమగును.

సీ. పదివేదవర్ణముల్ చదివినమాత్రనే
దవ్యాసముని యనఁ దనరునాతఁ
డౌపాసనముచేసినంత మాత్రమున నా
పస్తంబ ఋషియనఁ బరఁగునాతఁ
డొక్కపద్యంబేనియును బఠియించి నం
తనె బృహస్పతి యనఁ దనరు నతఁడు
పాణినీయముకింతఁ బడసినమాత్రాన
భాష్యకారుఁడనంగఁ బరఁగునతఁడు
గీ. కొన్ని పదముల నటునిటు గూర్చినంతఁ
గాళిదాసుఁడనంబేరుఁ గాంచునతఁడు
ఘనుల కిడుమల నిడు కలికాల మహిమ
సన్నగిల్లుచు నున్నవి చదువులెల్ల.

# ఆశాపాశము

ముక్తినూతులపాటి గోపాలకృష్ణశాస్త్రి గారు

ఈప్రపంచములోని మానవుని మనస్సు ఆశాపాశబద్ధమై యుండుటయు, నాశాప్రేరితమై లౌకికకార్యముల నొనరించుటయు నెల్లఱకు విదితమైయుండు. ఆశయన ఫలప్రాప్తియందిచ్ఛ. ఫలప్రాప్తి కలుగు ననునాసచేఁ బూనికతోఁ గార్యముల నొనరించువారి మనస్సున కొకవిధమగు బలము కలిగియుండు. ఆశలేనివాఁడు నిరుత్సాహవంతుఁడుగఁ గన్పడు. ఆశ సామాన్యస్థితియందున్నప్పుడు మానవుని బాధింపదు గాని యభివృద్ధిఁ జెంది, చెడుమార్గములోఁ బోవుకొలఁదిని, దురాశారూపమునుపొంది బాధించును. దేశకాలముల ననుసరించి తనగతిస్థితులనుబట్టి న్యాయ్యముగ విషయముల నభిలషించుటచేఁ జేటు కలుగదు గాని, తనస్థితిగతులను మఱచి విషయాభిలాషాతత్పరుఁడును దురాశాప్రేరితుఁడు నైనచోఁ జెడిపోవును. ఈ యాశ; దురాశ, నిరాశ; ఆశ, యని ముత్తెఱంగులు. సత్త్వగుణభూయిష్ఠు లగు జ్ఞానవైరాగ్యసంపన్నుల యెడ నిరాశయు; తమోగుణ భూయిష్ఠు లయి కామక్రోధములు గలదుర్జనులయందు దురాశయు; రజోగుణవంతు లయి, ప్రాపంచికకార్యప్రవృత్తులగు సామాన్యులయెడ నాశయు; నుండినట్లుండు. ఆశను ఇచ్ఛకుపర్యాయపదముగ వాడినచో నంతదూష్యముగఁ జూపట్టదు. సద్గ్రంథశ్రవణపఠనములయందును; సత్సాంగత్యమందును; జ్ఞానప్రాప్తియందును కీర్తియెడలను, యోగసిద్ధులందును ఆశ యుండినచో నుత్తమస్థితికిఁ బ్రాపకముగ నుండును. అటుగాక కాంతాకనకములయందుమాత్రమే యాశకలిగియుండుట దుఃఖజనకమై నరకమునఁ బడఁద్రోయు నిచ్ఛ. అంకురిత పల్లవిత కోరకిత కుసుమిత ఫలితాద్యవస్థలచే కామము ఈహా, స్పృహా, ఆశ, తృష్ణ, గృధ్నుత, అనుస్థితులఁ జెందును. వీనిని పాశ్చాత్యమానసికశాస్త్రజ్ఞులును (Liking Desire Ambrission Avaric Greed) అనుపదములచేఁ దమశాస్త్రములయందు వ్యవహరించిరి. యాచకులు ధనసంపన్నులఁ జూచి, మనోరథముచే నాశను బొడగించుకొని వారలఁ జేరి; వారిచేఁ బరాభూతులై నిరాశఁ జెంది దుఃఖములపా లగుదురు. దుఃఖమనఁగా—దురాశచేఁ గలిగిన దుఃఖమని తెలియవలయు. యాచకుఁడు ధనసంపన్నునిఁ జేరి తన కష్టముల దెలిపి, పిమ్మట తనకు నెంత విధిప్రాప్తమో అంత ఫలము లభించునని ధైర్యము నవలంబించియుండవలయుఁ గాని; తాను కోరినంత లభించు నని యధికాశ నాధారముఁ జేసికొని యుండఁ గూడదు. అటులఁ దాను కోరినంతలభింపక పోయెనేని కలుగు మనోవ్యథ వర్ణింప నలవికాదు. ప్రాప్తలాభముచే సంతుష్టుఁ డయ్యెనేని కలుగు మోదముఁ జెప్పఁ దరముకాదు. తాను, గొప్పవాని నాశ్రయించి కృషి సలుపవలయు. ఫలితము, కర్మాయత్తమని యీశ్వర పరాయణుఁడై తటస్థుఁడై యుండవలయును

బ్రహ్మదేవునిచే నొసట వ్రాయఁబడినధనము కొలఁదియో గొప్పయో దానిని ఎచ్చటనుండినను బొందుచున్నాఁడు. ఎచట నుండినను విధిప్రాప్త మెంతయో యంతియగాని యెక్కువఁ బొంద నేరడు. మన మొకపాత్రను, తీసికొని బావియొద్దకుఁ బోయినను సముద్రమునొద్దకుఁ బోయినను, సమానముగ జలము లభించునే గాని; బావియొద్ద తక్కువగను, సముద్రమునొద్ద ఎక్కువగను లభింపదు గదా! కావున ధనాఢ్యులయెడ దైన్యవృత్తి నవలంబింపఁ గూడ దని భర్తృహరియోగీంద్రుఁడు తన సుభాషితరత్నావళియందు నుడివెను. కావున పైదృష్టాంతముచే యాచకులు ఆశకు లోబడక విధిప్రాప్తలాభముచే సంతుష్టిఁ జెందెద రేని సుఖమునుఁ బడయుదురు. మఱియు నీయాశ రెండువిధములు, అందొకటి తాను మనోరథపరంపరలచే నభివృద్ధిఁ జేసికొనుట, రెండవది, ఇతరులు అనఁగా ధనసంపన్నులమాటలచేతను క్రియలచేతనుఁ బ్రోత్సాహితుఁడై ఆశనుఁ జెందుట, మొదటిది స్వగతము. రెండవది పరగతము. స్వగతమునకంటెఁ బరగతము తీవ్రము. ఒక యాచకుని మాటలచేతను క్రియలచేతను నమ్మించి యాశఁ గలిగించి, పిమ్మట వ్యర్థమనోరథునిఁ జేసెనేని, ఆయాచకుఁ డనుభవించు మనోవ్యథ వర్ణింప నలవి కాదు. దాత్సుకృతమును యాచకుఁడును; యాచకుని పాపమును దాతయుఁ బొందుదు రని స్మృతులయందుఁ దెలుపఁబడుచున్నది. తనకు సమర్థత గలిగియుండియును యాచకునిమనోరథముఁ బూరింపఁజాలనివాని దేహమే భూమికి భారము కాని; పర్వతములు, వృక్షములు భారము కావని నైషధమందుఁ జెప్పఁబడెను. ఆశచేఁ బీడింపఁబడు యాచకునిమనస్సు; వృష్టిలేక వాడఁ బారుచుండు సస్యమును బోలియుండు. ఆశాపీడితుఁ డగు యాచకుని కష్టమును దాత యెఱుంగు నేని అర్థిని వ్యర్థమనోరథునిఁ గావింపఁ జాలఁడు. మితిలేని యాశలను బెట్టుకొని వానినిఁ బూరించుటకై పడరానిపాట్లు బడి దేశములఁ దిరిగి; నిదుర ఆహారము లేక, విసుగు జెంది తన్మూలకసుఖములఁ బడయుటకన్న; నాశలను విడుచుటవలనఁ గలిగినసుఖము, కడుంగడు శ్రేష్ఠ మని, 'నిరాశా పరమం సుఖ' మ్మను లోకోక్తిచేఁ దేటపడు చున్నది. ఈయాశ; వర్తకులయెడను; రాజులయెడను ధనాఢ్యులయందును విశేషముగఁ జూపట్టుచుండు. ఒకప్పుడు ధనప్రాప్తి కలిగెనేని; ఆయభిరుచిచే నంతకన్న నెక్కుడు ధనము నార్జింపవలెనను నాశ పొడమును. ధనార్జనమునందుఁ బెక్కు కష్టములు దురాశచే సంప్రాప్తింపగ నికమీఁద ధనాశను విడువఁ దగును. ఉన్నదానితోఁ దనివిఁ జెందవలె నను వైరాగ్య మప్పుడు కలిగి; ఆధనార్జనకార్యము ముగిసినవెంటనే పూర్వ మనుభవించిన కష్టముల మఱచి యాశాప్రేరితుఁడై మఱల ధనము నార్జింపఁ గడగును. ఆశచే యుక్తాయుక్తవివేచనాశక్తి మేధ ప్రజ్ఞ మందము

లగును. ప్రజ్ఞాహీనులును, మూఢమతులు నగువారు అధికాశలకుఁ బాల్పడి ఫలితములు లభింపమిచే నైరాశ్యముఁ జెందుదురు. అనఁగ విరక్తినిఁ బొందుదురు. "అభావే విరక్తి" యనులోకోక్తిచే; ఫలప్రాప్తి కలుగమింజేసి వీరికి విరక్తిపొడమెను గాని నిశ్చల మగు వైరాగ్యము కాఁజాలదు. జ్ఞానవైరాగ్యసంపన్ను లగు యోగిపుంగవులకన్ననో; వారియెదుట నాశాజనకములగు కాంతాకనకాదివిషయములున్నను దోష దృష్టిచే; వానిని విషసదృశములుగఁ జూచి; వానియెడ నైరాశ్యముఁ జెందుదురు. ఇదియే నిశ్చల మగు వైరాగ్యము 'నిస్పృహస్యతృణం జగత్త్"ను లోకోక్తిని బట్టి యాశారహితుఁ డగు మహనీయున కీ జగత్తు గడ్డిపోరకతో సమానము.

ఆశ యనుతోడిను నాశ్రయించి జీవితకుసుమము వికసించుచున్న దని కవులు వర్ణింతురు. గొప్ప కార్యముల నొనరించునపుడు దృఢమయిన యాశతో నుండవలయుఁ గాని, అవి ఫలితావస్థఁ జెందని యపుడు నిరాశనుఁ బొందఁగూడ దనియు; నిరాశవలనఁ గార్యమందలి యుత్సాహము తగ్గు ననియు; దృఢ మైనయాశాబలముచే నెట్టి కార్య మేని నెఱవేరు ననియుఁ బాశ్చాత్యులయభిప్రాయము. ప్యాలసీ మొదలగువారి జీవితచరిత్రములందు ఇది స్పష్ట మగుచున్నది.

తాపజ్వరముచే దప్పికఁ జెందినవాఁ డెంత మంచినీరు ద్రావినను వాని దప్పిక యణఁగ నట్టుల ధనతృష్ణగలవాఁ డెంతద్రవ్యముఁ బొందినను తనివిఁ జెందడు. ఈధనాశ కంతము లేదు. తృప్తియు లేదు. సామాన్యముగ ధనాఢ్యులకే ధనమందలి యాశ మిక్కుటముగ నుండును.

చిరకాలము సకలవిషయభోగముల ననుభవించినను; కోరికల కంతము లేదని; మహాభారతమున, సౌభరి యనుమునిచేఁ జెప్పఁబడెను.

శ్లో. మనోరథానాం న సమాప్తి రస్తి
వర్షాయుతేనా ఽప్యథవా ఽపి లక్షైః
పూర్ణేఽపి పూర్ణే ఽపి మనోరథానా
ముత్పత్తయ స్సంతి పునర్నవానాం.

పదివేలు సంవత్సరము లైనను అనేకలక్షలసంవత్సరము లైనను విషయసుఖముల ననుభవించినను, కోరికల కంతము లేదు. ఎవ్విధంబున నేని కలిగిన కోరికెల నెఱవేర్చుకొనినను; మఱల క్రొత్త కోరికలు పొడముచునే యుండును. తృష్ణాజలములు గల ఆశాసముద్రమునందు; మనోరథతరంగ పరంపరలు ఉత్పత్తి యగుచు, నశించుచు నుండును. సముద్రమునందు; తరంగము లణఁగియుండనిచందంబున; ఆశాసాగరంబున నెల్లప్పుడు మనోరథములు కలుగుచుండును.

శ్లో. న జాతు కామః కామానా ముపభోగేన శామ్యతి
హవిషా కృష్ణవర్త్మేవ భూయ ఏవాభివర్ధతే
పూర్ణం వర్షసహస్రం మే విషయాన్ సేవతోఽసకృత్
తథాపిచానువసనం తృష్ణా తేషూపజాయతే.

—శ్రీ. భా. ౯ స్కం.

అగ్నిహోత్రమునందు సమిధలు వేయుకొలఁదిని ప్రజ్వలించి, యభివృద్ధి యగు చందంబున, విషయసుఖము లనుభవించుటచే, కోరిక లభివృద్ధి యగును గాని; శమింపఁ జాలవు. వేయిసంవత్సరములు పూర్ణముగ విషయభోగముల ననుభవించినప్పటికిఁ దనివి లేక, మఱల ననుభవింపవలెనని వానియం దాశ కలుగుచుండు నని శ్రీభాగవతమునందును జెప్పఁబడెను.

ఏమియు లేని, పరమదరిద్రుఁడు తొలుత నూఱురూప్యములు లభించె నేని; చాలునని కోరును. ఎట్టులేని నూఱురూప్యంబులు లభింపఁ దనివిఁ జెందక వేయి గోరును. వేయి లభించిన లక్షను లక్షాధిపతి యై భూపతిత్వమును భూపతి చక్రవర్తిత్వమును, చక్రవర్తి ఇంద్రత్వమును; ఇంద్రుఁడు బ్రహ్మపదవిని బ్రహ్మ విష్ణుస్థానమును గోరుచుండును. ఆశ కంతమునుఁ గన్గొనినవాఁ డెవఁడు? ప్రాప్తలాభముచే సంతుష్టిఁ జెందినవాఁ డెవఁ డని శ్రీశిహ్వానమిశ్రుని శాంతిశతకమునఁ జెప్పఁబడెను.

ఈవిషయమును గూర్చి శ్రీభాగవతమున వామనమూర్తిచే బలిచక్రవర్తికి ఈక్రిందివిధముగఁ జెప్పఁబడెను.

శా. ఆశాపాశము తాఁ గడున్ నిడుపు, లేదంతంబు రాజేంద్ర! వా
రాశిప్రావృతమేదినీవలయసామ్రాజ్యంబు చేకూడియున్
గాసిం బొందిరి గాక వైన్యగయభూకాంతాదులు న్నర్థకా
మాశన్ బాయఁగ నేర్చిరే? మును నిజాశాంతంబులం జూచిరే?

కాఁబట్టి యాశ కంతము లే దని పలుచోట్లఁ జెప్పఁబడెను. అట్టియాశను జయించుటకు సంతోషము తప్ప వేఱొకటి లే దని యాధ్యాత్మికశాస్త్రజ్ఞులు స్వానుభవమువలనఁ గనిపెట్టిరి.

దురాశాపిశాచిక, ఎట్లు త్రిప్పిన నావలనికిఁ దిరుగుచు, పడరానిపాట్లు పడుచు, గౌరవమునుఁ గోల్పోయి యడుగరానివారి నడుగుచు; రేయి యనక, పగ లనక; నిద్రాహారములు లేక దుర్గమ ప్రదేశముల సంచరించుచుఁ దనివి లేని లోభాత్ములు చిత్తశాంతి లేక మిక్కుటము లైన మనోవ్యథలఁ జెందుదురు. ఈ దురాశాగ్రస్తులు కొండొకవేళ మహత్తర మైన లోభముచే, మృతిని గాని, లేక; కారాగృహప్రవేశమును గాని పొందుచున్నారు.

తనివిఁ జెందుటవలనఁ గలిగినలాభమున కొక దృష్టాంతము కలదు. మహాసంగ్రామ సమయంబున నిరువురు వర్తకులు వ్యాపారము సేయుచుండిరి. అం దొకరు, వస్తువుల కధికధర లయినందున, భయపడుచు గొన్ని పదార్థములను వెలకుఁ దీసి తిరిగి విక్రయింపఁగఁ గొన్ని లక్షలు లాభమువచ్చెను. తా నెన్నఁడు తలంపని లాభ మధికముగ వచ్చినందున నిఁక వ్యాపార మొనరించిన నష్టము వచ్చును. ఈ ధరలు నిలఁబడ వని, ప్రాప్తలాభముతో సంతుష్టుఁడై విరమించి యుండెను. మఱియొకఁడును, వానివలెనే, కొంతసరకును అధిక వెలలు బెట్టి కొనుఁగోలు చేసి మఱల విక్రయించి కొన్ని లక్షలలాభముఁ బొందెను. ఈలాభపు రుచిచేఁ దనివిఁ జెందక ఆసచే మిక్కుట మైన సరకును, కొనుగోలు చేసి యుంచెను. మొదటివాఁడు, రెండవవానికిఁ గోటిరూప్యములు లాభము కలుగఁబోవు చున్నదే యని నగుచుండగ, కాలస్థితినిఁబట్టి వెలలు తగ్గెను. విశేషవ్యాపారమును చేసినరెండవవానికిఁ గోటిరూప్యములు లాభము వచ్చుటకు మాఱుగ పూర్వపులాభముతోఁ

గూడ రెండు కోట్లు నష్టము వచ్చునట్లు తటస్థించెను. అప్పుడు మొదటివాఁడు తాను తనివిఁ జెంది విశేషవ్యాపారముఁ జేయక; పొందినలాభముచే, సంతుష్టుఁ డయినందుకు ఫలముఁ గనెను. రెండవ వాఁడు తాను దురాశకుఁ బోయి, మొదటివానికన్న హీనుఁడ నయితి నని దుఃఖించెను. దీనివలనఁ జదువరులు సంతోషమువలనఁ గలుగుఫల మరయుదురు గాత.

శ్లో. ప్రాప్తవ్య మర్థం లభతే మనుష్యో
దేవోఽపి తం లంఘయితుంహి నాలం.

పూర్వజన్మ కర్మానుగుణ్యముగఁ దాను పొందఁదగినఫలితముఁ దా నెచ్చటనుండినను బొందు ననియు; దానినిఁ దప్పించుటకు దేవుని చేతను నలవి కా దనియు, విశేషముగ నాశాపరంపరలచే వ్యథలఁ బొందుట వ్యర్థ మనియు, నిశ్చయించుకొని వివేకియగువాఁడు ప్రాప్త లాభముచే సంతుష్టుఁ డగుచు; స్థిరచిత్తుఁడై యుండును. తనకన్న నధికు లగువారలవలె, ధనకీర్తిభోగైశ్వర్యములఁ గోరఁగూడ దని తాత్పర్యము కాదు. పైయన్నింటికిఁ బ్రయత్నించునపుడు, క్రమముగఁ బురుషప్రయత్నమును నిశ్చలమనస్సుతో సలుపుచు; ఫలితాఫలితములందు హర్ష విషాదముల నొందక సంతతకృషి నొనరింపవలయు. వివేకయుక్తబుద్ధితో నేకార్య మొనరించినను బాధింపఁబడదు. పుత్రమిత్రకళత్ర గృహక్షేత్ర ధనకనకాది పదార్థములయం దాసక్తి గల వానిమనస్సు; పచ్చిచింతకాయను బోలి యుండును. చింతకాయ లోని ఈనెలు లోపల వెలుపల దృఢముగ నల్లుకొని యున్నందున, బెరడు వేఱుగను, పండు వేఱుగను విభజింప నలవికాదు. ఏలయన పరిపక్వము కామిచే వేఱుపఱుప నలవికాదు అట్టులనే విషయాసక్తుని మనస్సును.

జ్ఞానవైరాగ్యములు గలయోగీశ్వరుని మనస్సు పండిన చింతకాయవలె బెరడు వేఱుగను లోపలిపండు వేఱుగను యీనెలచే బంధింపఁబడక చూపట్టినట్లు బహిర్విషయములనుండి యాశాపాశములు వీడినందున స్థూలసూక్ష్మశరీరములు వేఱుగఁ బ్రకాశించుచుండు.

శ్లో. ఆశాయా యే దాసాస్తే దాసా స్సర్వస్య లోకస్య
ఆశా యేషాం దాసీ, తేషాం దాసాయతే లోకః.

ఆశాబద్ధులు ప్రకృతిబద్ధు లనియు, నిర్జితాశు లగువారు ప్రకృత్యతీతు లనియుఁ దెలియుచున్నది. ఆశాపాశబద్ధులు కాకుండునటుల శ్రీజగదీశుఁడు మనల ననుగ్రహించుగాత.

# ఏమి పాడెదు సంద్రమా! యెపుడు నీవు?

హరి వేంకటేశ్వరులుగారు.

దివ్యతర మైన కంఠస్వరంబుతోడ
ఎడతెరపి లేక యాయాస మింత గనక
అర్థగాంభీర్య మెవరికి నందనీక
ఏమి పాడెదు సంద్రమా! యెపుడు నీవు? 1

అనవరతచిత్తసంక్షోభ మనుభవించి
శాంతభావంబు గనఁగ నీ చెంతఁ జేరు
వార్తల కొసంగు స్వాగత కీర్తనంబొ
ఏమి పాడెదు సంద్రమా! యెపుడు నీవు? 2

నీవు మ్రింగిన ప్రాయంపు జీవకోట్ల
నలలలోపల నాడించి యాత్మలకును
శాంతిగీతంబు సల్పెదో! సంతతంబు
ఏమి పాడెదు సంద్రమా! యెపుడు నీవు? 3

నీ కనుల ముందు గ్రాలు నీ లోకమందు
వడివడిగ మార్పు లవి చాల పొడముచుంట
మిగుల నాశ్చర్యభావమే మెళగింతొ?
ఏమి పాడెదు సంద్రమా! యెపుడు నీవు? 4

జగ మను విశాలనాటకశాలయందు
జనుల కార్యాచరణమున కనుగుణముగ
పాటలను పాడు సుస్థిరపాత్ర వేమొ?
ఏమి పాడెదు సంద్రమా! యెపుడు నీవు? 5

విపుల మైనట్టి యాకాశవీథియందు
చనెడు రవిచంద్రతారకాసఖుల నెల్ల
హెచ్చరింపఁగ పాడెదో యీ విధమునఁ
ఏమి పాడెదు సంద్రమా! యెపుడు నీవు? 6

నీ కుమారరత్నము లగు నీరదములు
వలయు స్వేచ్ఛావిహారముల్ సలుపుచుండ
ఆత్మ నుప్పొంగి సంతోష మభినయింతొ?
ఏమి పాడెదు సంద్రమా! యెపుడు నీవు? 7

గగనమున వేగముగ నేఁగు గ్రహగణంబు
దేవగానంబు సల్పుచుఁ బోవుచుండ
ప్రతివచన మిత్తు వేమొ యీ పగిది నీవు
ఏమి పాడెదు సంద్రమా! యెపుడు నీవు? 8

# నిమ్నజాతిసముద్ధరణము

మంగిపూడి వేంకటశర్మ గారు

భారతఖండమున నిమ్నజాతిసముద్ధరణమహాకార్యమునకు దారి దీసినవారును ప్రజలను పురికొల్పినవారును విదేశీయు లగు క్రైస్తవమతవ్యాపకు లని మన మొప్పుకొనక తప్పదు. అయ్యో! "ఆత్మవ త్సర్వభూతాని" "స్వదేశం భువనత్రయమ్" "పరోపకారార్థ మిదం శరీరమ్" "అహింసా పరమో ధర్మః" ఇత్యాది మహోత్కృష్టధర్మములను విశ్వమానవకోటి కుపదేశించి యాచరించి జగద్గురుపీఠ మని ప్రతిష్ఠ వహించిన పుణ్యభూమి యగు నార్యావర్తమునకును "మూడనున్న కీ డెంచక తోడి సోదరులను పీడించుట పాడి గా" దని విదేశీయుల మేలుకొలుపులా! హితోపదేశములా!! అవును! విదేశీయపాలనమే యవసర మైనప్పు డిందులకు విచారింపవలసిన దే మున్నది? అహా! ఇది కాలమహిమము! ప్రకృతిపరిణామము! దైవనిర్ణయము!

అగ్రవర్ణములవా రెవ్వరును తమ ధర్మబోధనలకు చెవి యొగ్గక నిరాకరించుటచే క్రైస్తవమతబోధకులు అనాగరికులును విద్యావిహీనులును నగు పంచమాదుల పంచఁ జేరి వారి నాదరించుచు వశము చేసికొని తమ కార్యములు చక్కఁజేసికొనవలసినవా రైరి. వారు వారిని సంరక్షించుటకై చేసిన ప్రయత్నములలో ప్రధాన మైనది విద్యాప్రదానము. విద్యాంజనము వారి కన్నులను విప్పి ప్రపంచమును జూపి ఆత్మగౌరవమును మేల్కొలిపి స్వాతంత్ర్యేచ్ఛను రగులుకొలిపెను.

భారతీయులు నిమ్నజాతులలో ముఖ్యముగా మాలమాదిగలను మిక్కిలి నీచాతినీచముగాఁ జూచుచు నంటరాని చెప్పరానివారినిగాఁ జేసి యవమానపఱచుచుండుటచే రాజావలంబనము గల పరమతావలంబనము మాత్రమున నవమానము పోయి గౌరవము కలుగుచుండుట ప్రత్యక్షముగాఁ జూచుచున్న పంచమాదులు లక్షల కొలఁది పరమతస్థులై హిందువులు తమ్ముఁ బెట్టుచున్న హింసలకు ప్రతిఫలముగా వారియందు ద్వేషభావము వహించి ప్రతిపక్షులుగా మాఱుచు వచ్చిరి. ఇం దేమియు వింత గాని తప్పు గాని లేదు.

క్రమక్రమముగా బంగాళమునందు గోహింసల మూలముగా సంభవించిన హిందూమహమ్మదీయకలహములలో పంచమాదులు హిందువుల పక్షమునఁ జేరి పోరాడకుండుటయే గాక మహమ్మదీయులను చాటుననుండి యుసికొలుపుచుండుటయు, పాంచాలమునందు నీటియెద్దడి కలిగిన కాలమున పరమతస్థు లగు పరదేశీయులతోఁ బాటైనఁ గాకుండ పంచమాదులు నీరు లేక చచ్చినను సరే తమ నూతులయందు నీరు చేదుకొనియ్య మని హిందువులు — అగ్రజాతుల మని విఱ్ఱవీఁగు హిందువులు — న్యాయమును భూతదయను ధర్మమును దైవమును గూడ మఱచి మదాంధులై మూర్ఖులై యహంకారప్రేరితులై యడ్డగించినప్పుడు పంచమాదులు కోర్టుల కెక్కియు గెల్వలేక దీనులై యనదలై యార్తులై చేయునది లేక మహమ్మదీయమతమును స్వీకరించి యా మతస్థుల యండ నుండి వారి సాయమున హిందువులతో కత్తిగట్టి పోరి గెలిచి నీరును ప్రాణములను రక్షించుకొనుటయు సంభవించినవి.

ఇట్టి పరిస్థితుల నెల్ల దూరదృష్టితో పరిశీలించిన దేశీయనాయకులు దేశమునం దైదవ వంతు మనుష్యు లంటరానివారుగా నెంచఁబడుటవల్లను వారు తమ స్వామ్యములను గ్రహించి స్వాతంత్ర్యవిజయమునకై ప్రత్యర్థులై మనతో ప్రతిఘటించుటవల్లను దేశమునకు సంభవించుచున్న సంభవింపనున్న యనర్థములను గ్రహించి తన్నివారణమునకు సాంఘికస్వాతంత్ర్యప్రదానమే పరమసాధన మని నిశ్చయించి వారి నుద్ధరింప యత్నింప సాగిరి.

అది మొదలు దేశమున నెల్లయెడలను నిరుద్ధభారతవిమోచనమునకై యనేకయత్నములు చేయఁబడుచున్నవి. మానవజన్మస్వత్వములకై యాత్మస్వతంత్రతకై మాతృదేశోద్ధరణమునకై ధనప్రాణములను ధారవోయుచున్న భారతవీరులు దీను లగు దేశసోదరుల విముక్తికై శ్రమంపడుట సమంజసము గదా!

ఈ పది పండ్రెండు సంవత్సరములనుండియు నిమ్నజాతుల నిమిత్తము చాల పాఠశాలలు స్థాపింపఁబడినవి. పఠనమందిరములు నెలకొలుపఁబడినవి. సభలు సాగింపఁబడినవి. పత్రికలు ప్రకటింపఁబడినవి. గ్రంథములు రచియింపఁబడినవి. అయినను మొత్తముమీఁదఁ జూచినచో నిప్పటికి జరిగిన పని మాత్ర మతిస్వల్ప మని విదిత మగుచున్నది. ఏల? దీనికి మూల మేమి? ఎక్కడ నే పని తలపెట్టినను నెప్పు డే కార్యము ప్రారంభించినను నొక్కరొక్కరే చేయుటయు నితరుల సానుభూతిసాహాయ్యములు లేకుండుటయు తటస్థించుచున్నది. ఒప్పైనను తప్పైనను పూర్వాచారము నొక్కమాఱుగా విడువఁజాలని జనసామాన్యము చిరకాలమునుండి యంటరాని చెప్పరానివారినిగా పరిగణించుచున్న వారియెడల నింత త్వరలో నంతగా సానుభూతి చూపుట జరుగ నేరదు. కాని, యీ దేశభక్తులు సంస్కర్తలు దీనదయాపరులు నొక్క సంఘముగా కలసిమెలసి పని చేసినచో నింతకంటె నతిత్వరితగమనంబున కార్యములు కాఁగల వని గట్టిగా చెప్పవచ్చును.

బహుజనసమ్మేళనమువలనఁ గలుగు ఫలితముల నంతగా వివరింపవలసిన యవసరము లేదు "సంఘే శక్తిః కలౌ యుగే" యను సూక్తి సుప్రసిద్ధమును స్వానుభవసిద్ధాంతమువలన సర్వజన

సమ్మతమును గదా! "ధనమూల మిదం జగ" త్తనుటచే నే కార్యమున కయినను ధన మావశ్యకము. ఇట్టి ఘనకార్యముల పట్ల నది విశేషావశ్యకము. సంఘసంస్థాపితము లగు ప్రతిష్ఠాపనములు సుస్థిరములు కాఁగల వని విశ్వసించి ప్రజలు విశేషముగా ధనాదిసాహాయ్యము చేయుదురు. సంఘబల మున్నచో లోకజ్ఞానశూన్యులును జగత్కల్యాణకంటకులును స్వార్థధుగంధరులును నగు కొందఱు మందేహమాత్రులచే కల్పింపఁబడు నంతరాయముల నతిసులభముగా నంతరింపఁజేయు నను వేర్పడును. సాంఘికు లందఱును సంవత్సరమున కొకటి రెండు సారులు సమావేశములు చేయుచు తాము పూనిన పని కొనసాగించుటకు తగు సాధనముల నాలోచించుటకును తమతమ యనుభవములమీఁద తెలిసికొనిన కష్టసుఖము లొండొరులు చెప్పుకొని లోటుపాటులు సవరించుకొనుటకును వీలు కలుగును. సర్కారువల్ల సాధింపఁదగిన కార్యములు సఫలము లగుటకు సాయపడును. సంఘీభావ మింకను ననేకలాభములను కలుగఁజేయును. కనుక నీ యుద్యమాభిమాను లగు నాంధ్రు లందఱును 'నుద్ధారకమహాసభ' యను పేర నొక సంఘముగాఁ గూడి పని చేయుట యుక్తము.

ఈ దీనజనోద్ధారకుల నెదుర్కొనుచున్న వానిలో నెల్ల మాలమాదిగలపై మోపఁబడియున్న యంటు సమస్యయే మిగుల కఠినమైనది. ఈ యంటునకు మడ్డితనమును మురికితనమును కారణము లనుటకు వలను కనఁబడదు. నిమ్నజాతులలో గణింపఁబడు నుప్పర యెఱుకల యేనాది కోయ చెంచు దొమ్మర మందుల లంబాడీ మొదలగు జాతులయొద్దకంటె మాలమాదిగలయొద్ద నేమి యంటు కలదో యూహింపఁజాలకున్నాము. పై జాతు లన్నియు బ్రాహ్మణులకు సైతము తొలఁగ నక్కఱ లేదు సరి గదా, వారి పడమటింటి గుమ్మమువఱకును నిరాక్షేపముగా రావచ్చును. ఒక్క మాలమాదిగలకు మాత్రమే యీ యంటు విధింపఁబడినది. ఈ యంటు యగ్రహారములలో మితి మీఱుచున్నది. దీని నిరంకుశాధికారమున కక్కడ హద్దుపద్దులు లేవు. అగ్రహారపు నడి వీథిలో సయితము మాలఁడు నడువఁగూడదు. ఇంతే కాదు, అగ్రజాతులలో నగ్రజాతి యగు బ్రాహ్మణుఁడు మడితో మాలనితో మాటలాడ నైన రాదు. అయినను, పని పట్టినప్పుడే చెట్టునకో పుట్టకో చెప్పుచున్నట్టు వాని దిక్కు చూచుచు — మాలని దిక్కు కాదు, చెట్టుచేమల దిక్కు — వానికి మాలవానికి — వినఁబడునట్టు గట్టిగాఁ జెప్పుచు వానివల్ల మరల ప్రత్యుత్తరము గ్రహింపవచ్చును. అంతటి మహావమానమునకుఁ బాల్పడుట కా మాలఁడు — హిందువుఁ డగు మాలఁడు చేసిన మహాపాతక మేమో? ఆహా! ఎంత వివేక మైన యాచారము! అయ్యో! తన విజ్ఞానప్రభావముచే ప్రపంచము నెల్ల నోహో యనిపించిన బ్రాహ్మణుఁడు — సమస్తలోకములకు నాదర్శప్రాయుఁ డైన బ్రాహ్మణుఁ డిప్పు డెంతటి యపహాస్యమునకుఁ బాత్రుఁ డగుచున్నాఁడు! కటకటా! కాలగతి!

ఆ మాలల యపరాధ మే మైనను వారి మైల యెట్టి దైనను నది పురాతనకాలమునాఁడే పుట్టి పెరిగి వేళ్లు నాటుకొనియున్నదగుటచే నీ యంటు మహావిషవృక్షము నొక్కమాఱుగా లోకుల హృదయక్షేత్రమునుండి కూకటివ్రేళ్లతో పెకలించి పాఱవేయుటకు సాధ్యము కాదు కాని, యభ్యాసవశమున నలవికాని కార్యము లేదు. అవసరమునకంటె నభ్యాసమున కనువైన మార్గము లేదు. చూడుఁడు! భూమి పుట్టినప్పటినుండి యగ్రజాతులు సంతలలో మాలలను రాచుకొని తిరుగుచున్నారు. రైళ్లలో కలసి మెలసి ప్రయాణము చేయుచున్నారు. మిషను పాఠశాలలలో నొండొరు లొడుఁలలో కూర్చుండి సమభావముతో మెలఁగుచు నన్యోన్యస్నేహబద్ధు లగుచున్నారు. తీర్థయాత్రలలో మాలలు చూచుచుండ చెట్టు క్రింద వండుకొని భుజించుచున్నారు. ఆసుపత్రులలో వారిచేతి తీర్థము శంఖతులసీతీర్థములవలె సేవించి చరితార్థు లగుచున్నారు. ఇవి యన్నియు బుద్ధిపూర్వకములే గాని ప్రమాదవశమున జరుగుచున్న కార్యములు కావు కదా! మాలల మైల యప్పు డెట్లు మాయమై పోవుచున్నదో మటుమాయగా నున్నది. ఇట్టి ప్రత్యక్షప్రమాణములే మనకు కొన్ని సాధనములను బోధించుచున్నవి. కాని, యించుమించుగా వీనిలో నన్నియు దొరతనమువారి మూలమున చేయవలసియున్నవి.

(౧) పంచమవిద్యార్థులను చేర్చుకొనని పాఠశాలలకు గవర్నమెంటు గ్రాంటుల నియ్యకుండుట. (౨) తాలూకా జిల్లా బోర్డులయొక్కయు మునిసిపలువారియొక్కయు నధికారములో నున్న పాఠశాలలలో పంచమ విద్యార్థులకు యథేచ్ఛముగా ప్రవేశము కలుగఁజేయుట. (3) పోస్టు పోలీసు తాలూకా జవాను పనులును కోర్టు జవాను అమీనా పనులును బాహాటముగా పంచముల కిచ్చుచుండుట. (౪) సంతలలోను మార్కెట్టులలోను పంచమాదుల దుకాణముల కవకాశములను కలుగఁజేయుట. (౫) గ్రామములలోని నూతులలోను చెఱువులలోను తక్కినవారితో పాటు ధారాళముగా నీళ్లు తీసికొను స్వాతంత్ర్యము కలిగించుట. (౬) నాటకములు మొదలగు ప్రదర్శనశాలలకును సమస్తసభలకును క్రైస్తవ మహమ్మదీయులతోఁ బాటు నిరాఘాటముగా గానిచ్చుట. (౭) యంత్రశాలలలో కూలీలుగా చేర్చుకొనుట. (౮) చర్మపరిశ్రమ వడ్రము కమ్మరము కుమ్మరము నేఁత కుట్టు మొదలగు వృత్తులను నేర్పి ప్రజలతో వ్యవహారసంబంధ మెక్కువ చేయుట. ఇత్యాది కార్యములవలన కాలక్రమమున మాలల యస్పృశ్యత యంతరించు ననుటకు సంశయము లేదు.

మరియు, సర్వలోపములను సంస్కరించుకొనుటకు జ్ఞానాంజనము దక్క శరణము లేదు. కాఁబట్టి నిమ్నజాతుల నున్నతస్థితికి తేవలయు నన్న వారికి విద్యాదానము చేసి దాని మూలమున నాత్మవివేకము కలిగించి గౌరవాపేక్షను, స్వాతంత్ర్యకాంక్షను పురికొల్పితీరవలయును. ఇందుకై దేశమున నల్గడల విశేషకృషి జరుగవలయును. ఊరూరను బాలబాలికలకై పగటి పాఠశాలలను పగటిపూట తీరనివారలకై రాత్రిపాఠశాలలను స్థాపింపవలయును. ఈ మహాకార్యము సామాన్యమా! సాధ్యమా! శ్రీమంతులును మహారాజులును జమీందారులును తలఁచినచో సాధ్య మన నేల, సుసాధ్యమే యగును. కాని, మన శ్రీమంతులకు వారి బిడ్డల విద్య జోలియే యక్కఱ

లేదు. మహారాజుల జమీందారుల గ్రామములే యవిద్యాదేవత కాలయములు. ఇట్టిచో వారి దృష్టి — హ్రస్వదృష్టి — పంచమపల్లులవఱకు పోవునా? వారిలో నెక్కడనో నూటి కొక్కఁ డట్టి మహామహుఁ డున్నను మహాఖండమువంటి యీ విశాలదేశమున నీ గొప్ప లోపము వారివల్ల సంపూర్తిగా చక్కఁబడ నేర్చునా? తమ పిల్లలకే ప్రథమశిక్ష యైనఁ జెప్పింపఁజాలని జనసామాన్యము తా మతినీచు లని యెంచుచున్న పంచముల పట్ల నంతటి సౌహార్దము వహించునా? వహించినను నిర్వహించునా?

ఇఁక నీ కార్యభారము భరింపఁగల సమర్థులు పాలకు లొక్కరే. సర్కారు సాయము లేక యీ పని యెన్నఁటికిని నెఱవేఱ నేరదు. అంతవఱకును దీనబాంధవులు — దయాసింధువు లగు దీనబాంధవులు 'శాయశక్తుల' సాయము చేయుచు నుతుత భక్తిని జూపుచుండుట ప్రశంసాపాత్రమే యైనను సామాన్యవిద్యాశాసన మేర్పడువఱకు నేకదీక్షతో కృషి చేసి దానిని సాధించినఁ గాని దేశీయ నాయకులు స్వధర్మనిర్వాహకులు కానేరరు.

సకలజనులకు నుచితముగను నిర్బంధముగను విద్య నేర్పఁగల శుభదినములు చేరువలో నున్న వని యనేకులు విశ్వసించుచున్నారు. అట్టి మహాభాగ్య మీ భరతవర్షమున కబ్బినను నప్పుడే దేశ మెల్ల విద్యామయూఖములచే ప్రకాశింపఁగల దని యాశించుటకు వీలు లేదు. ప్రాథమికవిద్య ప్రతిజాతికి నందుబాటులో నున్నను నిఱుపేద లగువారి బిడ్డలకు విద్యాలాభమును కలుగఁజేయుట కూడ సామాన్యమైన పని కాదు. విద్య యుచితముగా నేర్పుచున్నను, విద్యోపకరణములను ధర్మముగా నిచ్చుచున్నను బీద కుటుంబములలో నెవరి పొట్టకు వారే పాటుపడవలసియుండుటచే పాలేరుతనములు మాన్పించి పిల్లలను పల్లెకూటములకు పంపుటకు తల్లిదండ్రు లిష్టపడరు. అట్టియెడ శాసన మున్నది గదా యని దాని నమలులోఁ బెట్టి బీదల పీడించుట శ్రేయస్కరము కాదు. విద్య నిర్బాధకముగా నబ్బినప్పుడే శోభించును గాని నిర్బంధక మైనచో శోభకు బదులు మరింత క్షోభకు కారణ మగును. అందువల్ల విద్యాదానముతోఁ బాటుగా నన్నదానము కూడ చేసినఁ గాని సంస్కర్తల యభీష్టము సిద్ధింపఁజాలదు. కనుక భోజనవసతి గల పాఠశాలలను ప్రత్యేకము నిర్ధనికుల పిల్లలకై నెలకొలుపవలసియున్నది.

ఇంతే కాదు, ఇతరజాతులలో సరిగా చదువుకొనుటకు సాగని పెద్దవారలకు పరిశుభ్రత ఆరోగ్యము మధుపాననిషేధము మొదలగు విషయములును దేశీయవ్యవహారములును ప్రపంచస్థితిగతులును మతవిషయములును పౌరాణిక చారిత్రక కథాంశములును బోధించుచు నాయా విషయముల జ్ఞానము గలిగించినఁ గాని వీరి విద్య పూర్తి కానేరదు.

మాలపల్లెలకు వెళ్లి వారితో ననువుచనువులతో మెలఁగుచు నభిమానముతో పని చేయఁగల సమర్థు లగు నుపదేశకులను సమకూర్పవలయును. ఈ కార్యముల కన్నిటికిని సర్వవిధముల నక్కఱకు వచ్చు బుద్ధిమంతులు వారియందే కావలసినంతమంది కలరు. వారెవరు? శుచిశుభ్రతలు గలిగి దేశీయసంప్రదాయములు దేశభాషాజ్ఞానము గలిగి విద్యావివేకములు గలిగి వినయాదిసుగుణసంపత్తి గలిగి దేవబ్రాహ్మణభక్తి గలిగి వైష్ణవచిహ్నములతో నొప్పుచు సచ్ఛూద్రులవలె — శూద్రు లన నేల? సర్వవిధముల నగ్రజన్ములతో తుల్యులై వెలయు మాలదాసరులు.

ఈ దాసరులు బ్రాహ్మణులవలె పంచాంగములను జెప్పుచు ముహూర్తము లుంచుచు జ్యోతిషసాముద్రికఫలములు దెలుపుచు దేవాలయములలో నర్చకత్వము చేయుచు వైద్యము చేయుచు భాగవతములు నాటకములు నాడుచు హాస్యములు చెప్పుచు కాలక్షేపము చేయుచున్నారు. ఇట్టివారు బోధకులుగా సిద్ధము చేయఁబడినచో తప్పక గట్టివారు కాఁగలరు. పంచమాదులు పరమతబోధలకు లోఁబడి స్వమతమును విడనాడి హిందూసంఘమును జీల్చి జాతీయతకు బలహీనత కలుగఁజేయకుండ సంరక్షించుటకుఁ గూడ నిట్టి యుపదేశకు లావశ్యకము. అత్యావశ్యకము. ఇట్టి కార్యముల కన్నిటికిని ప్రజల పట్టుదలయు శాసనసభ్యుల కార్యధీగతయు నాధారములై యున్నవి.

నిమ్నుల యభివృద్ధికై నిరంతరప్రయత్నములు చేయుటకును వీరి స్థితిగతులు చక్కఁబఱచుటకును శాసనసభలలో వీరికి ప్రత్యేక ప్రతినిధు లుండుట యత్యవసరము. ఎవరి కష్టనిష్ఠురములు వారికే గాని యితరులకు బాగుగా తెలిసియుండవు. ఇతరకులములవా రెంత భూతదయావంతు లైనను నెంతటి సానుభూతిస్వాంతు లైనను వారి సంతాపమును వారి హృదయాందోళనమును సరిగా గుర్తించి ప్రకటింపఁజాలరు.

మాలపల్లెలు విశాలము లైనవి గాక యిఱుకై మఱికి గలవై దుర్గంధభూయిష్ఠములై యనారోగ్యకరములై యంటుతెవుళ్ల నెలవులై నరలోకనరకములై యున్నవి. వారి కుటీరములు దారిద్ర్యమునకును దైన్యమునకును దుఃఖమునకును దావలములై యున్నవి. వారికి పానోదకములకు మంచి జలాధారములు లేవు. పండుగపబ్బములయం దైనను కడుపు నిండ కుడుపు లేదు సరి గదా కరవుకాలములలో దుంపదూడులే గాని గంజినీళ్లకయిన గతి లేదు. వైద్యసహాయము బొత్తిగా లేదు. అంటురోగములు చెలరేఁగినప్పుడు మందుమాకులు లేక చావవలసినదే గాని దిక్కు మొక్కు లేదు. ఎప్పుడును పొట్టకొఱకు తడువుకొనుటయే గాని యొకప్పు డైనను వారికి విశ్రాంతి లేదు. వారి మనస్సునకు హాయి లేదు. వారి ప్రాణమునకు సుఖము లేదు. సంతోషము లేదు. వారికి పరసేవనమే దాస్యమే బానిసతనమే నిత్యకృత్యముగా జీవనోపాధిగా జన్మావధిగా నున్నవి. ఇంకను మనకు తెలియని తెలిసికొన వీలు లేని యూహింపనలవి కాని కష్టనిష్ఠురము లెన్నెన్నో వారు తమ నిత్యజీవనమునం దనుభవించుచున్నారు. ఇట్టి దుస్సహదుఃఖభాజన మైన వారి జీవితము దుర్భర మనుట యతిశయోక్తి కాదు!

ఇట్టి కడగండ్లనుండి వారిని తప్పింపవలయు నన్న వారు కాఁపుర ముండుటకు విశాలము లైన నివేశనము లిచ్చియు బంజరుభూములను నడవినేలలను వ్యవసాయమున కిచ్చియు వారి యనా

రోగ్యము నభాగ్యతను దొలఁగింపవలయును. వైద్యసాహాయ్యమును పొందుటకై వారికి ప్రత్యేక సౌకర్యములు కల్పించి ఘోరవ్యాధుల వాతఁబడి యకాలమృత్యువు పాలు గాకుండ రక్షింపవలయును. వారి పల్లెల సామీప్యమునుండి కల్లు సారాయి యంగళ్లను తొలఁగించి వారికి మితవ్యయము నేర్పవలయును.

ఇంతటి కార్యభారమును శిరసా వహించి యీ దీనుల నీ యనాథుల నీ యార్తుల నీ యభాగ్యుల సర్వాభంగుల నుద్ధరించుటకీ దుఃఖసాగరమును తరింపఁజేయుటకు స్వయంతీర్ణులగు స్వకుల ప్రతినిధులకంటె సర్వాలెవ రుందురు? అంతటి బాధ్యులెవ రగుదురు? సమర్థత యందురా? అవకాశమును బట్టి కాలక్రమమున దాని యంతట నదియే రాఁగలదు. ఇది లోకమున మనము నిత్యము చూచుచున్న సంగతియే కాని క్రొత్తది కాదు.

పంచములకు ప్రతినిధుల నెన్నుకొను నధికారమే కలిగిన యెడల నాత్మవికాసము కలుగును. ఎన్నిక సమయములలో ప్రాతినిధ్యము కోరువారివల్ల నుద్రేకకరమైన యుద్బోధము కలుగును. ఆత్మవిచారము కలిగి తమకును నితరులకును గల యంతరములను దెలిసికొని తమ స్థితిగతులు బాగుపడుటకు తగిన కృషి చేయ నభిలాష కలుగును. స్వవిషయములలో నుపేక్షాభావమును నీచస్థితి యందే సంతృప్తియు తాము నీచుల మనియు నీచత్వము ననుభవించుటకే జన్మించితి మనియుఁగల మూఢవిశ్వాసములు మొదలంట నశించుటయు కలుగును. అంతటితో వారి యనారోగ్యదశయు నభాగ్యదశయు నశించి వారి కగ్రజన్ములతో సమత్వము కలుగును. అట్టి సమత్వము సిద్ధించినప్పుడే సౌభ్రాత్రము వర్ధిల్లును. కావున పంచములకు ప్రత్యేక ప్రాతినిధ్య మిచ్చితీరవలయును.

భువనభయానకమై యాశ్చర్యజనకమైన ప్రాపంచిక స్వాతంత్ర్యమహాయుద్ధము ముగిసి స్వాతంత్ర్యమహాసత్రము తెఱవఁబడుచున్నది. ఆ మహాసత్రములో నఖిలదేశములును నిఖిలజాతులును యథేచ్ఛముగా స్వతంత్రతామృతమును జేరలనిండ జుఱ్ఱుకొని సంతుష్టి చెంది సుఖింపఁగల వని ప్రపంచమెల్ల నాశాపిపాసాతురమై యెదురు చూచుచున్నది. భరతవర్షము కూడ నా మహాసంతర్పణమునఁ బాలుగొనఁగలదా? కల దనియే కొంద ఱుబ్బూఁత లూఁగుచున్నారు. యజనులును పాకశాసకులును నెవరైనను వడ్డించువాఁ డొక్కఁడైన మనవాఁడు లేనప్పుడు మన విస్తరి యంటు సొంటు లేక వేసినది వేసినట్టే యుండు నని కొంద ఱూహించుచున్నారు. భరతఖండము స్వచ్ఛందమహాశిఖరము నధిరోహించుట కింకను నెన్నియో ఘట్టములు దాఁటవలయు ననియు నెన్నియో సోపానము లెక్కవలయు ననియు వారు తలంచుచున్నారు. మన కా మహాభాగ్యముఁ జూరలాడఁగల యోగ్యత యింకను రాలే దనియు కొందఱు వాకొనుచున్నారు. ఎవ రెట్లనుకొన్నను భరతఖండమునకు శుభదినములు మాత్రము తప్పవు. ఆమె భావిదశ యెంతయు శోభాయమానమై ప్రకాశించుచున్నది. భారతీయు లంతఃకలహములు లేక యేకగ్రీవముగా స్వయంనియంతృత్వమే ముమ్మాటికి తమ మనోరథ మని త్రింశత్కోటికంఠములతో నతిగంభీరస్వరములతో గర్జించిరేని, మన రాయబారము లాపివేయఁబడుఁ గాక మన ప్రతినిధుల కందు ప్రవేశము లేకపోవుఁగాక, సంధిమహాసభ యంతయు విలయవాయుసంక్షుభితమహాగుహవలె ప్రతిధ్వానములతో దద్దరిల్లి భూనభోమండలములు బ్రద్దలై సభ్యులు నిశ్చేష్టులై మన నిర్ఘోషము నాలకింపరా? మన హక్కులను మన కిచ్చివేయ నుంకింపరా? దీనబాంధవుఁడును నార్తత్రాణపరాయణుఁడును నైన భగవంతుఁ డింకనైనను నార్యావర్తమును దైన్యావర్తమునుండి తప్పించి రక్షింపక యుపేక్షించునా? కనుక భారతసోదరులారా! మీ సోదరుల నుద్ధరించి మీ రుద్ధరింపఁబడుఁడు. నిమ్నవర్గ సముద్ధరణమే మహాభారతసముద్ధరణ మని తెలిసికొనుఁడు! ఆఱు కోట్ల కోడి మానవులు స్వదేశమున సోదరులచేతనే హింసింపఁబడుచుండుటచే నార్యావర్తమునకు కలిగిన కళంకమును తొలఁగించి ప్రసన్నమాతృదేవతాశీర్వచనమును బడసి యభ్యుదయపరంపరలు తామరతంపరలై యుల్లసిల్ల సుఖసంతోషముల నోలలాడుచు నిత్యకల్యాణములతోను పచ్చతోరణములతోను వర్ధిల్లుఁడు!

Hon'ble Muppil Nair.



Dewan Bahadur P. Ramarayaningar.



# క్రైస్తవాంధ్రుల కర్తవ్యము

గొల్లపల్లి సామ్యేల్ గారు

మన పితరులు గాని పితామహులు గాని ప్రపితామహులు గాని క్రైస్తవమతావలంబకులై యుండుటచేతనో మన మాతతే యీ మతమును స్వీకరించుటవలననో మనంత మనమే తన్మతంబును గైకొంటం జేసియో ఈ ముత్తెఱంగులలో నేదో యొక విధమున మనము క్రైస్తవుల మైతిమి. మన మాంధ్ర దేశమునం దుద్భవించుటం జేసి యాంధ్ర క్రైస్తవుల మను పేరం బరంగుచున్నారము. మనము గాని మన పూర్వులు గాని స్వమత మగు హిందూమతమును త్యజించి మన హిందూసోదరులు కొందఱు తలంచు రీతి ఖండాంతరమునుండి కొని తేబడిన విదేశీయుల క్రీస్తుమతంబు నొప్పుకొనుటలో మనకు హిందూమతమునం దాత్మశాంతి కుదురక పోవుటయే ప్రబల కారణము గాని హిందూసోదరులయెడ నీర్ష్యాభావముచేతం గాని హిందూమతమునం దేవగింపుచేం గాని కాదు. మీఁదుమిక్కిలి క్రైస్తవమతము సత్యమత మని మనకు నిశ్చితాభిప్రాయము కలుగుటచే దాని నవలంబించితిమి.

మన కిష్టమైన మతమును మన మంగీకరించుటలో దోష మేమియును లేదు. ఎవరి యిష్టమునకు వారు కర్తలు. "లోకో భిన్నరుచిః" అన్నటు లెవరి యిష్టానుసారముగ వా రాయా మతముల స్వీకరింపవచ్చును. కాని, మనము పరమతాన్వేషకుల మైనంత మాత్రమున మన హిందూభ్రాతలకును మనకును సంబంధము బొత్తిగ పోయెనా? నిన్న మొన్నటివఱకును హిందూమతస్థులుగ నుండిన కొందఱు క్రైస్తవమతస్థు లగుటతోడనే వారిని గర్భశత్రువులుగ చూచుట మిక్కిలి యాశ్చర్యమును కలిగించుచున్నది. ఒక కుటుంబములోనే డెనమండ్రున్నప్పుడు వారివారి జిహ్వలకు రుచించునట్లు వివిధ శాకపాకములను గాని భక్ష్యాదులం గాని భుజింతురు. అట్లొనరించుటచే వా రేకకుటుంబికులు కాకపోదురా? సమయము వచ్చినప్పుడు వా రంద ఱొక్క త్రాటిమీఁద నడువకుందురా? క్రైస్తవులు కాంగానే వా రట్లు హిందూసోదరులయెడ నుండుటకు సరియైన కారణము కనుపట్టదు. ఒకవేళ వారలు హిందువులుగ నున్నప్పుడు హిందూమిత్రులు పెట్టిన హింసలు జ్ఞప్తికి తెచ్చుకొని యట్లు వర్తించుచున్నా మన్నచో నదియును మన మతాభిప్రాయమునకు వ్యతిరేకమే కదా? ప్రేమచే మన మెట్టివారిని జయింపవలసియుండును. ప్రకృతము మన దృష్టికి గోచరించు విషయములం బట్టి క్రైస్తవమతము ఖండాంతరమం దైనను ప్రపంచచరిత్రవేత్తల కది మన ఖండపు మతమని తేటతెల్లముగ తెలియును. మతములకుం బుట్టినిల్లనందగు నాసియాఖండమున హిందూ మహమ్మదీయ బౌద్ధ ప్రముఖ మతములు మాత్రమే గాక చిన్నాసియాలోని పాలాస్తీనాదేశమందే క్రైస్తవమతము కూడ నుత్పన్న మయ్యెను. కారణాంతరములచేతను దైవఘటనవలనను ఖండేతరములనుండి మన ఖండము మతప్రబోధకులను దిగుమతి చేసికొనవలసిన యావశ్యకత వచ్చియుంటచే మన హిందూసోదరులలో కొందఱు కది ఖండేతరమతమై గన్పట్టవచ్చును. కాని, యట్లు తలంచువారికి నే విన్నవించున దేమనంగ, ఖండేతరం బని ఖండింపక స్వఖండాంతర్గతము లైన బౌద్ధ మహమ్మదీయమతముల పట్ల తమ కెట్టి సద్భావము గౌరవము కలదో యట్లే క్రీస్తుమతమందును కలిగియుండవలె ననుటయే. మన మిప్పుడు చర్చించునది మతవిషయము కాదు గాన దాని నట్లు విడిచి ప్రకృతవిషయము నాలోచింతము.

## క్రైస్తవులు రాజకీయవిషయములలో పాల్గొనకుండుటకు గల కారణములు:

(a) రాజకీయవిషయికజ్ఞానము శూన్యము. దామాషాను నూర్గురు క్రైస్తవులను నూర్గురు హిందువులను విద్యావిషయమునం బోల్చి చూచిన యెడల క్రైస్తవులలోనే చదువుకొన్నవా రధిక సంఖ్యాకులుగ నుందురు. కాని, చదువుకొన్నవా రన్నంత మాత్రమున లాభము లేదు. వారలు నేర్చిన చదు వక్షరజ్ఞానమాత్రమై చేవ్రాలు చేయుటకు వినియోగించును. వారికంటె నెక్కువగ చదువు నేర్చుకొంటి మనువారి విద్య గ్రామాదులలో పద్దుపత్రములు చదువుకొనుటకును ఎలిమెంటరీ స్కూళ్లలో నుపాధ్యాయపదవి చేం బొట్టంబోసికొనుటకును బైబిలుగ్రంథమును పఠించి వారు గ్రహించిన రీతిగ నితరులకు మతబోధం జేయుటకును మాత్రమే వర్తించుచున్నది గాని వార్తాపత్రికలు చదువుకొనుటకుం గాని వానిలోని రాజ్యాంగ విషయముల గ్రహించుటకుం గాని యందని జ్ఞానము గలవారై యున్నారు. అంతియే కాక, వారి పైయధికారులు మిషనెరీవారై యుండుటచేత వారి దర్శనమునకుం బోయినను మనవిం జేసికొనుట కేగినను ఆ మిషనెరీవా రా క్రైస్తవుల కేవిధమైన ధనసహాయముం జేయక రిక్తహస్తములతో నిండ్లకు తోలివేయుఁదలంచియు మతసంబంధమైన జ్ఞానోపదేశమున మాత్రము వెలితి లేకుండ కడుపునింపి పంపివేచెదరు. దానంజేసి క్రైస్తవులు కేవలము లౌకిక విషయమున జ్ఞానశూన్యులుగ నుండుటకు హేతు వేర్పడుచున్నది. మొదటం బేర్కొనంబడినవార లటుండ, మాధ్యమికపాఠశాలాపరీ

క్షలయందును సున్నతపాఠశాలాపరీక్షలందును కృతార్థులైన వారు కొందఱు గలరు. వారి కీ విషయములయందు కొంత యభిరుచి యున్నను, వా రవి నేఱువేర్చుకొనుటకు అవకాశము లేదు. అట్టి వారిలో నెక్కుడుమంది మిషనుపనివారే గాన సూర్యోదయము మొదలుకొని సూర్యాస్తమయపర్యంతము మిషనెరీవారినే సంతోష పఱచుటకు కాలము గడపవలసియున్నది. వారి కే విధమున నైన మతవిషయకకరపత్రములు పొత్తములు చేతులకు చిక్కునే గాని మఱియొండు రావు. స్వయముగ తా మేదైన వార్తాపత్రికకు చందాదారులై తెప్పించుకొని చదువవలె నన్న, వారికి స్వల్పవేతనములు గాన నట్లు చేయ వీలు లేదు. పుస్తకభాండాగారములు గాని, పఠనమందిరములు గాని యున్న పెద్ద గ్రామములలోనో లేక చిన్న పట్టణములలోనో వార లుండుట తటస్థించెనేని, వానినిఁ గూర్చి మఱియవలసినదే గాని వాని ఫలితార్థములఁ బడయుటకు వారికి వీలు లేకున్నది. ఏల యనఁగ, నట్టిచోట్ల నుండు మన హిందూసోదరులలో నెక్కువమంది పూర్వాచారపరాయణులై తమ కున్న కార్యదీక్షను పట్టుదలను కులాచారములయందే గనఁబఱచుటచే పాపమీ పేద క్రైస్తవులు గుటకలు మ్రింగవలసినదే గాని పత్రికలు చదువుకొని యొకరి భావము లొకరికి వెల్లడించుకొనుట కైనను సాధ్యము గాకున్నయది.

(b) క్రైస్తవు లైన వెంటనే యూరోపియనుల మైత్రిమని కొందఱు క్రైస్తవులు తలంతురు. ఇట్లు నేను వ్రాసితి నని మదీయ క్రైస్తవసోదరులు దుందుడుకుతనమున వ్యాఖ్యానమునకు దిగక సావధానముగ నా నుడు లాలకించి శాంతచిత్తతతో నాలోచింప వేఁడెదను. అట్లు తలంచిన వారిని తలంచుచుండిన వారిని నా కన్నులారఁ గాంచుటంజేసి స్వానుభవమున నీ విషయమును జెప్పుచున్నాఁడ. పాశ్చాత్యుల మత మని మన హైందవ భ్రాతలు వ్యవహరించు మతము ననుకరించుటచేతనో పాశ్చాత్యుల కరస్పర్శనమాహాత్మ్యముచేతనో పాశ్చాత్యుల యాచారములు ప్రశస్తము లగుటవలననో పాశ్చాత్యుల దుస్తుల విధానము మనవారిని భ్రమగొల్పియుంటనో మన దేశభాషయు నాచారప్రభృతులును వారి కంటికి నచ్చకపోవుటచేతనో మనవారు జాతీయభావమును బొత్తిగా దిగనాడుచున్నారు. నిజదేవు నారాధించుటకొఱకై మాత్రమే క్రైస్తవమతమును స్వీకరించితి మను భావమును మనవారు మఱచి యూరోపియను లగుటకే పరమతంబు నంగీకరించితిమో యనునట్లు వర్తించుచున్నారు. మన మట్లు యూరోపియనులము కావలె నను తలంపు మనకు వచ్చుటయే కడు హేయమైన సంగతి. కడు ప్రాచీనమైన నాగరికజాతికి చెంది యనేకవిషయములందు ప్రపంచమందలి జాతు లన్నిటిలో నధికత గలవారము మన మై యుండి యట్లు కోరఁదగదు. ఒకవేళ యూరోపియనులే నాగరకాగ్రగణ్యులు గాన మనము న ట్లుండవలె నని మీలో కొంద ఱుద్దేశించినను, తెలుపు నలుపుఁ జేయుట గాని నలుపుఁ దెలుపుఁ జేయుట గాని యెవరికి శక్యము? ఈ సందర్భమున "గోదావరికి పోవ కుక్క సింహము గాదు, కాశి కేగ పంది గజము కా" దను పద్యము జ్ఞప్తికి వచ్చుచున్నది. జాతీయభావ మట్టివారికి క్రమముగా సన్నగిలుట మాత్రమే గాక హృదయకాసారములనుండి యిగిరిపోవుచున్నది. దీనికి ప్రబలకారణము వారిని నిత్య మావరించుకొనియున్న యాంగ్లభాషావాతావరణమై యున్నది. ఆంధ్రగ్రంథములంటుటే మహాపాతకముగను ఆంధ్రభాషను మ్లేచ్ఛభాషగను నెంచుచున్న యాంధ్రక్రైస్తవు లెందఱు లేరు. అట్టివార లాంధ్రుల మని చెప్పుకొనుట కేల సిగ్గుపడరో తెలియకున్నది. అట్లు చెప్పకపోయిన వీరికి వేఱు దిక్కేమి? అట్టివారి కుమారీకుమారులకు మంగళకార్యములు జరుగవలయుచో కొంతమంది వలన వీరు దొరలని పిలిపించుకొన్నంత మాత్రాన యూరోపియనులు గాని ఆంగ్లోయిండియనులు గాని వచ్చి వీరితో సంబంధబాంధవములు జరుపరు గదా? మరణమాంగళ్యకర్మములు సంభవించినను వారు వచ్చి జరుపుదురా? గడియగడియకు విచిత్రముగ రంగు మార్చుకొను నూసరవెల్లులఁ బోలి కృత్రిమసనాహములతో పాటు వేషములఁ గూడ ధరించిన నిట్టి హైందవయూరోపియనుల కాంధ్రపత్రిక లన్న నసహ్యము జాతీయవిధానముగ దోవతులఁ దాల్చినవారు వారి యిండ్లకడ కేతెంచుట కడు నీచ మఁట! ఇట్టి మహానీయు లుండుటచేతనే గదా "క్రైస్తవ" తెలుఁ గని మన హిందూసోదరు లాక్షేపింపవలసిన యక్కఱ కలిగినది. దీనిని బాపుటకు మన యాంధ్రక్రైస్తవులింకను ప్రయత్నింపకుండుట కడు శోచనీయము. కాన, పై చెప్పఁబడిన ప్రకార మాంగ్లాచారావలంబులు తమకు జాతీయోద్యమముతోఁ గాని రాజకీయవిషయములతోఁ గాని నిమిత్తము లే దని తలంచుచున్నారు.

(c) కొందఱు హైందవసోదరులు క్రైస్తవుల నందఱను సదా యనుమానముతో చూతురు. క్రైస్తవు లందఱు దొరల మతస్థు లగుటచే దొరలు వారలు నొకటే యనియు మిషనెరీలు దొరతనమువారు నాలాగే యొకటనియు నందువలన క్రైస్తవులు దగ్గఱ నుండఁగ రాజకీయములను గూర్చి మాటాడఁ గూడ దనియు నట్లు చేసినచో నపాయము వాటిల్లఁ గల దనియుఁ దలంచి వారియెడ హిందువులు సదా సందేహముతో వర్తించుటఁ గాంచుచున్నారము. అందువలననే కొన్నిచోట్ల బహిరంగసభలకు సైతము క్రైస్తవు లాహ్వానింపఁబడకున్నారు. రక్షకుని సువార్త నందించినవారు మిషనెరీ లగుటచే నుభయులకుఁ గొంత సంబంధ మేర్పడవచ్చును గాని క్రైస్తవు లందఱు వారివారి మిషనెరీల యభిప్రాయము నే కలిగియుందు రని యూహించుట హాస్యాస్పదము. క్రైస్తవునికి మాత్రము స్వాతంత్ర్య మవసరము కాదా? ఉక్కు చిక్కములోఁ గట్టఁబడియుండుట కెవరి కిష్ట మగును? హైందవ సోదరులు వారియెడ నిరసనభావ ముంచక క్రైస్తవులను తమతోఁ గలుపుకొని సర్వజనసంబంధము లగు వ్యవహారములు పరిష్కరించుకొనుట కెట్టి చిన్న యవకాశము చిక్కిన నట్లు చేతు రని నమ్ముచున్నాను. క్రైస్తవజనసామాన్యము సాంఘికస్థితియందు హిందువులకంటె కొంచెము వెనుకఁబడియుండుటచేత వారంతట వారే వచ్చి

తనముఁ జేసియో కూలిఁ జేసియో జీవించుచు మిక్కిలి దైన్యములో నుండి వారి మాట కెదురాడకుందురు. అందుచే, వా రాడినది యాటగను పాడినది పాటగ నుండును. ఐనను వీరు క్రైస్తవులైన వెంటనే తమ గ్రామములోని యుపాధ్యాయుని ప్రోద్బలమున నేమి, మిషనెరీవారి యాసరాచే నేమి కొంతవఱకు స్వతంత్రబుద్ధిఁ గనఁబఱచి నాగరకతకు వచ్చి తమ పోషకులవలెనే దుస్తులను ధరింప మొదలిడుదురు. ఒరే తరే యని వారివలన మునుపటివలె పిలిపించుకొనఁబడుట కిష్టపడరు. ఒకానొకప్పుడు వారి నెదిరించుటకును వారిమీఁద ఫిర్యాదులు చేయుటకుఁ గూడ సమర్థు లగుదురు. ఇట్టి స్థితిలో మన హిందూభ్రాతలు, వా రట్టి యున్నతదశకు వచ్చుచుండుట చూచి సంతోషించుటకు మాఱుగ, మిగుల నసూయపడుదురు. క్రైస్తవులు చదువుకొనుట వారి కిష్ట ముండదు. దానంజేసి వారియెడ తమ కున్న యసూయయే, వారి నెంతటి దుష్టకార్యముల కైన నడిపించును. వాని నన్నిటి నిట పేర్కొనుట యప్రస్తుతము. ఇఁక బ్రాహ్మణులలోఁ గొందఱున్నచో యింట్లు ముట్లు నెక్కువగా కలిగి వారిని వీథులగుండ సైతము నడువనీయరు. సర్వజనోపయోగార్థమై యుంచఁబడిన తపాలాఫీసునకు సైతము వారిని రహదారి వీథిని పోనీయరు. ఇట్టి కారణములచే క్రైస్తవులకును క్రైస్తవేతరులకును చిరకాలము నుండి పగ యేర్పడి, వంశపారంపర్యముగ వచ్చుచుండును. దానంజేసి యుభయపక్షములవా రొకరి ముఖము లొకరు వీక్షించుకొనుటకే మిక్కిలి యసహ్యత నొందుచుందురు. ఇట్టితఱిని రాజకీయవిషయము లందఱికి కావలసినవే యైనను వెంట రావల దనిన నెత్తుకొను మను వా రుండుట యరుదు గాన క్రైస్తవులు వానిలో పాల్గొనకున్నారు.

### దుస్థితిని చక్కచేయుటకు మార్గములు

పై నుదాహరింపఁబడినవారు గాక, నగరనివాసులై నవనాగరికులై పట్టపరీక్షలఁ గాని వానికి సమానమగు నితరపరీక్షలందుఁ గాని యాఱితేఱిన క్రైస్తవులు వారికి సాధ్యమైనంతవఱకు రాజకీయములందు హిందూభ్రాతలకు చేదోడువాదోడు లగుచున్నారనుటకు సంశయము లేదు. క్రైస్తవజనసామాన్యమునకు కూడ నట్టి ప్రోత్సాహము కలుగవలె నన్న వారిలో గాఢమైన దేశాభిమానమును పురికొల్పవలెను. దేశాభిమానము ముందట నెట్టి పగలును ఈర్ష్యలును కులాతంకములును విదేశాచారప్రీతియు పటాపంచలై పాఱిపోవును. దేశాభిమానము లేమియే యిట్టి యనర్థములకు మూలబీజమై యున్నది. హిందూమిత్రులు తమ మూర్ఖాభిప్రాయముల విడనాడి క్రైస్తవులను గూడ తమవారిఁగనే యెంచి ప్రత్యంశమునందును వారికి హృదయపూర్వకమైన స్వాగత మీయవలెను. ఏ యాటకా మద్దెల దరువు వేయఁగల యిండియా మైన్సు పత్రికయు మద్రాసు మెయిలు పత్రికయు నీమధ్య మాంటాగ్యు ఛెమ్సుఫర్డు సంస్కరణవిధాన మంగీకరించుటలో క్రైస్తవులను చంకను వేసికొనుట చాల నాశ్చర్యముగ నున్నది. క్రైస్తవు లెల్లరు నిట్టి తీపిమాటల నమ్మి మోసపోకుందురు గాత! హిందువులు గూడ తా మనుకొన్న పనులు నెఱవేఱువఱకే క్రీస్తవులను వెంటఁ బెట్టుకొని తిరుగుదురు గాని తర్వాత వారి నక్కఱచేయ రని కొందఱనుచున్నారు. కాని, యట్టివారు మిక్కిలి హ్రస్వదృష్టు లని సూచించుచున్నాఁడ. సహపంక్తిని గూర్చుండి మధురాహారములఁ గొనుట భోజనము చేయుట యిత్యాదివిషయము లటుండనిచ్చి స్వేచ్ఛగా తిరుగుట కొకరినొకరు స్పృశించుటకును గల యంతరాయముల నన్నిటిని వ్రేళ్లతోఁ బెకలించి వేయవలెను. ఇవ్విషయముల జక్కఁజేయుటకు హిందూసోదరులే మిక్కిలి కష్టపడవలసియున్నారు. క్రైస్తవులు తమతో సమానముగ భుజములు గల్పుట కాటంకములను వారే పెట్టియున్నారు. కాన, వానిని తీసివేయుటకు వారే యుద్యోగింపవలెను. నేను నా వ్యాసమునకు మకుటంబుగ "నాంధ్రక్రైస్తవుల కర్తవ్యం" బని ప్రాతిపదిక మిడితిని, ఆన్యాంధ్రభ్రాతలే మిక్కిలి పాటుపడవలసి యున్నారు.

# దేవాదాయ ధర్మాదాయములు

వల్లూరి సూర్యనారాయణరావు పంతులుగారు, బి. ఏ., బి. ఎల్., ఎల్. టి.

పూర్వము ప్రజలలో భగవద్భక్తి యెక్కువగ నున్నప్పుడు రాజులును వారి మంత్రులును జమీందార్లును వారి యేజెంట్లును ధనికులును దేవాలయములు సత్రములు చెఱువులు తోఁటలు మొదలగువాని నేర్పఱచి వానికి ఈనాములను కూడ నిచ్చియున్నారు. బ్రిటిషుపరిపాలన మారంభమైన తరువాత మన రాజధానిలో వీని సంరక్షణనిమిత్తము ఆ 1817 సం. న 7 వ రిగ్యులేషను ప్యాసుచేసి యీ దేవాదాయధర్మాదాయములను తమ క్రిందనే యుంచుకొనిరి. కాని, 1857-వ సంవత్సరములో పెద్ద సిపాయికలహము అణఁపఁబడిన తరువాత దేవాలయములను మాత్రము కొందఱు మేనేజర్లకును కమిటీలకును ఒప్పఁజెప్పిరి. ఒకప్పుడు స్వల్పముగు అయివజు వచ్చు దేవాలయములకు వాని యర్చకులనే మేనేజర్లనుగా ఏర్పఱచిరి. ఈ దేవాదాయములు సరిగ మేనేజి చేయఁబడుచున్నదియును లేనిదియును కోర్టువారు విచారించుటకు 1863 సం॥ నెం 20 వ ఆక్టు చేయఁబడినది. 1859-60 సంవత్సరములో నీనాము కమిషనరువారు ఈ దేవాదాయ ధర్మాదాయములను గుఱించి యీనాముపట్టాలు తయారుచేసి తత్కాలపు మేనేజర్ల పేర్లమీఁద జారీచేసిరి.

ఈనాముకమీషనరువారి విచారణలో కొన్ని దేవాలయములకు మేనేజర్లుగా నున్న అర్చకులు ఈనాములకు స్వామివారే హక్కుదారు లనియుఁ గాని నిత్యనైవేద్య దీపారాధనలఁ జేయుచు తామే ఆ అయివజు ననుభవించుచున్నా మనియు స్టేటుమెంట్లు దాఖలు చేసిరి. ఆ ప్రకారముగనే స్వామివారి పేరుమీఁద పట్టాలు వ్రాసి తత్కాలపు మేనేజర్లని అర్చకులకు ఇచ్చివైచిరి. అప్పటి పరిస్థితులలో స్వామివారి యీనాములనుండి వచ్చెడి అయివజు నిత్యనైవేద్యములకును, అర్చకుల భుక్తికిని చాలనందున వారు స్వామివారికి నష్టముఁ గలుగజేయుటకు అవకాశములే లేవు. గ్రామములోని భక్తిపరులు, ధర్మాత్ములు, ఉత్సవములను గుడిమరమ్మతులను చేయించుచుండిరి. అర్చకులు లేనియెడల నిత్యపూజయే చేయువా రుండరు గనుక వారి కుటుంబజీవనము నిత్యపూజావిధానపుకర్చులలో చేరినట్లుగనే ఎంచవలెను. దేవాలయములో సంగీతము వేదాధ్యయనము హరిభజన మేళము, నాట్యము మొదలగు నౌకరీలకు మాన్యములుగ నీయఁబడినపుడు అట్టినౌకరీ చేసినంతకాలము మాన్యము లనుభవించవచ్చు నని యీనౌకర్ల కిచ్చిన పట్టాలలో స్పష్టముగ వ్రాయఁబడినది. ఇట్లు అర్చకులకిచ్చిన పట్టాలలో సాధారణముగ నుండదు. ఉండవలసిన పనియు లేదు. నౌకరీనిమిత్తము గాక నిత్యనైవేద్య దీపారాధనల కని గాని, లేక దేవాలయపు సంరక్షణ కని గాని, అర్చకుల యీనాము స్టేటుమెంటులలో వ్రాయఁబడి గ్రామోద్యోగస్థులు సాక్షివ్రాలు చేయుటచేతనే ఈనామురిజస్టర్లలో అట్లు వ్రాయఁబడుచు పట్టాలు స్వామివారి పేరనే ఈయఁబడుచుండెను.

ఇటీవల భూములమీఁది అయివజు ప్రతిజిల్లాలోను ముఖ్యముగ డెల్టాప్రాంతములందు వృద్ధి యగుచున్నది. కాని దైవభక్తి తగ్గుచున్నది. అర్చకుల కుటుంబములు తామరతంపరగా పెరుఁగుచున్నవి. కనుక స్వామివారిభూముల యాదాయ మంతయు నర్చకుల యుపయోగమునకే కర్చు అగుచున్నది. ఎంత అయివజు వచ్చుచున్నను నర్చకులే అనుభవించుచున్నప్పుడు గ్రామస్థులు తామేల యుత్సవములకును గుడిమరమ్మతులకును సొమ్మును కర్చుపెట్టవలె నని యూరకొనుచుండుట ఉత్సవములు మొదలగునవి లేక చిన్నలలోను పెద్దలలోను మతమునందు నమ్మకము తగ్గి తుదకు దేవళములుకూడ శిథిలములై మిక్కిలి శోచ్యస్థితిలో నున్నవి. ఇప్పుడు మనము చేయవలసిన దేమి? విగ్రహారాధన మూఢవిశ్వాసముతోఁ గూడుకొన్న దనియుఁ బ్రస్తుతపు మతాచారధర్మములు ఎంతశీఘ్రముగ నిర్మూలింపఁబడిన నంత మంచిదనియు నెట్టిమతమును మన పాఠశాలలలో బోధింపఁబడకూడ దనియును వాదించువారికి ఈ విషయములతోఁ బనిలేదు. ప్రపంచములో నుండు నన్ని దేశముల నాగరకతకును అక్కడిమతములే ముఖ్యముగాఁ దోడ్పడిన వని నానాదేశచరిత్రలను చదివినవారికి బోధపడక మానదు. క్రైస్తవుల గుళ్లును, బౌద్ధుల విహారములును, హిందువుల కోవెలలును, తురకల మసీదులును, ఆయా మతస్థులు కూడి దైవప్రార్థనఁ జేసికొనుట కేర్పడిన వగుటచేత నీ యిరువదవశతాబ్దములోఁ గూడ, వీనిని మంచిస్థితిలో నుంచుటకు అన్ని జాతులవారును ప్రయత్నించుచున్నారు. ఈ సంస్థాపనలు, తమకు పవిత్రస్థలము లనియు నివి యెల్లపుడు పరిశుభ్రముగ నుండవలె ననియుఁ దమ దైవప్రార్థనకే గాక తమ పూర్వవిజ్ఞానమునకుఁ గూడ నివి ఆటపట్టులుగ నుండవలె ననియు, బహుజనాభిప్రాయము. కాఁబట్టి మన హిందువులు ప్రపంచములో నుండు నితరజాతులవారికంటె భిన్నాదర్శములు గలిగి ఆధ్యాత్మికవిషయములలో నెక్కువ కృషిఁ జేసి యుండి రనియు, సగుణనిర్గుణోపాసనల రెంటిని సమన్వయముఁ జేయగలిగి రనియు, పరమాత్మ విశ్వ మంతయు నిండియున్నది గనుక సగుణోపాసనను నిరసింపఁగూడ దనియు, మనలో ననేకుల యభిప్రాయము.

కాఁబట్టి, మన దేవాలయములను, ధర్మసత్రములు చెరువులు తోఁటలు మున్నగువానితోఁ బాటు పునరుద్ధారణఁ జేయుటయు వాని యాదాయము సరిగ వినియోగపడునట్లు చేయుటయు మనకు విధియై యున్నది. కొన్ని కోవెలలలో అప్పుడప్పుడు అమాంగల్యపుపనులు జరుగుచున్నవి గనుక రూపోపాసన పనికిరా దని వాదించుట న్యాయ్యము కాదు. మానవప్రతిష్ఠాపనలు పరిపూర్ణత వహించుట అసంభవము. కాని, అంతమాత్రముచేత, వానిని నిరసించి, నశింపఁ జేసి, జనసామాన్యములో నీతిమతాభివృద్ధిని భగవద్భక్తినిఁ గలిగించునట్టి వీళ్లను పోఁద్రోలుట బుద్ధిమంతుల లక్షణము కాదు. మనలో పెట్టవేదాంతులు, నాస్తికులు, చార్వాకులు, పాషండులు మొదలగువారు కొంద ఱున్నను మొత్తముమీఁద జనసామాన్యము, మతమును త్యజింపక విగ్రహారాధనను వదలక దానిని తమ మోక్షమునకు ఒక ముఖ్యసాధనముగ నుపయోగించుకొనుచున్నారు.

దేవాలయములను, ధర్మములను స్థాపించువారికిని జీర్ణము

లైన దేవాదాయములను పునరుద్ధారణఁ జేసినవారికిని పుణ్యగతులు కలుగు నని పూర్వపు శాసనములలో నీ క్రింది శ్లోకములు కనఁబడుచున్నవి.

(i) మద్వంశజాః పరమహీపతివంశజా వా
యే భూమిపా స్సతత ముజ్జ్వలధర్మచిత్తాః
మద్ధర్మ మేవ సతతం పరిపాలయంతు
తత్పాదుకాద్వయ మహం శిరసా వహామి.

(ii) స్వదత్తా ద్ద్విగుణం పుణ్యం పరదత్తానుపాలనమ్
పరదత్తాపహారేణ స్వదత్తం నిష్ఫలం భవేత్.

పై కారణములనుపట్టి ప్రతివారును, తమ గ్రామదేవాలయములలో నిత్యకైంకర్యము, ఉత్సవములు, యథావిధిగ జరుగునట్లును, కోవెల యెల్లప్పుడు నాంగ్లేయుల చర్చిలవలెనే మంచిస్థితిలో శుచిగా నుండునట్లును ప్రయత్నింపవలెను. శిఖరము, ధ్వజస్తంభము లేని కోవెల గల గ్రామములో మంచితీర్థముఁ గూడ పుచ్చుకొనఁగూడ దని మనవారు చెప్పుదురు. కోవెలలేని గ్రామము స్మశానవాటికయే. కాఁబట్టి ప్రతిగ్రామములో నున్న కోవెలకు నెల 1-కి రు. 15 లు జీతము మీఁద ఒక అర్చకుని యేర్పరచి, దాని యీనాముల మీఁద మిగిలిన అయివజును ఉత్సవములకును మరమ్మతులకును వినియోగింపవలెను. వీనికి కావలసిన కర్చులు పోఁగా ఇంకను మిగల్చగలిగిన అయివజును, మన ప్రచారణ సంబంధమైన విషయములకే కర్చుపడవలెను గాని ఇతర విషయములకు అవికూడ జనుల కెంతె యుపయోగకరములుగ నున్నను, వినియోగించకూడదు. దేవాలయముల ఈనాముల అయివజును, మామూలుగ నింగ్లీషుపాఠశాలలకు గాని, బీదజనుల యౌషధసేవలకు గాని మఱి యే యితర విషయములకు గాని, వినియోగించుటవలన, నీ దేవాలయస్థానముల నిర్మించిన మనవారి మూలాభిప్రాయములకే మోసము వచ్చును. మన హైందవవిజ్ఞానమునకును, ఆధ్యాత్మిక జ్ఞానమునకును, మన దేవాలయములే యునికిపట్టులై యున్నవి. బ్రాహ్మణులును, బ్రాహ్మణేతరులును, అట్టి జ్ఞానోపార్జనయందు సమానమైన ఆసక్తి కలవారే. ప్రపంచవిజ్ఞానమునకు మన హైందవులు చేర్చగల ధనము ఇది యొక్కటే గనుక, ఈ ధనమును వృద్ధిచేయుగల సాధనములలో దేని నైనను విడనాడకూడదు. ఉత్సవములును, మరమ్మతులును తగుమాత్రముగ జరిగించిన తరువాత, ప్రతి సంవత్సరము మిగులుచున్న అయివజును, సంస్కృతపాఠశాలలు పండితసత్కారము హరికథలు పురాణకాలక్షేపములు మొదలగు మతవ్యాపన విషయములందు కర్చుపెట్టవచ్చును. సంస్కృతపాఠశాలలలో వేదములు శాస్త్రములు కళలు మొదలగునవి గొప్ప పండితులచేత నేర్పించవచ్చును. జీవనోపాధికి అల్లాడుచున్న మన పండితులకు ఆధారమును కలిగించినవార మగుదుము. మన హైందవ విజ్ఞానమునకు నీ దేవాలయములే శరణ్యములు.

పైన వ్రాసిన విధానమును కొందఱు అర్చకులకు సమ్మతముగ నుండ దని నాకు తెలియును గాని, లా ప్రకారము వారికి చెందగూడని ఆస్తిని గ్రామస్థు లందఱికిని వినియోగపడునట్లు చేయవలసి యుండగా నీ యర్చకుల క్రోధప్రసాదములతో మనకు పనియేమి? వీరిలో ననేకులు, స్వామివారి యీనాములను తమ స్వంత ఆస్తిగా భావించుకొని వానిని తమలో విభజించుకొని ఇతరులకు బోగుబందీకవుళ్లు వ్రాసి ముందుగనే పెద్దమొత్తములు తీసికొని, అప్పులు చేసి వానిని తీర్చుటకు స్వామివారి ఈనాములను విక్రయించుచున్నారు. దేవాలయములు శిథిలములై పోవుచుండగా వీరు మిద్దెలు మేడలు కట్టుకొనుచున్నారు. ఇది యంతయు ప్రతిదినము కన్నులారఁ గనుకొనుచు, మన ముపేక్షించుట న్యాయ్యమేనా? అర్చకుల నోరుకొట్టుటకు ఎవరును ప్రయత్నింపలేరు. వారిలో ఒక్కొక్క కుటుంబమునకే జీవనము గలిగించగలము గాని, వారికుటుంబములు వృద్ధియగుచు వచ్చినకొలఁదిని, స్వామివారి యీనాముల అయివజు, వారితరతరములవారి జీవనమునకును శుభాశుభ కార్యములకును వినియోగించుచు వచ్చినయెడల నసలు దేవతాకార్యములకే నష్టము వాటిల్లుటయే గాక స్వామివారు తలఁ దాచుకొనుటకు కొంప యైన నుండుట తటస్థించదు. ఒక గ్రామములో దేవాలయపు గర్భగుడి మాత్రమే మిగిలి అదికూడ పోటీలతో నిలపఁబడి యుండుటచేత అర్చకుఁడు లోపలకుఁ బోవుటకు భయపడి బయట వీధిలోనుండియే దేవునికి నైవేద్యమును చేయుచున్నాడు. ఇతనికి మంచిలోగిలి యున్నది. సంవత్సరమునకు 15 పుట్లు ధాన్యము స్వామివారి యీనాములనుండి నికరాదాయముగా నేర్పడి స్వేచ్ఛగా ననుభవించుచున్నాడు. మఱియొక గ్రామములో, స్వామివారి నైవేద్యమును, పొరుగూరునుండి ఒకపసిపిల్లవానిచేతి కిచ్చి మధ్యాహ్నము పూట ఒక అర్చకుఁడు పంపుచున్నాడు. ఆ కాలములో తప్ప, ఆగుడి తలుపులు తెరువబడవు. ఈ అర్చకుఁడు ఈ రెండు గ్రామములలో స్వామివారికున్న యా 20 ల పల్లపుభూమిని యథేచ్ఛగ ననుభవించుచున్నాఁడు. ఇట్టి దృష్టాంతములు పెక్కు లున్నవి గాని, గ్రంథవిస్తరభీతిచేత వాని నిచ్చట నుదాహరింపలేను.

గ్రామస్థులు మొగమోటమిని వదలి తమ దేవాలయములకు శి. ప్రొ. కోడ్డు 92-వ సెక్షను ప్రకారము స్కీములను తయారుచేయించుకొన్న గాని, లేనియెడల స్వామివారి యీనాములు క్రమముగ నన్యాక్రాంతములై పోవుటకు నెట్టి సందేహము లేదు. ఈ కాలములో, దేశాభిమాన మను మాట మిక్కిలి చవుకయై అనేకమంది ప్లీడర్లు తెయితక్కలాడుచుందురే గాని ఇట్టి యుత్కృష్ట విషయములలోఁ దగు శ్రద్ధఁ దీసికొనుచుండుట లేదు. గ్రామస్థులు వీరిని యెంత బ్రతిమాలుకొన్నను, వీరు మొదట నుచితముగ సలహాల నొసఁగి కోర్టులలోఁ బనిచేయరు. ఒక దేవాలయమునకు సరియైన స్కీము నేర్పాటు చేయించినయెడల, ఆ స్వామివారే వీరికి కోర్టువారిచేత కొద్ది ఫీజు నిప్పించవచ్చును. లేదా తమ పుణ్యమునకు ఎట్టి కొఱఁతయు లేదు. గ్రామముయొక్క నీతిమతాభివృద్ధికి సహకారులగుదురు. ఒక్కొక్క ప్లీడరు, ఒక్కొక్క దేవాలయమునకు ధర్మకర్తగ కొంతకాలము పనిచేయవచ్చును. వీరును వర్తకులు మొదలగువారును, కలసి ధర్మరక్షక సభల నేర్పాటు చేసి కోర్టులకును, గ్రామస్థులకును సహకారులు కావచ్చును.

# బర్మాదేశపు స్త్రీలు

హెచ్. మహబూబ్ మియ్యాన్ గారు

ఆసియాఖండమము పురుషులకు భూతలస్వర్గ మనియు, నచటి స్త్రీలు తమ పురుషులకు బానిసలును నాటవస్తువులును నై యున్నారనియు నొక ప్రతీతి గలదు. ఈఖండములోని యన్ని దేశముల కీపేరు సార్థక మయినఁ గావచ్చును కాని బర్మాదేశమున కది యెంతమాత్రము నన్వయింపఁజాల దని నిస్సందేహముగాఁ జెప్పవచ్చును. బర్మాదేశములో నాఁడువారిచేయి పైనను మగవారిచేయి క్రింద నున్నది. ప్రతిస్థలమందును బ్రతిపనియందును స్త్రీలు ముందున్నారు. పురుషులు వారికి లోఁబడి వారిపై నాధారపడియున్నారు. ఇట్లుండుట యాదేశపు విపరీతాచారమే గాని యచటిపురుషులు తమ స్త్రీలకంటె శక్తిసామర్థ్యములందుఁ దక్కువ యని గాదు. అచటి స్త్రీ తనకుటుంబమునకు నిరంకుశాధికారిణి. తనభర్తను, కుటుంబమును నామె పోషించును. ప్రపంచమందలి యేదేశమును స్త్రీస్వాతంత్ర్యాధికతావిషయములో నీదేశమునకు సరిరాదు.

దేవాలయములకుఁ బ్రసిద్ధిఁ జెందిన యీదేశములో స్త్రీల స్వేచ్ఛావిహారవ్యవహారములు కన్నులారఁ జూచినఁ గాని చక్కఁగా బోధపడవు. దుకాణములలోను, గృహములలోను, దేవాలయములలోను, వీథులలోను, సంతలలోను, చిన్న అవికలను వయులుచేతులు గల బిఱ్ఱుచొక్కాలను ధరించి మిక్కిలి శుభ్రముగా నున్న స్త్రీలు క్రొత్తవారి నాకర్షించుచు ననంతముగఁ గనఁబడుచుందురు. మురికిగాఁ గాని, నవ్వుముఖము లేకగాని, సోమరిగాఁ గాని యున్న స్త్రీ వెదకినను నాదేశమునఁ గనఁబడ దని చెప్ప నగును.

వేలకొలఁది రూప్యముల వెలఁ జేయు రత్నములు, వజ్రము లమ్మఁబడు దుకాణములలోనికిఁ బోయి చూచిన నాదుకాణము స్త్రీదే యనియు, నచటి గుమస్తాలును, తదితర నౌకరులును స్త్రీలే యనియుఁ దెలిసికొని యాశ్చర్యపడుదువు. మార్కెట్టులో, ఫలములన్నియుఁ గలసి 15 రూప్యములైనను వెలఁ జేయని యొకచిన్న యంగడికిఁ బోయి చూచినను నాయంగడికూడ స్త్రీదే యని తెలిసికొందువు. నీ వేఫలములు గావలయు నన్నను నామె నీకుఁ జక్కని బేరముఁ జెప్పి మర్యాదపూర్వకముగ ఫలముల నిచ్చును.

దూరమునుండి నదిగట్టును జూచితి వేని యచట వివిధవర్ణముల వస్త్రములను ధరించి వేడుకలు సలుపుచున్న జనసమూహము నీకుఁ గోచర మగును. అది వనభోజనార్థ మేతెంచిన గుంపని నీ వనుకొనియెదవు కాబోలు; కాదు; నీ తలంపు తప్పు; వారు స్త్రీలు; తమ యిండ్లలోని సారను దెచ్చుకొని యాయేటిలో నుతుకుకొనుచు విలాసముగ మాటలాడుకొనుచుఁ బాడుకొనుచు నున్నారు; వారికిఁ బని యన్న విసుగు లేదు.

రైల్వేస్టేషనుకుఁ బోయిన నచట నీకు టిక్కెట్టు నమ్మునది స్త్రీ; పోర్టరుపనిఁ జేయునది స్త్రీ; కూలిపనిఁ జేయునది స్త్రీ; అన్ని పనుల జేయువారు స్త్రీలే. హోటలుల యధిపతులు, సేవకులు, తదితరు లందఱును స్త్రీలే. ఏసభలో నేవక్త ప్రసంగించుచున్నను వానికి దగ్గఱగా సంక్షిప్తలిపిలో వాని యుపన్యాసమును చటచట వ్రాసికొనుచుండునది స్త్రీయే. ఏఆఫీసులోఁ జూచినను టైప్‌రైటర్ మీఁద చకచక వ్రేళ్లాడించుచుండునది స్త్రీయే. ఇదియది యననేల? అన్నిచోట్ల నన్నిపనులను జేయునది స్త్రీయే!

ఈదేశములో స్వకాయకష్టముచే ధనికురాండ్రయిన స్త్రీలనేకులు గలరు. ఇటీవల రంగూన్ పట్టణములో దళాలివ్యాపారముఁ జేయుచుండిన యొకస్త్రీ మృతినొందెను. చనిపోవునప్పటి కామె యాస్తి యనేకలక్షలరూప్యము లుండినది. ఆధనమంతయు నామె స్వార్జితమే. ఇఁక చిల్లరవ్యాపారమంతయు స్త్రీలచేతులలోనే యున్న దని వేఱుగఁ జెప్పవలయునా? వాణిజ్యముఁ జేయు స్త్రీలందఱును, చదువు లెక్కలు నేర్చి తమకార్యము నతినైపుణ్యముతో నిర్వహింతురు. కొండలక్రింద నుండుటకు గ్రామవాసు లగు నాఁడువారు సహితము చదువరులై తమతమ చిన్నయంగళ్లలోఁ గూర్చుండి వ్యాపారముఁ జేయుచు, లెక్కలను వ్రాసికొనుచు నుండుట యొకవింతగా నగుపడును.

నీయొద్ద సేవకురాలుగ నుండి సర్వదా హాసితవదనయై యున్న స్త్రీ వివాహితయా? అవివాహితయా? అని తెలిసికొనుట యసాధ్యము. ఆంగ్లస్త్రీలపేర్లకువలె బర్మాదేశపుస్త్రీలపేర్లకు ముందు వివాహిత, అవివాహిత యనువిషయమును సూచించుపదము లుండవు. అట్టిపదములను వారిపేర్లకుఁ జేర్చుట వారి కవమానకర మట. కన్యలుగా నుండినను, ఇల్లాండ్రుగా నుండినను వారిని "మా" అని పిలువవలెను. నీ సేవకురాలికి బిడ్డ లున్నారని గ్రహించినఁ గాని యామెకు వివాహసౌఖ్య మున్న దని నీ వెఱుగఁ జాలవు.

కుటుంబములో భర్త తక్క తక్కిన స్త్రీ లందఱును గష్టించి ద్రవ్యార్జనఁ జేయువారే. భర్త తిని కాలు జేయి కదలింపకుండ సుఖముగాఁ బువ్వువలె నింటిలో నుండును. చలిఁ గాచుకొనుట, పొగత్రాగుట తక్క వాఁడింటిలో చేయుపని యేమియు లేదు. శుభ్రములై, సొగసుగా నున్న వస్త్రములును, జరీనగిషీపని చేసిన పట్టు ఉడుపులను, గన్నులపండువ అగు రంగుపాగా ధరించి గృహమున సుఖపడుచుండును. వానిభార్య, ఆఁడుబిడ్డలు లెక్కలు విఱచి బజారులలో సంపాదించుచుందురు. ఈదేశపుపురుషులు దమకు భార్యలసంఖ్య ఎంత యెక్కువగా నున్నఁ దమకంత యెక్కువ సిరి, సౌఖ్యము

లబ్బు నని తెలిసి యొక్కొక్కరు సాధారణముగా నిద్దరు ముగ్గురు భార్యలను వివాహ మాడుదురు. ఆభార్యలు దమభర్త ధనికుఁ డగు నొకపెద్దమనుష్యునివలె సుఖపడుటకై తమ శక్తికొలఁది పాటుపడి సంపాదించెదరు. ఇంటివ్యయములకుఁ గాక భర్తకతని స్వంతఖర్చులకుఁ గూడ ధన మిచ్చెదరు. అతఁడు తనయిష్టానుసారముగఁ దాను గోరినభార్యతో సర్వసుఖముల ననుభవించుచుండును.

ఈదేశములో వివాహమన సాధారణమైన యొకచిన్నపని. బంధుమిత్రులకు నొకపూట విందుఁజేయుట తక్క వీరివివాహములలో నేయుత్సవములును లేవు. తలిదండ్రులయనుమతితో జరిగిన వివాహ మొకపూట విందుతో సంతోషకరముగా ముగియును. తలిదండ్రుల యనుమతి లేనిచో వధూవరులు తమవారికిఁ దెలుపకయే యిండ్లు విడిచి పొరుగూరికిఁ బోదురు. అచట గురువు విధ్యుక్తముగా వారికి వివాహమును జేయును. పిమ్మట నొకయాచారముగా వారు సమీపమున నుండు నొకయడవికిఁ బోయి, యచట నొకటి, రెండు దినములుండి వరుని గృహమునకు మఱలివత్తురు. అపుడు వరుని తలిదండ్రులు, కొడుకునకు కోడలికి విందుఁ జేయుదురు. ఆవిందులో వధూవరు లిద్దఱు నొకే పాత్రలో భుజింతురు. అప్పుడు పెండ్లి ముగియును. అందఱు నానందభరితు లగుదురు.

ఈ దేశములో వివాహ మెంత సులభమో, దానివిచ్ఛేదనము గూడ నంత సులభమే. భార్యాభర్త లొకరి నొక రొల్లనిచోఁ దత్క్షణమే వారు వేఱుపడుదురు. ఎవరికి వివాహవిచ్ఛేదన మావశ్యకమో వారు వెంటనే యూరిపెద్దలయొద్దకుఁ బోయి, కారణములను జూపి తమపెండ్లిని రద్దుచేయుఁ డని కోరుదురు. ఆపెద్ద లాదంపతులకు రాజీచేయుటకుఁ దమశక్తికొలఁది ప్రయత్నింతురు. కాని, వా రిద్దఱొకరిపై నొకరు త్రాగుడు, అభిని, పొగత్రాగుట, దుర్వ్యయము, వ్యభిచారము మున్నగు నేరములలో దేనినైన రుజువుపఱచినయెడలఁ బెద్ద లావివాహమును రద్దుపఱతురు. అక్కడి కావివాహము తెగిపోయినది. పురుషుఁడు తన్నుఁ బోషించుటకు వేఱొకభార్యను వివాహ మాడును; స్త్రీ తనకు బిడ్డ లున్న వారిని బోషించుకొనుచుండును. ఈపని యామెకు మొదటినుండియు నున్నదే గాని క్రొత్తది గాదు. ఆమె తనబిడ్డలను విద్యాబుద్ధులు గఱపుచుఁ బెంచి పెద్దవారిఁ జేయును. ఆమెకు భర్త యున్నను లే కున్నను నొక్కటే. ఈ దేశములో వివాహవిచ్ఛేదన మింత సులభముగా నున్నను దానియాచరణము చాల యరుదు.

ఈ దేశపుస్త్రీలు మిగుల సౌందర్యవతులు; వారినేత్రములు విశాలములై నల్లనై, సొగసుగా నుండును; ముక్కు నొసలెత్తై గుండ్రముగా నుండును; శిరములండాకారము గలిగి యుండును. వారు శిరోమధ్యమున వెంట్రుకలను చుట్టవలె ముడివేయుదురు. వారిశరీరము సొగసైన పసుపువర్ణము గలిగియుండును. నవ్వినప్పుడు వారిముఖమునఁ జిన్నచిన్న ముడుతలు పడి వారి కొక వింత సౌందర్యమును తెచ్చిపెట్టును. శుభ్రముగను, సొగసుగను నుండుటకై వారు తమముఖముల నొకవిధమగు సుగంధచూర్ణముతోఁ గడుగుకొందురు; సొమ్ముల నెక్కువగా ధరింపరు. సాధారణముగా మెడలలో చక్కని హారములను ధరింతురు. ఏస్త్రీగాని నలువదియేండ్లవయస్సునకుఁ బిదప నగలను ధరింపదు. ఏసొగసును నామె చేసికోఁ గూడదు.

ఈ దేశమునఁ గ్రొత్తగాఁ జేరిన యితరదేశస్థు లీదేశపు సుందరయువతులను మోహించి వివాహ మాడుట సహజము. వివాహితులై యున్న యూరోపియనులు గూడ ననేకులు వీరి నుంపుడుకత్తెలుగా నుంచుకొందురు. ఈ దేశపు బాలిక లమాయికురాండ్రు, మోస మెఱుగరు, క్రొత్తవారిని సులభముగ నమ్మెదురు.

ఈ దేశములో స్త్రీవిద్య బాగుగ వ్యాపించినది. అనేకసంవత్సరములనుండి రంగూను కళాశాలాధికారులును, ఇతరపాఠశాలాధికారులును స్త్రీవిద్యాభివృద్ధికై విశేషకృషి సలుపుచున్నారు. బాలికలును దమ కాలమును వ్యర్థపుచ్చక విద్యాభివృద్ధి నొందుచున్నారు; గానము, నాట్యము, మొదలగు కళలను శ్రద్ధతో నభ్యసించుచున్నారు.

ఈదేశపుస్త్రీ లెంతటికష్ట మయినను సహింపఁగలవారు. వారికి ఉత్సాహము మెండు. వారు సదా సంతోషస్వభావులు. బీదలు ధనికు లనుభేదము లేక ప్రతిపనియందును వా రొకరితో నొకరు స్నేహభావముతోఁ గలిసి మెలసి వర్తింతురు. ఆటలు, సంగీతసభలు, మున్నగు నన్నిపనులలోను స్త్రీపురుషులు స్వేచ్ఛను గలిగియుందురు అయిన నీదేశస్త్రీలు సదాచారసంపన్నలే గాని నీతిబాహ్యలని చెప్పఁజాలము. ఈదేశస్థులు బౌద్ధమతావలంబకులు.

మ. విడువన్ జాలెను తండ్రికై సకలపృథ్వీనాయకత్వంబుఁ, దా
విడువన్ జాలెను పెండ్లి సోదరులకై, వీరాంకశయ్యాస్థలిన్
విడువన్ జాలెను మేను మన్మలకు, నవ్వీరవ్రతుం డద్దిరా!
విడువన్ జాలఁడు భారతీయులమదిన్ భీష్ముండు వేలేండ్లకున్.

—బాలకవి కసిరెడ్డి వేంకటసుబ్బారెడ్డి గారు.

Lokamanya B. G. Tilak.



లోకమాన్య బాలగంగాధర తిలకు గారు.

Mr. N. C Kelkar.



నృసింహ చింతామణి కేల్కారుగారు.

Mr Mahamad Ali Jinnah.



మహమదాలీ జిన్నాగారు.

Mr. S. Satya Moorthy.



ఎస్. సత్యమూర్తిగారు.

Mrs. Annie Besant.



శ్రీమతి అనిబెసంటమ్మగారు.

Hon'ble C. Y. Chintamani.



ఆనరబిలు చిర్రావూరి యజ్ఞదత్త చింతామణిగారు.

Hon'ble V. J. Patel.



ఆనరబిలు వి. జె. పటేలుగారు.

Mr. P. G. Horniman.



బి. జీ. హార్నిమానుగారు.

Mr. V. P, Madhava Rao.



వి. పి. మాధవరావుగారు.

Hon'ble M. Ramachandra Rao.



ఆనరబిలు మోచర్ల రామచంద్రరావు పంతులుగారు.

Lala Lajpat Rai.



లాలా లజపతిరాయిగారు.

Rai Bahadar K. V. Reddi Naidu.



రాయబహదరు కూర్మా వెంకటరెడ్డినాయుడుగారు.

Mr. B. P. Wadia.



బి. పి. వాడియాగారు.

Mr. C. R. Das.



చిత్తరంజనదాసుగారు.

Prince Dorai Rajah of Pudukottah.



దొరై రాజాగారు, పుదుకోట.

Dr. T. M. Nair M. D.



డాక్టరు టి. మాధవనాయరుగారు.

Hon'ble Yakub Hussain Saheb.



యాకూబు హుస్సేనుగారు.

# చెత్తయొక్క చిత్రము

## ప్రత్తికాడలనుండి కాగితములు చేయుట

తేకుమళ్ల వెంకాజీ గారు

యుద్ధమువలనఁ జాల నష్టము కలిగిన దని యెల్లరకును దెలిసిన విషయమే. అయినను కష్టములో సుఖముండు నను నార్యోక్తి ననుసరించి యీ ఘోరసంగ్రామమువలన ప్రపంచ మంతయు ముఖ్యముగ హిందూదేశము గొప్ప నీతులు నేర్చుకొనవలసియున్నది. ప్రథమమునుండియు మన దేశమందు పరిశ్రమాభివృద్ధి లేక మన పూర్వులయొక్క కీర్తి నానాఁటికి క్షీణించుచున్నది. ప్రస్తుతము మన దేశమందు మన దేశీయులచే నడుపఁబడుచున్న కర్మాగార మొక్కటియుఁ గానరాకున్నది. మన మనుదినము నుపయోగించు కాగితముల ధర హెచ్చినది. సాధారణులు కొనుట కసాధ్య మయినది. హిందూదేశమందు తయారగుచున్న కాగితములు మన కవసర మగు వానిలోఁ బదియవ వంతయిన సరిపోవుట లేదు. కాగితములు ప్రథమమునఁ దయారుచేయుటకు ప్రాఁతగుడ్డ పేలిక లుపయోగపడుచుండెడివి. తరువాత వెదురులోనుండి తయారు చేయఁబడుచుండెడివి. కాగితములఁ దయారుచేయుటకు వలయు పరికరములను కొన్నియంత్రముల సాహాయ్యమువలన 'గిజురు' (Pulp) గనుండు నొకపదార్థము తయారుచేయఁబడును. ఈపదార్థమును తయారుచేయు యంత్రములు హిందూదేశమున లేవు. ఈ 'గిజురు'ను తయారుచేయుటకు వలయు వస్తువులను హిందూదేశమునుండి యెగుమతిఁ జేయుచున్నారు. ఈ'గిజురు' తయారుచేయఁబడి హిందూదేశమునకుఁ బంపబడుచున్నది. తన్మూలమునఁ గాగితములను తయారుచేయుచున్నారు. ఈ రాకపోకల కగు వ్యయమువలన కాగితముల ధర హెచ్చినది. యుద్ధమువలన నీ గిజురు ప్రస్తుతము వచ్చుటయే లేదు. అందువలన కాగితముల ధర మఱింత హెచ్చయినది.

ఈకారణములఁ బట్టి కాగితములను ఎవరిదేశములో వారే తయారు చేసికొనవలసిన అగత్యము కాన్పించినది. పైవిధానము ప్రకారము కాగితములను మనము తయారుచేసిన నితరదేశములందుఁ దయారు అగు కాగితముల ధరకంటె మన కాగితములధర హెచ్చుగ నుండును. విదేశవస్తువుల పోటీ (Foreign Competition) తో స్వదేశవస్తువులు నిలువఁజాల వని మన మందఱము ననుభవమున నేర్చిన విషయమే. మన దేశమందు తయారగు కాగితములవిలువ ఇతరదేశములనుండి దిగుమతి యగుచున్న కాగితముల విలువతోఁ బోల్చి చూచిన మనదేశమందు కాగితములను తయారుఁజేయుట ఎంత యత్యావశ్యకమో యీ క్రింది పట్టికవలన విశద మగును.

| సం॥ము | హిందూదేశమందుఁ దయారు చేయఁబడుచున్న కాగితముల విలువ | దిగుమతి కాఁబడిన కాగితముల విలువ |
|---|---|---|
| 1908 | 75,87,270 | 9,4[illegible]5,025 |
| 1909 | 7,911,945 | 10,002,525 |
| 1910 | 8,151,540 | 11,005,880 |
| 1911 | 8,004,480 | 11,611,920 |
| 1912 | 1,106,040 | 18,588,400 |

విదేశమునుండి దిగుమతి చేయఁబడిన అట్టలు, కాగితముల యొక్క విలువ యీ క్రిందిపట్టీవలన తెలియును.

| నంబరు | దేశముల పేరులు | 1913 మార్చి 31 తో అంతమగు సం॥ము | 1916 మార్చి 31 తో అంతమగు సం॥ము |
|---|---|---|---|
| 1 | అమెరికా | 8,399,760 | 8,826,935 |
| 2 | జర్మనీ | 2,466,405 | 1,734,440 |
| 3 | ఆస్ట్రియా | 1,047,185 | 573,210 |
| 4 | నార్వే | 523,395 | 608,785 |
| 5 | బెల్జియము | 573,420 | 543,075 |
| 6 | స్వీడను | 476,340 | 508,785 |
| 7 | హాలండు | 541,095 | 619,560 |
| 8 | ఇతరదేశముల | | |
| | మొత్తము | 541,095 | 619,560 |

1913-14 సంవత్సరములందు హిందూదేశమునకు విదేశముల నుండి 'దిగుమతిచేయఁబడిన' మ్రానుగిజురు (Wood pulp) యొక్క విలువ.

| | | |
|---|---|---|
| 1 | అమెరికాయొక్క సంయుక్త రాష్ట్రములు | 663,491 |
| 2 | ఆస్ట్రియా హంగేరి | 367,515 |
| 3 | స్వీడను | 309,540 |
| 4 | జర్మనీ | 303,705 |

ఈ గిజురు (Pulp) నుండి కాగితములను తయారుఁజేయుటకు చాలభాగము రాసాయనికపదార్థములు (Chemicals) సోడియ మిశ్రద్రవ్యములు (Soda Compounds) విరంజనచూర్ణము

(Bleaching Powder) పింగాణిమన్ను (China Clay) మొద లగునవి యెన్నియో కావలసియున్నవి. ఇవి యన్నియు ఇంగ్లాండు నుండి మనదేశమునకు దిగుమతి యగుచున్నవి.

ఈ గిజురులేనిదే కాగితములను చేయలేము. సమస్తపదార్థ ములకు స్థానమైన హిందూదేశము ఈ గిజురును తయారు చేసికొన లేక, ఇతరదేశములపై నిందుల కాధారపడియుండుట యెంత శోచ నీయము? పూర్వకాలమందు కాగితములఁ జేయుట కవసర మగు గిజురుకొఱకు బట్టపేలికలు జనపనార (Jute hemp) ప్రాంత త్రాళ్లు చిత్తుకాగితములు మొదలగువాని నుపయోగించుచుండెడివారు. కాని ప్రస్తుతము గవర్నమెంటు ఫారెస్టుశాఖవారు వెదుళ్లనుండియు, సవనాగడ్డినుండియు, బైబు లేక సబై (Baib or Sabai) గడ్డి నుండియు, హిమాలయపర్వతములం దుండు, దేవదారువృక్షముల నుండియు, ఈ గిజురును (Pulp) తయారుచేయుటకు పెక్కు ప్రయోగములను (Experiments) జేయుచున్నారు. 'సిండలు' (Sindall, F. C. S.) 'రైల్టు' (Railt a cellulose expert) 'పియర్సను' (Pearson, Forest economist) మొదలగు గొప్ప శాస్త్రవేత్తలచే నీ ప్రయోగములు కావింపఁబడినవి. ఈ గిజురును తయారు చేయుటకు మన దేశములో 18 రకముల గడ్డి కల దనియు, అందు మొదటి రకపు జిగురుఁ జేయుటకు, విడిగఁ గాని, కలిపి గాని, 8 రకముల గడ్డి కల దనియు రైల్టుదొర గారు వ్రాయు చున్నారు. ప్రపంచమం దంతటను చవుకగఁ దయారుఁ జేయుటకు సులువుగ నీ గడ్డి తయారు చేయఁబడును. ఈ గడ్డి అపరిమిత ముగ మన దేశమందు దొరకును. మితవ్యయ మయిన లేకుండ నది పైని తెప్పించుటకును, అపారముగ నీ గిజురుఁ దయారు చేయఁగలుగు టకును గావలసిన వెదుళ్లు బర్మాలోఁ గలవు. ఇవి యన్నియు లాభ కరము లనియు, వీని ప్రయోగములు జయమును గాంచిన వనియును నిర్ధారణ చేయఁబడుటవలన, వీని వ్యాపారముఁ జేయుటకు సమయ మాసన్న మయినది.

ప్రత్తికాడల యుపయోగము :—మధ్యపరగణాల యధి కారివర్గమువారు గొప్ప ప్రయోగములవలన ఈ పైని వివరింపఁబడిన పదార్థముఁ గనిపెట్టి కీర్తివంతు లయిరి. ఒక సంవత్సరము క్రితము విదేశ పత్రికలలో నీ గొప్ప పరిశోధనఁ గూర్చి చర్చ జరగినది. బెర్లిను రసాయనశాస్త్రజ్ఞుఁ డొకఁడు తయారుచేయఁగలిగె నఁట. ప్రత్తి పంట సమృద్ధిగ నుండు నీ హిందూదేశమువా రీ ప్రయోగపు (Experiment) లాభములఁ బొందుటకు మంచి తరుణ మిది. ఈ తరుణమును హిందువులకు ప్రసాదించిన శాస్త్రవేత్తలైన లెప్టువిచ్చి షైమెన్ గార్లు వందనీయులు. వీరి కీ పరిశ్రమాభివృద్ధియం దమిత ప్రేమ. వీరు మధ్యపరగణాలలో పారిశ్రామిక వ్యావసాయిక డైరక్టర్లు వీరికి యొలిచ్చి వాస్తవ్యు లయిన రావుసాహేబు జి. యన్. సహస్ర బుద్ధి గారు కొన్ని ప్రత్తికాడలను మచ్చు పంపిరి. నాగపూరులో నున్న రసశాల (Laboratory)లో నీ కాడలను ప్రయోగముఁ జేసి ఇందువలన చాల లాభము కల దని స్థిరపఱిచిరి.

నాగపూరు వ్యవసాయరసాయనశాస్త్రజ్ఞుఁడు వ్రాసిన రిపోర్టు నందలి ముఖ్యాంశము లిందు పొందుపరుపఁబడినవి. వాని పరిశీలనవలన లాభ ముండక పోదు.

కొన్ని సంవత్సరములనుండి ముఖ్యముగా నమెరికాలో ప్రత్తి కాడలనుండి కాగితములను తయారుఁజేయుటకు చర్చ జరిగెను. ప్రత్తి కాడలను పృథక్కరణము (Analysis) చేయఁగా నూటికి 42.4 వంతు సెల్యూలోజ్ (Cettulare) అను పదార్థమును 10.3 వంతు నీరును, 5.8 వంతు ద్రవపదార్థమును గల వని స్థిరపఱచిరి క్రాస్‌యందు బీవన్సు (Cross Bevans) పద్ధతిప్రకారము ఈ సెల్యూలోజును పరీక్ష జేయగా పరిశుభ్రమయిన తెల్లనిపదార్థముగా నుండె నని స్థిరపఱచిరి.

కాగితమును గిజురుఁ జేయు మార్గము:—ప్రత్తికాడలు అంగుళము పొడవుగల ముక్కలుగా కొట్టఁబడును. తరువాత రస శాలలో (Laboratory) దీనికొఱకై నిర్మింపఁబడిన యొకయంత్ర ము (Antoclave) లో వాయుభారము (at a Pressure of atmosphere) వలన 145 డిగ్రీలయొద్ద (at 145 Oc) మధ్య క్షారము (Caustic alkali) తో 5 ఘంటలవఱకు నానఁబడును. బాగుగ కడిగిన తరువాత నీ కాడలు విరంజనచూర్ణముతోఁ గలుప బడును. అప్పుడు సోడియగిజురు (Soda pulp) తయారగును. దీని నుండి కాగితములఁ జేయుటకుఁ గావలసిన గిజురు కొన్నియంత్రముల వలన తయారుచేయఁబడును. ఒకమాదిరి కాగితములు తయారుచేయఁబడి నవి. పరిశుభ్రపఱచు యంత్రములు లేకపోవుటచే నొక విధమయిన ముదుకకాగితములు తయారైనవి.

హాలండు దొరగారు మధ్యపరగణాలకుఁ బోయినప్పుడు లెప్టు విచ్చిగారు వీరితో నిట్లు నుడివిరి:

'పలువిధము లయిన దుబ్బుగడ్డులతోఁ గాగితపు గిజురును తయారుచేయుటకు యోచనలు జరగుచునున్నవి. ఈ లోపున షైమెన్ దొరగారు పచ్చిప్రత్తికాడల నుండియు జనపకాడలనుండియు నితరను లగు మొలకల నుండియు నీ పరిశ్రమను అభివృద్ధిఁ జేయు టకు కలకత్తా డైరక్టరుగారితోను తదితరులతోను ఉత్తరప్రత్యుత్త రములను జరుపుచున్నారు. ఫారెస్టుశాఖవారు ఇందుకు వలయు గడ్డి ఎంత దొరకునో కనుగొనుటకు ప్రయత్నములను జేయుచున్నారు

చింద్వారా (Chindwara) రాతిబొగ్గు గనులకుఁ జెందిన రయిలు దగ్గఱగనే, కాగితపు గిజురున కుపయోగపడు గడ్డిపొలములు చాల గలవు. అచ్చట నొక ఫాక్టరీ నిర్మించుటకు చాల సులువుగ నుండును. వలయు పరికరములు సులభముగ దొరకును. వృక్షశాస్త్ర జ్ఞుఁడు ఈ గడ్డిని పరీక్షఁ జేయుచున్నారు."

ఈ పరిశోధనవలన ప్రత్తికాడలనుండి కాగితములను తయారు చేయుటవలన, ధనికులు తమ ధనమును వెచ్చించి వ్యాపారమును జేయుటకు తగిన తరుణము దొరకినది. విద్యావంతులును ధనికులును ఈ కార్యమును బూని ఇతరదేశీయులు ఈ ధనమును భోగుచేసి

కొనకుండ దేశమందు స్వదేశపరిశ్రమల నభివృద్ధిఁజేసి, మన దేశమును ధనవంతముగఁ జేయవలెను.

ఈ విషయమందలి యమెరికా యనుభవము:— విదేశములందు ముఖ్యముగా నమెరికాయందు ప్రత్తికాడలనుండి కాగితము గిజురు తయారుచేయఁబడెను.

| ఉపయోగపడు పదార్థము పేరు | సాగుబడి చేయబడిన భూమి యెకరములు | సాలుకు ఎకరము కొకదానికి పండిన కాడలు టన్నులలో | మొత్తముగ సాలు కొకదానికి పండిన కాడల టన్నులలో | ఎంతకాడలకు ఒక టన్ను గిజురు తయారగును | సాలుకు ఎకరమునకు తయారగు గిజురు టన్నులలో | మొత్తముగ సాలుకు తయారగు గిజురు టన్నులలో |
|---|---|---|---|---|---|---|
| | 1 | 2 | 3 | 4 | 5 | 6 |
| ప్రత్తి కాడలు | 10,000,000 | 0.45 | 4500000 | 3 .40 | 0.15 | 1,500,000 |

అమెరికా దేశీయు డొకఁడిట్లు వ్రాయుచున్నాఁడు :— గత వత్సరము కాగితపు ఫేక్టరీలకు యీరపు దేశమువారు 1500,00,000 పౌనుల ప్రాను గిజురు నమ్మినారు. ఈ వత్సరము ఈ సదుపాయ ముండు ననిన నమ్మకము లేదు. దినదినము నీ గిజురుఁ దయారుచేయు కఱ్ఱయొక్క విలువ హెచ్చుచున్నది. ఈ ప్రకార ముండిన 20 సంవత్సరములలో ఎంత జాగ్రత్తి పడినను గిజురుఁ దయారు చేయుటకు కర్ర మొక్కన కాన్పింప దని అమెరికా శాస్త్రవేత్తలు నుడివినారు. ఇతరపరిశ్రమల కుపయోగింపగ మిగిలిన యనవసరపదార్థములు (Waste Products) వేలకొలఁది టన్నులను మనము పాడుచేయు చున్నాము. ఈ చెత్తను కాగితపు యంత్రముల ద్వారా ధనముగ మార్పవచ్చును. వ్యవసాయశాఖవారు ప్రత్తి కాడల నుండియు వరికాడల నుండియు పరిశుభ్రము లైన కాగితములను తయారు చేయుచున్నారు. ఆ కాగితములనే అచ్చునకు కూడ నుపయోగించుచున్నారు.

కావున నో దేశీయులారా! ఈ పరిశ్రమయొక్క లాభములను చక్కఁగ పర్యాలోచనఁ జేసి ధనికులు ధనమును వెచ్చించి విద్యావంతులు ఈ పరిశ్రమను గూర్చి చక్కఁగ నేర్చికొని కాగితములను తయారు చేయు యంత్రములను స్థాపించి ప్రస్తుతము మనల నాపాదించి యున్న కాగితముల క్షామమును పాఱద్రోలెదరు గాక, యశోవంతు లై స్వదేశపరిశ్రమలను నెలకొల్పి దేశమునకు దిగంత విశ్రాంత మైన గీర్తిని సేకరించి మన దేశమాతను పూర్వౌన్నత్యమునకు తెచ్చి ప్రపంచక మందు నాగరకదేశములలో నొకదానిగ గణింపబడఁ జేసెదరు గాక!

ఆంధ్రు లేల నీ మహత్కార్యమును పూనఁగూడదు?

మనలో లక్ష్మీపుత్రులు చాలమంది కలరు. కాగితముల పరిశ్రమను విదేశముల కేగి నేర్చికొనినవారు గూడ గలరు. ప్రత్తియా మన దేశమందు మెండుగనే పండును. కావున కార్యశూరత్వమునకును దాతృత్వమును జూపుటకును సమయ మేతెంచినది. "అలస్యా దమృతం విషం" అను నార్యోక్తి ననుసరించి కాలయాపనఁ జేయక ఆంధ్రులు కార్యశూరులే యని ఘంటాపథముగ చాటి నాయకులు వెనుదీయక ముం దంజ వేయుదురు గాక!

చ. ఆరంభింపరు నీచమానవులు విఘ్నాయాససంత్రస్తులై
ఆరంభించి పరిత్యజింతు రురువిఘ్నాయత్తులై మధ్యముల్
ధీరుల్ విఘ్నవిహన్యమాను లగుచున్ ధృత్యున్నతోత్సాహులై
ప్రారబ్ధార్థము లుజ్జగింపరు సుమీ ప్రజ్ఞానిధుల్ గావునన్.

# బ్రహ్మచారిణు లగు వితంతువులు

శ్రీమతి కిళాంబి వేంకటవరదాచార్యులు గారు

వితంతువులలో నెట్టి దుర్బుద్ధులును లేక సంతతమును బ్రహ్మచర్యమును బూని దైవభక్తి గలిగి యోగ్యమైన నడవడి గల వారికి బ్రహ్మచారిణీ వితంతువు లని పేరు. వీరు తమ సుగుణసంపత్తి వలన నెల్లరచే గొనియాడఁబడుచుండుటం బట్టి స్త్రీసామాన్యములో వీరి నగ్రగణ్యులుగ మనము భావింపుచుందుము. వీరి హృదయము లొకప్పుడును దుష్కృత్యములందు చొరక తీర్థయాత్రలందును దేవతాదర్శనములందును బుణ్యనదీస్నానములందును బుణ్యకథాశ్రవణమునందును ఆసక్తములై యుండును. వీరు నీతిమతు లగుటను వీరి చరిత్రములు పవిత్రములై జగజ్జేగీయమానము లగుచున్నవి. లోకుల గుణావగుణముల నెంచుపని యుండదు. స్వప్నమందును నాత్మస్తుతియు బరనిందయును వీరికి కష్టవిషయములు. వీరితో స్నేహముఁ జేయు స్త్రీలును నీతిమతులై యోగ్యమగు ప్రవర్తన గలవారగుచుందురు. తమ తల్లితండ్రు లొనరించిన యతిబాల్యవివాహములవలన పిన్నవయసుననే భర్తలను గోల్పోయి యుక్తవయస్కలయ్యును సంసారదూరలై యిట్టి దురవస్థ తమకు సంప్రాప్తమయినందులకే తమ ప్రారబ్ధమట్లు చేసె నని లోలోనఁ గుళ్లుచు విరక్తిం బూనిన ఈ యనాథయువతులను మనవారు నిర్దయులై వంటలక్కలఁగా జేసి యెల్లప్పుడును జాకిరిఁ జేయించుచుండుటయును మగఁడు చచ్చినంత మాత్రమున జ్ఞాతు లిచ్చు భరణమునకు మాత్రమే యర్హురాండ్రై పొట్ట గడువకున్నను మర్యాదకై యొరులయిండ్ల జాకిరి జేసికొని కాలమును గడపుకొనుచుండుటయు మన మనేకచోటులఁ జూచుచున్నాము. ఇట్టి పవిత్రగుణ లగు నీ బ్రహ్మచారిణీ వితంతువులను సాదరపూర్వకముగ నాదరించుటకు బదులు వీరిని దాసికన్నఁ దక్కువగాఁ జూచుచు వీరిచే నింటి జాకిరి నంతయుఁ జేయించుచు, పనిలో నేలోపము వచ్చినను నలుగురు చీవాట్లు బెట్టి యవమానపరచుటయు గేవలమును న్యాయమైనపని గాదు. వీరిలో బెక్కుమంది విద్యాగంధ మెఱుంగనివారై యున్నారు. ఇట్టినీతివతులు విద్యావతులుగఁ గూడ నేర్పడినచో బంగారు పరిమళించినవిధంబున మిగుల నతిశయిల్లును. ఇట్టి వీరికి వీరి తల్లిదండ్రులు లేక సోదరులు శ్రద్ధను బూని తగినంత సామాన్యవిద్యను నేర్పుటయే గాక పిమ్మట జనానాయున్నతపాఠశాలలకు బంపి యున్నతవిద్య నేర్పించుటవలన చాల ప్రయోజనము గలదు. వీరికి ముఖ్యముగ కర్మశాస్త్రము ప్రకృతిశాస్త్రము వైద్యశాస్త్రము నేర్పుటవలన దేశమునకు చాల క్షేమము గలుగును. పవిత్రచరిత్ర లగు నీ బ్రహ్మచారిణీవితంతువులు విద్యాధికలై బాలికాపాఠశాలలలో నుపాధ్యాయులుగ నుండి రేని వారియొద్ద విద్యాభ్యాస మొనరించు మనబాలికలు చిన్ననాటనుండియు వారివలన ననేకనీతిమార్గముల నేర్చుకొని మంచినడత గలవారు కాఁగలరు. మఱియు వీరికి మంత్రసానికృత్యములను సంపూర్ణముగ నేర్పవలయును. మంత్రసాని పని కడు నీచ మని మనవారు అనుకొనవచ్చును. అది కేవలము తప్పైన యభిప్రాయము. స్వోదరపోషణమే ప్రధానముగ నెంచి రాజకీయ వైద్యశాలలయందు బనిసేయు మంత్రసానులు స్వార్థపరలై బీదసాదల కష్టసుఖంబుల నెఱుంగక తమపని కలిగినప్పుడెల్ల విశేష ధనమును గోరుచు నది యివ్వజాలనివారియెడ నుపేక్షాభావమును జూపుచు నిట్లు ప్రజాబాధకలై పరోపకారిణులు గాక యున్నారు. ఈవిద్యను నేర్చిన యువతీమణులు పాశ్చాత్యులలోఁ జాల గౌరవింపఁబడుదురు. ఇది పరోపకారమైన మహద్విద్య గాని నీచమైన విద్య గాదు. ఇట్టి విద్యను నేర్చిన పరుల నాశ్రయించి వారి యనుగ్రహమునొంద వారి పంచలఁ బడికాపులు పడియుండుటకంటె మనలోనే కొందఱు స్త్రీలకు నీవిద్యను నేర్పించినచో నట్టి తహతహలు బొంద నక్కఱ యుండదు. సామాన్యముగ స్త్రీలు తమకు గల కుసుమజాడ్యము ముట్టుకట్టునొప్పి మొదలగు రోగములను బురుషవైద్యులతో జెప్పుటకును వారితో సంభాషించుటకును సిగ్గుపడి వానిని దాఁచియుంచెదరు. అట్టిరోగములను నిరీక్షించుటకును కొన్ని సంగతుల నడుగుటకునుఁ గూడ బురుషవైద్యులకును వీ లుండదు. అందువలన బైనచెప్పినరోగములు క్రమంబుగా గోరంతలు కొండంతలైన వెనుక వెల్లడించినను వైద్యుల కసాధ్యము లగుచున్నవి. అపు డున్నత విదేశస్త్రీవైద్యశాలల కరిగి యట వ్యయప్రయాసల నొందియును కొన్ని రోగములు కుదిరియు గొన్ని కుదురకయు గొంద ఱావైద్యశాలలోనే మృతినొందియు నిట్లు కష్టములపాలు కావలసి వచ్చుచున్నది అయినను ధనాధిక లగుకొందఱకు మాత్రమే యట్లున్నతస్త్రీవైద్యశాలల కరుగుట సాధ్యము గాని సామాన్యుల కసాధ్యమే గదా! స్వదేశస్త్రీలకు స్వదేశస్త్రీలే వైద్యముఁ జేయునెడల నట్టికొరంత లెల్లను దీరును. మనస్త్రీ లున్నతవిద్య నభ్యసించి యున్నత వైద్యశాస్త్రజ్ఞలై యుండి రేని మనకును, మనదేశమునకును, విశేషలాభక్షేమములు కలుగు ననుటకు సందియము లేదు. ఇట్లు సేయుటవలన నిరుపేదలును, నిర్మలహృదయులు నగు పెక్కుమంది యనాథస్త్రీలు విదుషీమణులై బహువిధ జీవనోపాధులను గలిగియుండుటయే గాక దేశక్షేమమునకు తోడ్పడువారై యుందురు. కావున ధనాఢ్యులగు హిందూసోదరులారా! మీమీధనములను మీ రేయుప యోగించుకొని కేవలము స్వార్థపరులై మెలంగక దేశోపకారకములగు కార్యములందును నుపయోగించుటకై పూనుకొని యీయుద్యమమునందు మంచిపట్టుదల గలిగి పనిచేసి యొక్కొక్కమండలమున కొక్కొక్క యున్నతస్త్రీలపాఠశాల నేర్పరచి యందు స్త్రీల కున్నతవిద్యలను (ననగా ప్రకృతిశాస్త్రములు, వివిధకర్మవిద్యలు ఉన్నతవైద్యవిద్యలను) నేర్పించి నిరుపేద లగువిద్యార్థినులకు భోజనవసతులను గూడ గల్పించి యిట్టిమహోపకారమువలన మనదేశమును నున్నతస్థితికిం దెచ్చి శాశ్వత కీర్తిఁ బడయుదురుగాత.

# ఉత్తరగోగ్రహణము

రాయసము వేంకటశివుఁడు గారు, ఎమ్.ఏ., ఎల్.టీ.

ఆధ్యాత్మికవిషయములను లోకవ్యవహారములను ఉపమానముల మూలమున సమానసౌలభ్యముతో విస్పష్టముగ బోధింపఁగల గ్రంథములలో భారతము ముఖ్యము. అందలి యుత్తర గోగ్రహణకథ యందఱికిని దెలిసియె యున్నది.

ఈ యుత్తరగోగ్రహణకథనుండి మనము గ్రహింపఁగల సత్యములును సంగతులును గొన్ని కలవు. శూరాగ్రేసరుఁ డయ్యును అర్జునుఁ డపుడు మిక్కిలి హీనదశయం దుండెను. తన బాహుపరాక్రమము శత్రువులకుఁ దెల్ల మగునట్లుగ రణరంగమున యుద్ధము చేయవలసినవాఁడు కాలవైపరీత్యమునఁ బట్టి పేడి యై యంతఃపుర కాంతల కాటపాటలు నేర్పవలసివచ్చెను. మత్స్యపురిని గష్టసమయమున రక్షింపవలయు నని పూనిన యతనికి సాయము చేయుట కైన నెవరును లేరైరి. మీఁదుమిక్కిలి భీరు వగు నొకనికిఁ దానే సారథి యగుట సంభవించెను. తుదకు యుద్ధరంగమునఁ దాను సహజరూపముతో నైనను బోరునట్టి భాగ్య మతనికి లేదయ్యెను. అట్లు చేసినచో సమయభంగ మగు నని యతని భయము కాని, నిజమగు శూరత్వము గలవాఁ డెపుడును స్థితిగతుల ననుసరించి మెలఁగవలసినను వానికి దాస్యము మాత్రము చేయనొల్లఁడు. తా నొకరికి సారథ్యము చేయవలసివచ్చినను తన కింకొకరు సారథి యైనను అతని కొకటియే. విజయమును జేకూర్పఁగలది పౌరుషమె కాని బాహ్యవేషము నాడంబరమును గావు. గడ్డము మీసములు దుస్తులు పౌరుషమున కమోఘమైన చిహ్నములు గావు తుదకు కీర్తిగౌరవములును ప్రధానములు గావు. ఎట్టి స్థితిగతులందును విధికార్యనిర్వహణమె యుత్తమునికిఁ గర్తవ్యము.

అజ్ఞాతవాససమయ మర్జునునికి మిక్కిలి నీచ మగు దశయైనను అదియె యతని యుత్కృష్టస్థితికి దాఁపున నుండి దానికిఁ గారణభూత మయ్యెను. అంతకుఁ బూర్వమునఁ గాని పిమ్మటఁ గాని యతఁ డొకఁడే యింతమందితోఁ బోరి యొక్కుమ్మడిగ వారలఁ బరాజితులఁ గావించి సంపూర్ణ విజయము గాంచియుండలేదు. మహాభారత యుద్ధకాలమునం దైనను బలపరాక్రమసంపన్ను లగు సోదరులును బంధుమిత్త్రాదులును లెక్కకు మిక్కిలిగ నతనికిఁ జేయూఁతయై నిలిచిరి. ఇక్కడ నన్నో తన పక్షమున నుండునది భీరు వగు నొక యువకుఁడు. భారతయుద్ధసమయమున నతని చుట్టును నక్షౌహిణుల కొలఁది సైనికులు తనవారు సమసిపోయిరి. ఇక్కడ నన్నో తన వారిలో నొకఁడును మడియలేదు. అచ్చటఁ బదునెనిమిది దినములు శత్త్రువులు దన్నెదిరించిరి. ఇచటనో కొలఁది కాలములోనె పగవారు పటాపంచ లయిరి. మహాప్రసిద్ధు లగు కురువీరుల తలపాగలు తన శిష్యురాలి బొమ్మపొత్తికలకై యతఁడు కోయించెను. విరటుని గోగణము నంతటిని బురమునకు మరల్పించెను. సంపూర్ణవిజయ మన నిట్లుండవలెను గదా, మనుజుని సమర్థతాసమగ్రత లిటులె జంటగఁ గానఁబడును.

అర్జునుఁడు తన బాహుబలము నీ గోగ్రహణసమయమునం దత్యధికముగఁ జూపవలసివచ్చెను. సుప్రసిద్ధవీరుఁడు యుద్ధమునకు వచ్చుచున్నాఁ డని తెలియఁగనే శత్రుకోటి భయవిహ్వలులై వానిని డీకొనుటకు ధైర్యము చాలక యుండును. అందువలన నాశూరునికి జయము కొంతవఱకు సులభసాధ్యము. సామాన్యముగ నర్జునుఁడు యుద్ధమునకుఁ బూనినపుడెల్ల పగవారు వాని పేరు వినియు వాని ముఖవీక్షణము చేసియు పలాయితు లగుచుండిరి. కాని, యుత్తరగోగ్రహణకాలమందు మాత్రము విజయునికి జయ మిట్లు సులభసాధ్యము కాలేదు. అజ్ఞాతవాసనియమము నుల్లంఘింపవలసి వచ్చునను సందియము చేత నతఁ డిపుడు మాఱువేషముతోనే యుద్ధమునకుఁ దొడంగెను. కౌరవపక్షమున నుండు గురుభీష్మాదివృద్ధవీరులు కొందఱు మాత్ర మితఁ డర్జునుఁ డని మొదటినుండియు గ్రహింపఁ గలిగినను తక్కిన సైనికు లందఱు నతఁడు క్రొత్తవాఁ డని భ్రమించి కొంత సేపటివఱకు వానిని గుర్తెఱుఁగక మిక్కిలి బలముతో వానితోఁ బోరాడిరి. కాని, శత్రువులు తీక్ష్ణముగాఁ బోరు నపుడె నిజ మగు వీరుని శౌర్య మధిక మగుచుండును. వాని యుత్సాహము పెంపగుచుండును. కావుననే నాఁడు తన యుద్ధనైపుణ్యమును పరిపూర్ణముగ నతఁడు శత్రువులకుఁ జవి చూప నవకాశము కలిగెను.

శా. సింగం బాఁకటితో గుహాంతరమునం జేడ్పాటుమై నుండి మా
తంగస్ఫూర్జితయూథదర్శనసముద్యత్క్రోధమై వచ్చు నో
జం గాంతారనివాసఖిన్నమతి నస్మత్సేనపై వీఁడె వ
చ్చెం గుంతీసుతమధ్యముండు సమరస్థేమాభిరామాకృతిన్.

అని కౌరవసేనానాయకులు వీని నాశ్చర్యముతో వీక్షింప సాగిరి. తన శక్తు లెఱిఁగి వెఱచువారిమీఁదనే గాక యెఱుఁగక నిలువఁబడి పోరాడు పగతురమీఁదఁ గూడ శూరుఁడు తన పౌరుషమును జూపును. నిజ మగు శూరత్వము త్రుప్పుపడిన కత్తివలె నొక చోటఁ బడియుండక నఱకిన కొలఁదిని పదునువడు నాయుధము వలె సదా తీక్ష్ణత దాల్చియుండును. నిక్క మగు పౌరుషము తన వంశావళీబిరుదావళులను లెక్కింపఁజూడదు. ప్రాఁతవడిన కీర్తినే నమ్ముకొనియుండదు. క్రొత్త సమయముల నారయుచు క్రొత్త యవకాశములను నూతనపరిస్థితులను కల్పించుకొనుచు ఆచరణము మూలమున తన గౌరవమును బ్రకటీకృతము చేయుచుండును.

ఉత్తరగోగ్రహణసమయమునం దర్జునుఁడు గాంచిన విజయమునకుఁ గారణ మతని బాహుబల మొకటియే గాక అతని నయసంపదయు నని చెప్పవచ్చును. ఇంత కాలమునకుఁ దిరిగి శత్రుదర్శనము లభించినది గదా యని యతఁ డెంత మాత్రము విఱ్ఱవీఁగక శత్రుపక్షములో నున్నను తన గురువగు ద్రోణుని దాను గౌరవించుట విధి యని గుర్తెఱిఁగి యాయన వైపునకు నమస్కారబాణములు వైచి యాయన దీవన వడసెను. నీతిసంపద యతనియం దిట్లు విశద మగుటచేతనే విరోధివర్గములోనివాఁ డగు భీష్ముఁడును అర్జుననిమీఁద వత్సలత గలిగి యతఁ డా సమయమునఁ బ్రయోగించిన సమ్మోహనాస్త్రమునకుఁ బ్రతిబాణ మెఱిఁగియు నెఱుఁగనివానివలెఁ దానును దల వాల్చియుండెను. ఈ సంగతి యర్జునునికిఁ దెలిసి కౌరవవీరుల తలమట్లు కోయు నుత్తరునితో భీష్ముని జోలికి మాత్రము పోవల దని చెప్పెను. ఇంత యేల? ఒక విధముగ నర్జునుని సమ్మోహనాస్త్రము భీష్మునిమీఁదవలె నెవరిమీఁదను బని చేయలే దనియె చెప్పవచ్చును. అర్జునుఁడు శత్రు వను సంగతియె మఱపించి మీఁదుమిక్కిలి యతని పక్షమునకే భీష్ము నొరగింపఁజేసినది యర్జునునిచేఁ బ్రయోగింపఁబడిన నయవర్తన మను సమ్మోహనాస్త్రమే!

గోగ్రహణసమయమునం దర్జునునికి జయము చేకూర్పఁగలిగినది. చాలవఱ కతని దైవభక్తి యని చెప్పవచ్చును. కృష్ణార్జునుల స్నేహము వర్ణనాతీతము. కృష్ణుని సైన్యముల నపేక్షింపక నిరాయుధుఁ డగు నతని నొకనినే భారతయుద్ధసమయమునందుఁ దనకు సారథి కమ్మని యర్జునుఁడు కోరుట దీనికి నిదర్శనము. కాని, యర్జునుఁడు కృష్ణుని మిత్రుఁ డనియె కాక దైవ మని కూడ భావించెను. కృష్ణనిర్యాయణమును దన యన్నకుఁ జెప్పుచు,

క. మన సారథి మన సచివుఁడు
మన వియ్యము మన సఖుండు మన బాంధవుఁడున్
మన గురుఁడు మనకు దేవర
మనలను దిగనాడి చనియె మనుజాధీశా!

అని యర్జునుఁడు కృష్ణునిఁ గూర్చి పలికెను.

అర్జునుఁడు కృష్ణుని సారథిగఁ జేసికొని భారతరణభూమిని నిలువఁబడి యుద్ధమున జయము గాంచుటయందలి యంతరార్థము నరుఁడు నారాయణుని చేయూఁతచే సంసారమునఁ గృతకృత్యుఁ డగుచున్నాఁ డని చెప్పెదరు. ఏది యెటు లున్నను, అర్జునుఁడు కృష్ణుని దైవముగ భావించి యతని సాహాయ్యముచేతనే మహాభారతయుద్ధమున సంపూర్ణవిజయము నందఁగలిగితి నని తలంచెను. కాని, నారాయణుని యీ సాహాయ్యము భారతయుద్ధమునందువలెఁ దన కన్నులయెదుట కృష్ణునిఁ జూచునప్పుడె గాక తదితరసమయములందును వానికిఁ గానవచ్చుచునే యుండెను. "గోగ్రహణమునాఁడు గురుకులాంబోనిధిఁ గడచితి నెవ్వని కరుణఁజేసి" యని యర్జునుఁడు నాఁటి తన విజయమునకుఁ గృష్ణుఁడె కారణభూతుఁ డని యొప్పుకొనెను. కను మూసినను విచ్చినను దేవుని యాకారమె దర్శించు భక్తుఁడె భక్తుఁడు. స్వశక్తివలననే దిగ్విజయము గాంచితి నని విఱ్ఱవీఁగక నిజ మగు భక్తుఁ డెప్పుడును తన జయమును తన ప్రజ్ఞకే గాక దేవుని మహిమకే యారోపించుచు తన జీవిత మతని సేవకె వినియోగించుచు కృతకృత్యుఁ డగును.

ఉత్తరగోగ్రహణకథ మనకు బోధింపఁగల సంగతు లిట్లు పెక్కులు గలవు. సంసారయాత్ర యొక్కొక తఱి మన కన్నుల కుత్తరగోగ్రహణమువలె కష్టసాధ్యముగఁ గానఁబడును. చేయవలసిన విధికార్యము మన శక్తికి మీఱినట్లును స్థితిగతులు మనకు విరుద్ధముగ నున్నట్లును కావలసిన సాధనసామగ్రి మన చేతులకుఁ జిక్కకున్నట్లును దోఁచును. అట్టి కార్యము నిర్వహింపఁజూచుట సాహసకృత్యమనియు త్రొక్కు మార్గము గర్హిత మనియు జనులు తలంపవచ్చును. కాని, విధికార్యనిర్వహణ మెప్పటికిని కర్తవ్యమె. గొప్ప కార్యములు చేయు సమయము మనకు ముందు చెప్పి వచ్చునది గాదు. మన కపుడు సాహాయ్యము చేయు బంధుమిత్రాదులు గానరా రని వెతనొందుట వ్యర్థము. మన యాత్మపరీక్షకొఱకే దైవ మీ సమయము నాసన్నము చేసె నని మనము గుర్తెఱిఁగి యావచ్ఛక్తిని వినియోగించినచో విఘ్నపరంపరలు మటుమాయ మగును. లోకము నాశ్చర్యమున ముంపఁజాలిన జయము మనకు లభించును. మఱియు, ఎటువంటి ప్రజ్ఞ గాని పూర్వార్జితయశస్సునే యాధారము చేసికొనక నూతనమార్గమునందును స్థితిగతులందును బ్రవేశమై పెంపొందుచుండవలయును. నిశ్చయ మగు జయమును నిశ్చల మగు కీర్తిని జేకూర్పఁగల శక్తి నయశక్తియె. మనుజులను వశీకృతము చేసికొనఁగలది బాహుబలము గాదు. తుదకు ప్రజ్ఞాబలమును గాదు, సుగుణబలమె. కాని, యీ సద్గుణముల కాయువు పట్టు ఈశ్వరవిశ్వాసము. ఎవఁడు భగవంతుని పరమపితవలెనే గాక మిత్రునిగను తోడునీడగను జేకొని ప్రేమించి తాను జేయు నన్ని కార్యములను వాని కర్పించి యన్ని కార్యములందును వానిని దర్శించునో యతఁడే నిజ మగు భక్తుఁడు. అట్టివాఁడే నరనామమును సార్థకముగఁ దాల్చినవాఁ డగును.

# సంగీతము — స్వరప్రభావము

చలికాని లచ్చారావు గారు

సంగీతము సామవేదరూపమున భగవన్ముఖమునుండి వెలువడి నట్లు చెప్పఁబడుచున్నది. దానిని మనపూర్వు లధిష్ఠానదేవతఁగ భావించి పూజించుచుండిరి. సంగీతము సాధనచేసి తెలిసిన కొలఁది యం దంతర్భూతములై యున్న దివ్యశక్తులను బయలుపఱచి జ్ఞానాభివృద్ధికి దోడయి ఇహపరసౌఖ్యసాధనంబై మానవుని యున్నత స్థితికి సాయపడగల దని చెప్పనగును. పిపీలికాదిబ్రహ్మపర్యంతము ప్రాణికోటి కెల్ల నానంద మొసఁగునది ఒక్క సంగీతమే! శంకరాదులు సంగీతరసజ్ఞశిరోమణులు కదా! ఇట్టి సంగీతసుధారసమును గ్రోలుమానవులు ధన్యులుగదా! స్వకీయముగ రంజింపఁ జేయునది గనుక స్వరము. స్వరము ప్రధానముగఁ గలది సంగీతము. గీతవాద్య నృత్యంబులు చేరి సంగీత మనఁబడుచున్నది. వేదాదిమంత్రములవలె నిదియు శాస్త్రసమ్మతముగ నుచ్చార్యము. వేదమంత్రము లపస్వరంబుల ననర్థదము లెట్టులగునో అటులే సంగీత మపస్వరంబున ననర్థద మగుచున్నది. మంత్రము లనఁగ దివ్యజ్ఞానసంపన్ను లగు ఋషిసత్తములచే నియమానుసారముగను శక్తియుతముగను కూర్పఁబడిన అక్షరవిశేషములు. (Words of power) ఆయక్షరముల నుచ్చరించుటవలన గలిగినఫలమే మంత్రశక్తి. ఇందు సాత్త్వికతామసములు గలవు. ఉపాసనావిధులచే నుపాసకులు వేరయి ఫలసిద్ధినిఁ బడయుచున్నారు. వశిష్ఠుఁడు సాత్త్వికమంత్రోపాసనచే భగవదాదులను వశము చేసికొన్నట్లును జనమేజయుఁడు తామసమంత్రోపాసనవలన సర్పములను దగ్ధముఁ గావించినట్లును పురాణప్రసిద్ధం బయ్యె. ఈమంత్రములు గల శ్రుతి, స్మృతి, పురాణాదులకు మనవా రాధ్యాత్మికశాస్త్రము లని పేరిడిరి. ఇందు పరమాత్మ జీవాత్మ పుణ్యపాపాదు లతీంద్రియవిషయములును బోధింపఁబడి యుండును. మహనీయులు వేదముల కాధార మగునదియు పూర్ణానంద మొసగునదియు నగు పరబ్రహ్మస్వరూపము ఓం కార మని తలఁచిరి. ఇదియే ప్రణవస్వరూపము (ఓం = అ + ఉ + మ్) ప్రణవము అక్షరత్రయంబై, మంత్రత్రయంబై, నాదబిందుకళాత్మికంబై, సృష్టిస్థితిలయకారణభూతంబై యుండు. ఇట్టి గుంభితభావప్రభావంబు లాధ్యాత్మికసిద్ధాంతంబులం దొప్పు. ఇవి ఆత్మానుభవమును బట్టి విజృంభించ నెంతెంత ఘనకార్యంబు లైనను చేయ నగును. ఒక్క (ఓంకార) స్వరమునందే ఇంతటి అక్షరార్థంబు లిమిడియుండి మహాద్భుతశక్తి గలిగించునపుడు ప్రణవప్రతిపాదిత మయి సామవేదసార మనఁబడు సంగీతమున కెట్టి మహాద్భుతశక్తి యుండునో యూహింపుడు ఆయానియమాక్షరధ్వన్యాదులను బట్టి ఆధ్యాత్మికశాస్త్రంబునం దుండు మంత్రాదుల కెట్టిశక్తిగలదో సంగీతమున కట్టిశక్తి కలదని నిరూపింపనగు. ఇఁకఁ బ్రకృతిశాస్త్రమున గల భిన్నవస్తుసంయోగశక్తిని గ్రహింతము. ప్రాణవాయువు 1 వంతును నత్రజని 4 వంతులును జేరి వాయు వగుచున్నది. ప్రాణవాయువునందు దీపముంచిన ముందటికంటె నధికతేజమునఁ బ్రకాశించుటయు నత్రజనియందు నార్పుస్వభావమును గలదు. విడివిడిగ నేదైన నొకదానిని పీల్చినఁ బ్రాణహాని యగును. రెండును వంతులప్రకారము కలిపిన సాధారణవాయువై ప్రాణాధార మగుచున్నది. కావున వస్తువులు కలసినప్పుడొక గుణమును వేఱయినపు డొకగుణమును కలుగుచున్నవి. ఇది సాత్త్వికమంత్రము వంటిది. సున్నము పసపుల కలయిక యుగ్రమంత్రమువంటిది. కావున నొండొంటికి సంబంధ మున్నప్పటికి వస్తుగుణము లాయాకూడికలను బట్టి మారుచున్నవి గదా. అట్టివే మంత్రాదులకును ఆయానియమితాక్షరముల కూడికలను బట్టి శబ్దోచ్చారణ బట్టియు నాయాశక్తు లుదయించుచున్నవి. ఇందుఁ బ్రత్యక్షము లగువాటికి ప్రకృతిశాస్త్రము లనియు నాత్మానుభవమునుఁబట్టి ఆచరించువాని కాధ్యాత్మికశాస్త్రము లనియు పేరులు. కొందఱు మొదటిదానినిమాత్రమే విశ్వసింతురు. మఱికొందఱు రెండవదానినే నమ్ముదురు. ఏది యెట్టు లైన నుభయంబులప్రభావము సంగీతమున గుంభితమై యున్నట్లు చూపింపగలము. ఆధ్యాత్మికమునం దష్టాక్షరివలె సంగీతమున సప్తాక్షరి. (స-రి-గ-మ-ప-ధ-ని) కలదు. ఈ సప్తస్వరములకు షడ్జమ, ఋషభ, గాంధార, మధ్యమ, పంచమ, ధైవత, నిషాదము లని వరుసగ పేరులు. శయ్యా స్థాయి స్వరము మున్నగునవి పరిభాషలు. శాస్త్రంబునందు చెప్పిన చొప్పున లక్ష్యలక్షణ సమన్వితంబుగ నభ్యసించిన సంగీతము మిగుల ప్రతిభఁ గాంచును. సంగీతమునకు శాస్త్రమెంతయవసరమో కళయు నంతియే యవసరము. శాస్త్రము శ్రుతి లయ జ్ఞానాదులతో నడుగు తప్పకుండ దాని నంటియే యుండును. శాస్త్రము నియమముకొలఁది కళలేనిది రక్తి కట్టదు. రక్తి గట్టనిదే శోభించదు. గుణములును బయలుపడవు. కావున సంగీతమున కపస్వరంబు లనర్థదాయకము లని తెలియుచున్నది. శబ్దము, స్వనము రవము, ధ్వని, మ్రోత, నాదము, అను పర్యాయపదములచే స్వర మొప్పుచున్నది. స్వరము మ్రోతరూపముగ నూఁపుదల యనియు నది కలిగినపుడెల్ల నొక్కొక్క యాకారవిశేష ముదయించు ననియుఁ బ్రకృతిశాస్త్రమువలనఁ దెలియవచ్చుచున్నది. మ్రోతవలన నంతరాళమున నొక్కొక్కరూ పుదయించుటచేత మ్రోతలగుం బైనస్వరసముదయమువల్ల ననేకము లగు నాకారములు భిన్నభిన్నరూపములతో నుదయించు చుండును. మఱియును సంగీతస్వరములను బలుకు యంత్రములనుండి వ్యాపించు నాదప్రసారమువలన సన్నపు టిసుక

నేలమీఁద రేఖాగణితోక్తము లగు వివిధరూపవిశేషములు పొడముచుండుటను ప్రత్యక్షముగఁ జూడఁదగు నని ప్రకృతిశాస్త్రజ్ఞులు చెప్పుచున్నారు. మన ముచ్చరించు ప్రతియక్షరమునందును బయలి వాయువు కదలి దానియం దొకయల పుట్టుచున్నది. ఈ యక్షరమునకును వాయ్వాకాశ సూక్ష్మతత్త్వములం దొకచలనము పుట్టి యొక రూప మేర్పడును. ఇట్లు శబ్దసమూహముచే ననేకరూపము లుదయించుచున్నవి. వీనికి కాలనియమాదులుకూడ గలవు. వసంతరాగ మపరదిన మందును, మేఘరంజి మధ్యాహ్నకాల మందును, ప్రాతఃకాలమున భూపాలరాగమును పాడవలె నని చెప్పుదురు. ఒకఁడు మేఘరంజినిని పాడి మబ్బుఁ గ్రమ్మించి వర్షమును కురియించినట్లును మఱియొక్కఁడు సారంగరాగమును పాడి లేడిని వశము చేసికొన్నట్లును జనశ్రుతి యయ్యె. ఏదేని రాగమును సరిగఁ బాడిన యెడల దాని స్వర సమ్మేళనమువలన నంతరాళమునఁ గలుగు శ్రోత్రచేత నయ్యైరూపము లుదయించు నని సిద్ధాంతము చేయఁబడినట్లు వార్తాపత్రికలవల్లను గ్రంథములవల్లను తెలియుచున్నవి. వాట్సుహ్యూగ్సు దొరసాని "వాయస్ ఆఫ్ ఫిగర్సు" అను గ్రంథమువలన నీ సిద్ధాంతము నిజ మని రుజువు చేయుచున్నది. ఈమె ఈడోఫో నను యంత్రము వలనఁ దానుఁ బాడిన సంగీతస్వరమువలన నుదయించు వివిధరూపములను లోకమునకు జూపింప నేర్చినది. కొన్ని కొన్ని జాతుల చూర్ణములను నెరపి సంగీతస్వరముల యాకారముల నా చూర్ణరేణువులతోఁ గనఁబడఁజేయును. నక్షత్రములు, ఫలములు, పుష్పములు, సర్పములు మొదలగువాని యాకారవిశేషము లన్నియు కాంతివంతము లై సూక్ష్మాకారములతోఁ గనపడును. ఇటు లామె సభ్యులకుఁ గనపరచె నట! దీనిం బట్టి మూఁడ స్వరవిశేషము, రూపవిశేషమును పొడమించు ననియు నాయా స్వరసముదయసమ్మేళనమువలన నాయారూపము లుదయించు ననియుఁ దద్భిన్నత్వమున నా విశేషము లుదయించ ననియుఁ దేలుచుండెను. దీనినిఁ బట్టి దృష్టిగోచరములైన వానికి రూపములను గల్పించి ప్రత్యక్షముగ స్వాధీనముఁ జేసికొను శక్తి మంత్రాదులకువలె సంగీతమునకు గూడ నుండినట్లు తేలుచున్నది. మఱియు భావరాగతాళంబులఁ బ్రకాశించెడినృత్తగీతవాద్యములచే భక్తులు సంకల్పించుకొను రూపమును ప్రత్యక్షముగాఁ జేసికొనునట్లు చెప్పఁబడుచున్నది. సంకల్పమున రూపములఁ గ్రహింపనగును. ఇతరుల సంకల్పములఁ దెలిసికొన నగును. దేహబలమునకన్న బుద్ధిమనోబలములు శతాంశ మెక్కువ. మనోబలము ఇతరుల మనస్సును స్వాధీనపఱచుకొనఁ గలదు. దీనినే ప్రకృతిశాస్త్రజ్ఞులు విల్ ఫోర్సు అని యందురు. ప్రత్యక్షముగ నిప్పుడు ఫ్రాన్సుదేశమున మనస్సంకల్పములను ఫోటోగ్రాఫున నెత్తుచున్నారట! దూరమం దుండుస్నేహితుని మనస్సునందు సంకల్పించుకొని కూర్చుండ నెదుటివానిరూపము పడక వాని మనస్సునందు తలంచుకొను వాని రూపమే పడుచున్నదట. ఇట్టి దానినే మున్ను మనవారు కనిపెట్టి మనస్సునందు పుట్టుసంకల్పము సూక్ష్మాకాశములోఁ బ్రతిబింబ మేర్పడుచున్న దని చెప్పుచుండిరి. ఈ సంకల్పశక్తి ఘనకార్యముల నయినను చేయ కల దని మనవారి సిద్ధాంతము. సంగీతసాధనమున నట్టి మహాద్భుతశక్తు లండినట్లు భక్తులచరిత్రలవలన దెలియుచున్నవి గదా! మఱియు గానకళావతంసు లగు పర్వతనారదహనుమదాదులసంగీతంబున శిలలుసైతము నీ రయినట్లును నీళ్లను రాళ్లను గానొనర్చి నట్లును వినియున్నాము. సంగీతమున కట్టిశక్తి కలదా? ఈ మధ్య నమెరికాయం దొకగాయకుఁడు వంతెనమీఁద కూరుచుండి విలాసార్థము గాన మొనర్చుచుండ నావంతెన గజగజ వణక నారంభించెనట! ఆతఁడు పాటఁజాలించినప్పుడు వంతెన కదలకుండె నట. అతఁ డాశ్చర్యము నొంది తిరిగి యాస్వరముననే యదే కాలమున నాపాటనే ఆరంభింప మఱల వంతెన కదల నారంభించె నట! అప్పుడక్కడ నున్నజను లెల్లరు నాశ్చర్యమగ్నులై స్వరమునకును లోహమునకును సంబంధ మేదో కల దని నిశ్చయించి స్వరమహిమమున కద్భుతపడసాగి రని వార్తాపత్రికలవలన వినియుంటిమి. ఒక్క దేవకామిని సంగీతశక్తియే యర్జునుని శాపపాత్రుఁ జేసెను. శంకరశ్రీకృష్ణాదులు నృత్తగానంబులకు లోనై తాండవమాడినట్లు పురాణప్రసిద్ధముగదా! శంకరుని ఢక్కావాద్యధ్వనులే సంస్కృతాక్షరములుగ నయ్యె నని చెప్పెదరు గదా! మనవా రొక జ్యోతిషశాస్త్రమును కనుగొని దాని నభివృద్ధిపఱచునప్పటికి యెన్నో వేలు సంవత్సరములు పట్టినట్లు తెలియుచున్నది. కాన భారతీయసోదరులారా! ఇట్టి సంగీతవిద్యను భక్తితాత్పర్యంబులతో భరతవర్షంబున నభివృద్ధిపఱచి తల్లాభంబులఁ బడయుదురు గాత యని కోరుచున్నాను. జగదీశ్వరుఁ డట్టి వరప్రసాదము మన కనుగ్రహించును గాత.

# ద్విపదకవిత్వము

## పంచాగ్నుల ఆదినారాయణశాస్త్రి గారు, కావ్యవ్యాకరణతీర్థులు

శ్రీ యాసిద్ధి స్సత్వే భవతి మహతాం నోపకరణే — అని సంస్కృతమునం దొక న్యాయము కలదు. సమర్థు లగు మహానుభావులకు కార్యసిద్ధి సత్వమునం దుండునే కాని ఉపకరణముల (సాధనముల) యం దుండ దని పైదాని కర్థము. ప్రకృతము మనము పరిశీలింపఁబోవు ద్విపదకవిత్వము గూడ పై న్యాయము ననుసరించియే యున్న దని పరిశీలకు లగువారికి తోఁచకమానదు. అయినను, గతానుగతికన్యాయము చొప్పున లోకమునం దీ కాలము వఱకును "పదకవిత ముదిమి వనితయు" అని యొక ప్రవాదము మాత్రము ఆబాలగోపాలము వ్యాప్తి గాంచియున్నది. ప్రవాదము లెప్పుడును అనాలోచితముగ ప్రవర్తిలి యంధపరంపరగా వ్యాప్తి నొందుచుండుట సాజము. మనీషు లగువారి కిట్టి ప్రవాదములఁ దుదిముట్టఁ బరీక్షించి యథార్థమును లోకమునకు రూపించుట స్వధర్మము. నేను మనీషిత్వములోఁ గాకున్నను, సహజము నలౌకికము నగు పదకవిత్వముపై నొక విధ మగు ననురాగము గలిగియున్నవాఁడ నగుటచేతఁ బ్రస్తుత మీ వ్యాసమునందు ద్విపదకవిత్వమును విమర్శింపఁబూనితిని.

### ద్విపద యన నేమి?

కవిత్వము సాధారణముగా గద్యపద్యస్వరూపమున వెలయుచుండును. గద్యకవిత్వము ప్రాయికముగా ఛందోవిన్యాస నిబంధన రహితమై యుండును. పద్యకవిత్వము ఛందోబద్ధమై తనరుచుండును. ఈ రెండు విధములు మాత్రమే గాక గద్యపద్యములు రెండును మేళవించి గూడ కూర్పఁబడిన కావ్యములు పెక్కులు గలవు. అట్టి కావ్యములను సంస్కృతమునందు చంపువు లనియు తెలుఁగునఁ బ్రబంధము లనియు వ్యవహరించుచున్నారు. ఇఁక రెండవది యగు పద్యకవిత్వము వృత్తము లనియు జాతు లనియు రెండు భేదములచే నొప్పారుచున్నది. పైఁ జెప్పిన జాతివృత్తములు గూడ జాత్యుపజాతిభేదములఁ బరఁగినవి. షడ్విధకందములు (అనఁగా నాఱు విధము లగు కందపద్యభేదములు) గాక, ఉత్సాహ తరువోజ పంచవిధాక్కఱలు అనునవియు ద్విపద త్రిపద చతుష్పద పంచపాది షట్పద వృత్తములును రగడ మొదలగు నితరవృత్తములును గలసి మొత్తముపైని జాతు లనఁబడునని ఛందోవేత్తల భావముగాఁ గనుపట్టెడిని. ఇట్లే గీతపద్యములోని భేదములును సీసపద్యములు నుపజాతు లని గూడ నెఱుంగనగును. కావున, ద్విపద యనునది జాతివృత్తములోని యొక భేదము అని పర్యవసించినది. ఇందులకుఁ బ్రమాణంబుగా నప్పకవి చెప్పిన యీ క్రింది పద్యమును గ్రహింపఁదగును.

సీ. కందభేదము లాఱుఁ గాక యుత్సాహము
          తరువోజ షట్యమాక్కఱలు నైదు
    దీపించు మంజరీద్విపద త్రిపదచతు
          ష్పదపంచపాదషట్పదవిధములఁ
    దొమ్మిది విధములతో నొప్పు రగడలఁ
          గళికలు నుత్కళికలును గూడ
    జాతులు నవవిధగీతంబులును సీస
          సప్తకంబును నుపజాతు లయ్యె
    ననుచు నన్నయభట్టు భీమనయుఁ బెద్ద
    సచివుఁడును మూర్తి తాతయజ్వయు ననంత
    మంత్రియును దిమ్మరాజు నిమ్మాడ్కిఁ జెప్పి
    రందముగ వారు చేసిన ఛందములను. — అప్పకవీయము.

అప్పకవి చెప్పిన యీ పద్యమును సావధానముగాఁ బరికించినచోఁ, బైని తేర్కొనిన వృత్తవిభాగక్రమమును భిన్నవృత్తములును నన్నయభట్టారకాద్యాంధ్రకవిజనసమ్మతములు మాత్రమే గాక, వారు వారు తమతమ గ్రంథములయందు సందర్భానుసారముగ నచ్చటచ్చట నయ్యె ఛందముల నందము గులుకు చందమునఁ బ్రయోగించి రని తోఁచుచున్నది. కాని, ఆంధ్రశబ్దానుశాసనుఁ డనియు (కొందఱ యభిప్రాయము ననుసరించి) ఆంధ్రమున నాదికవి యనియుఁ బేరొందిన నన్నయభట్టారకుని మహాభారతమునందు అచ్చటచ్చటఁ దరువోజ†మధ్యాక్కఱ యుత్సాహము కందము మున్నగు వృత్తములను పరిశీలించి కనుఁగొనవచ్చును గాని ద్విపద మాత్ర మెచ్చోటను మందునకైనను కాన్పింపదు. భాషాంతరము నొనర్చుటలోను పదవిన్యాసమునను సోమయాజి మున్నగువారు నన్నయకంటె భిన్నమార్గప్రవృత్తులుగనే యున్నను ఛందోవిన్యాసమునందు మాత్రము ప్రాయికముగా నన్నయ్య త్రోవ నవలంబించిరే గాని స్వతంత్రించి ద్విపదప్రభృతివృత్తములఁ గూర్పరైరి యని కొందఱ యభిప్రాయము.

పై పద్యమునందు "వారు చేసిన ఛందములను" అని యుండుటఁ బట్టియు పద్యములోఁ గీర్తితు లగు కోవిదులలోఁ జాలమంది లక్షణగ్రంథప్రణేత లగుటం బట్టియు, వృత్తవిభాగమును తల్లక్షణములను తమతమ గ్రంథములలోఁ జర్చించి నిర్దేశించిరే కాని వేఱు గా దనియు కావున భారతాదులలో ద్విపదలను కూర్పకపోవుట లోపము గా దనియు మఱికొందఱ సమాధానము. ఈ ప్రశ్నోత్తరములవలన మనము ద్విపదకవిత్వము నన్నయాదులకంటె ప్రాచీనమని యొక వాదమును నవీన మని యొక వాదమును ఆనుపూర్విగా

† తరువోజ యతిప్రాసనియమంబున కొంచెము మార్పు నొందిన ద్విపదయే యని యెఱుంగునది. — సంపాదకుఁడు.

వచ్చుచున్న దని జ్ఞప్తియం దుంచుకొనవలయును.

ఏది యెట్లున్నను (అనఁగా పూర్వపక్షోత్తరపక్షములవారి శంకాసమాధానములు ఏతీరున నున్నను), నన్నయభట్టారకుని కాలము నాఁటికే ద్విపద ప్రచారమున నుండె ననియు ఇయ్యదియే ఆంధ్రభాషయందు సంస్కృతమున ననుష్టుప్పు రీతిని—ప్రాథమికవృత్తమై యొప్పె ననియు నొప్పుకొనక తప్పదు. ఏల యనఁగా— ద్విపద యని యొక వృత్త ముండినఁ గాని అందులకు లాక్షణికులు లక్షణములను చేయు నవసరము సంభవింపదు. తఱచుగా లక్ష్యలక్షణములలో లక్ష్యములే ప్రథమము లనియుఁ బిమ్మటివి లక్షణము లనియు విజ్ఞులకు విదితమే యైయున్నది. మఱియు, ప్రాజ్ఞు లగువారికి లక్షణములందుకంటె లక్ష్యములపైనే ప్రామాణ్య మెక్కుఁ డనుటయు సుప్రసిద్ధము. కావున, ద్విపదకవిత్వము నన్నయభట్టారకునినాఁటికే ప్రచారమున నున్న దనుట నిర్వివాదముగా నొప్పుకొనఁదగియున్నది.

నన్నయాదులనాఁడు ద్విపదకవిత్వము ప్రచారమున నున్నచో నిప్పు డా కాలమునాఁటి గ్రంథము లేల కానరావు?— అని కొంద ఱడుగవచ్చును. కాని, పృచ్ఛకులు నన్నయభట్టు కాలముకంటెను మిక్కిలి పూర్వమున నున్నవై కవిత్వమున నింతకంటెను రసవంతము లైన కావ్యము లెన్నియో కాలవశమున లుప్తములై యుండుటను జ్ఞప్తి నుంచికొన బ్రార్థించెద.

మఱియు, నిచ్చట నింకనొక విషయమును మనము పరిష్కరింపవలసి యున్నారము. అయ్యది యేకవృత్తమునఁ గృతినిర్మాణ మనునదియే. సంస్కృతాంధ్రములలో నింతదనుక ప్రాయశః కావ్యలక్షణములలో నేమి రచనాసంవిధానములలో నేమి ప్రబంధనిబంధనములలో నేమి మహాకావ్యము లుపకావ్యములు ఖండకావ్యములు నాటకములు మున్నగునవి యేకవృత్తనిర్మాణము పట్ల సారూప్యమును పొందియే యున్నను, ఆంధ్రకావ్యములలో మాత్రము భిన్నవృత్తతను పాటించిరి. 'సర్గాంతే భిన్నవృత్తతా' యని కావ్యలక్షణములు సంస్కృతమున నుంటయు కావ్య మంతయు (కొన్నియెడల సర్గ యంతయు) నొక్క వృత్తముతోనే సమాప్తి నొందించుచుండుటయు కనుఁగొనవచ్చును. మన యాంధ్రకావ్యములం దట్లు కాక యే ప్రబంధమే కావ్యము పరికించినను చంపువులయందుఁ బోలె వివిధవృత్తములు కనుపట్టుచుండును. ఇపుడు భిన్నవృత్తత కావ్యముల సమంజసమా యసమంజసమా యను విషయమును మనము విచారింపవలయును. సమంజస మంద మన్నచో భిన్నవృత్తములు గల సంస్కృతకావ్యములు తెలుఁగు గ్రంథము లన్నియు నగ్రాహ్యములు కావలసివచ్చును. మనకుఁ గల యనుభవము కొలఁది పరికించినచోఁ గాళిదాసుని మేఘసందేశమును ఆర్యాసప్తశతి మొదలగు సంస్కృతకావ్యములును గుణాఢ్యుని ప్రాకృతకావ్యములును ఆంధ్రభాషలోని శతకగ్రంథములును ఏకవృత్తపూర్ణములే కదా! ఆ కావ్యములను పఠించుచో నెవ్వరైనఁ గాని ఏసందర్భమునఁ గాని ఎప్పుడు గాని విముఖత నొందిరా? రసము గ్రహింపఁ జాలకపోయిరా? లేదుగదా! కావున, భిన్నవృత్తత సమంజస మనుటకు వీలు లేదు.

పోనీ, భిన్నవృత్తత యసమంజస మనుకొందము. కాని, వృత్తభేదము గల కావ్యము లెన్ని రసప్రపూర్ణములై సకలజనహృదయరంజకములై యలరారుట లేదు. కావున, గ్రంథములలో భిన్నవృత్తములు కూడునా కూడవా యని వివరించుటకంటెను ఇష్టమువచ్చిన వృత్తములతో కావ్యమును రసోదంచితముగను సహృదయహృదయాహ్లాదకరముగను పాఠకజనమనఃప్రమోదకరముగను సంస్కారచ్యుతి పొరయకుండునట్లుగను గమనించి వ్రాయుట శ్రేయము. ఇదియ నిక్కమగు కవిత్వతత్త్వము. దీనిఁ గనిపెట్టినవాఁడ కవి. ఇట్టివాని కవిత్వమే సకలజనశ్లాఘ్యమై యలరారుచుండును.

అయినను, ప్రబంధములయం దేకవృత్తతను పాటించు నాచారము దూరము పరికించినచో మన యాంధ్రభాషయందు లేకపోలేదు. పరికింపుఁడు ద్విపదకావ్యములు శతకములు బిరుదావళులు స్తుతిపాఠములు మొదలగువానిలో నేకకవృత్తతయే పాటింపఁబడినది.

కవి, సమర్థుఁడై చతురుఁడై లోకజ్ఞుఁడై భువనరంజకుఁడై వశ్యవచనుఁడై వెలయవలయునే కాని 'కవిత్వము ద్విపదతోఁ జెప్పెనా? త్రిపదతోఁ జెప్పెనా? పదములఁ జెప్పెనా? పాటలఁ జెప్పెనా? పద్యములఁ జెప్పెనా? గద్యములఁ జెప్పెనా?' యను విషయము ప్రధానము కాదు. కావున, నే వృత్తములలోఁ జెప్పినను విబుధులు అల్పానల్పముల నపేక్షింపక, రసము ఔచిత్యము లోకజ్ఞత మున్నగు గుణములచేత ప్రకృష్టతరమై యొప్పుచున్నచో నట్టి కవిత్వమును నిష్పక్షపాతులై గుణముల గ్రహించి యాదరింపవలయు ననియు నిరాదరించుట తగ దనియు నా యభిప్రాయము.

ఇఁక, నన్నయాదుల కాలమునాఁటికే ప్రచారమున నున్న ద్విపదకవిత్వము మధ్యకాలమున నెందులకై హీనము కావలసివచ్చె ననుట విచార్యము. ద్విపదకవిత్వము ప్రాచీనమై ఆంధ్రసారస్వత మహావృక్షమున కాదిమూలమై పండితపామరజనుల కెల్లర కాదరణీయమై తుడుము మొదలుకొని దేవార్చనమువఱకుఁ గల వాఙ్మయరాశిలో నేదో యొక రీతిని ప్రవేశించి తన విశ్వవ్యాపిత్వము నిప్పటికిని మన కనులకుఁ గాన్పింపఁజేయుచున్నదే కాని యూరకుండలేదు. చూడుఁడు, మన గృహములలోఁ బూర్వకాలిక లగు స్త్రీలు చేయు పూజాపురస్కారములు మొదలుకొని అద్వైతోపదేశములవఱకును గల వాఙ్మయ మంతయు, (అనఁగా అప్పగింతలపాటలు దక్షయజ్ఞము సీతపాట పుత్రకామేష్టి పార్వతీపరిణయము లక్ష్మణమూర్ఛ అంగదరాయబారము ఆత్మబోధ మున్నగు పాటల కథ లన్నియు, అవి యివి యన నేల! జనసామాన్యమునకు నీతిమతములఁ గఱపి లోకతంత్రవిదులఁ జేయ ననువగు విషయము లన్నియు ద్విపదలలోనే కూర్పఁబడియున్నవి.

కేవల మింత మాత్రమే గాక పండితజనాదరణీయములును వేదవేదాంగాదులలోని దగు విజ్ఞానమున కంతకును నిధు లనఁదగు భారతభాగవతరామాయణములు కూడ ద్విపదలందు జనానుగ్రాహకాంక్షు లగు కవీశ్వరులు రచించి కృతార్థత నొందిరి. పండితున

కైనను పామరున కైనను విన్నంతనే హృదయము నాహ్లాదింపఁజేయు శక్తి యున్నఁ గదా నిక్కముగా కవిత యనిపించుకొనఁదగును. ఇట్టి కవిత్వముఁ జెప్పి ప్రజల నారాధింపవలయు నని కోరెడి కవికి పరిపూర్ణ మగు స్వాతంత్ర్య ముండవలయును.

స్వాతంత్ర్య మనఁగా, కొందఱు తలంచునట్లు యతిప్రాసాది నియమరహితముగ కవిత్వముఁ జెప్పుట యని గాని పర్యాయపదములు అలంకారములు మున్నగునవి లేకుండ చెప్పుట యని గాని తలంపఁజనదు; విపుల మగు భావము ఉచితజ్ఞత రసస్ఫూర్తి మున్నగు గుణములు వెల్లడించుటకు నిర్బంధమును కలిగించు పరికరములను విసర్జించు నధికార మని మాత్రమే యర్థముఁ జేసికొనవలయును. వృత్తములు పెద్దవిగా లేకపోయినప్పటికిని చిన్నిచిన్ని పదములఁ జెన్నుమీఱునట్లు చెప్పుటకు వీలు కలుగఁజేయుట గూడ నొక విధమగు స్వాతంత్ర్యమే యనఁదగును. ఇట్టి స్వాతంత్ర్యమును కవి పూర్ణముగా వహించుటకు ద్విపద యొక్కటి తప్ప మఱే యితర మగు ఛందమును అనువుపడియుండదు. కనుకనే ద్విపద జనసామాన్యమున విశేషముగాఁ బ్రచారమునకు వచ్చె నని నిశ్చయింపఁదగును.

ఈ రీతిగా జనసామాన్యమున కీ ద్విపదకవిత్వము మిగుల ప్రేమాస్పదమై యలరారుచున్నను చిరకాలమునుండి యుండినను రాను రాను ఏల యియ్యది కుంఠితమై మూలఁబడవలసి వచ్చె నని యెంతటి నైపుణ్యమునఁ బరికించినను తగినంతటి కారణములు కనుపట్టవు. కాని, రాజాశ్రయాభావము నిస్సార మగు కవిత యని కొందఱును ద్విపద కవిత్వము నధికారిభేదము లేక వ్రాసినచోఁ దమ తమ పాండిత్య ప్రకర్ష లపకర్షత నొందు నని మఱికొందఱును పామరజనరంజకము లగుటఁ బండితు లాదరింపమి యని యింకఁ గొందఱును ఇందులకుఁ గారణములుగఁ జెప్పెదరు. కాని, యిం దేవియు తగినంతటి యుపపత్తిని జూపి సమర్థింపఁజాలవు.

ఏల యనెదరా? రాజాశ్రయాభావాదులు కారణము లనినచో రంగనాథుఁడు స్వయముగా రాజా? అతని గ్రంథమును లక్షణవేత్తలందఱు నుదాహరింపలేదా? అట్లయినను దాని కేల సార్వజనీనత రాలేదు. నిస్సారత్వము మున్నగునవి కారణము లనియెదరేని పద్య కావ్యములలో మాత్ర మెన్ని లేవు పై మాటలకు గుఱియగునవి? కావున, నాలోచించు కొలఁది ద్విపదకావ్యప్రచారము లుప్త మగుటకు మనవారిలోఁ బొడకొని వేఱులు పాఱియున్న యహంపూర్ణ మగు మౌర్ఖ్యమే గాని వేఱు కా దని తోఁచును.

ఈ మాటలను నేను ప్రాచీనులను దూషించు తలంపున ననుటలేదు. సర్వజనశ్లాఘ్య మగు వైదుష్యమున నొప్పారి శ్రుతిస్మృతీతిహాసాదులఁ గరతలామలకములఁ బోలె నొనర్చికొని సమయస్ఫూర్తిగ నుపన్యసించు జాణతనమున నలరారి తన కాలమున నున్న పరవాదుల గుండియ లెల్ల జల్లుర మన విజృంభించి తా నుత్తమశ్లోకత నొంది వీరమాహేశ్వరవరిష్ఠుఁడై వెలసిన పాల్కురికి సోమనారాధ్యుల నాఁటికి ద్విపదకవిత్వముపైని లోకమున కే విధమగు నభిప్రాయ ముండెడిదో, ఆ మహానుభావుని గ్రంథమునందలి ద్విపదపంక్తులు కొన్ని సుసూక్ష్మముగా తెలియఁజేయఁగలుగును:

ఒప్పునే ద్విపదకావ్యోక్తి నా వలన
దారూఢగద్యపద్యాదిప్రబంధ
పూరితసంస్కృతభూయిష్ఠరచన
మానుగా సర్వసామాన్యంబు గామి
జాను తెనుఁగు విశేషప్రసన్నతకు
నట్టులం గాక కావ్యప్రౌఢి పేర్మి
నెట్టన రచియింప నేర్చినఁ జాలు
నుపమింప గద్యపద్యోదాత్తకృతులు
ద్విపదయు సమమ.

దీనిని బట్టి యారాధ్యులవారు పండితుని చరిత్రమును ద్విపదకావ్యమునఁ జెప్పఁబూనుకొనినట్టును అప్పటికే యనఁగా సోమనారాధ్యుని కాలమునకే ద్విపదకవిత్వ మన్న నేవగించుకొను పండితు లుండి రనియు తాము చేయు కృతి పండితులకంటెఁ బామరజనమునకే యెక్కు డుపయోగపడవలసియుండుటచేతను గద్యపద్యములతోఁ బ్రౌఢిగా రచియించు నేర్పు తమ కున్నను జనసామాన్యమున కట్టి కృతులు (అనఁగా ప్రౌఢములగు గద్య పద్యకృతులు) సంస్కృతపదబాహుళ్యముచేఁ జెన్నొందుచుండుటవలన సంతుష్టిని కలుగఁజేయఁజాలకయుండుటచేతను తాము ద్విపదకావ్యవిరచనమునకుఁ బూనుకొనవలసివచ్చె నని కారణములఁ జెప్పియు నంతటితోఁ దృప్తినొందక, అనఁగా నామాత్రపు సమాధానముచేత లోకులకుఁ దృప్తి గలిగింపఁజాలక, ఎట్టకేలకు ద్విపదకును బద్యగద్యకవిత్వమునకును భేదము లే దని నిరూపింపవలసివచ్చినట్టులు తేలుచున్నది.

మఱియు, గద్యపద్యోదాత్తకృతులకును ద్విపదకృతులకును సాదృశ్యమును సంఘటింప నుపక్రమించి సరళత ప్రసన్నత మొదలగు గుణములచే సమృద్ధమై యుండిన కవిత్వమే యే వృత్తములం దున్నను కవిత్వ మనిపించుకొను ననియు అట్టి గుణములు పరిపూర్ణముగా సంఘటించుటకు కేవల మొక జాతులు (అనఁగా నుపజాతులు) మాత్రమే తగియున్న వనియు అందును జల్లిశబ్దములను ప్రయోగించుట మొదలైన దోషములు పరిహరింపఁబడినచో సహృదయుల కానందము గలుగు ననియుఁ గంఠోక్తిగాఁ జెప్పి తాను రచింపఁదొరఁకొనిన పండితారాధ్యచరిత్రమును పైని చెప్పిన సల్లక్షణములతో నలరారునట్లు చేసెద నని యీ క్రింది ద్విపదలలో వక్కాణించుచున్నాఁడు. పరికింపుఁడు:

అటుగాన నభినుతానందితోక్తిఁ
బటుగద్యపద్యప్రబంధసామ్యముగఁ
గావ్యకళాప్రౌఢిఁ గల్పింతుఁ గవిత
కావ్యంబు భావ్యంబు గాఁగ నట్లయ్యు
నవికలవేదవేదాంతేతిహాస
వివిధాగమపురాణవిహితసూక్తముల
విద మిశ్ర మను చోట నివియ ప్రామాణ్య
పదములు గాఁగ ద్విపదలు రచింతు. —పం. అ. చరిత్ర

మఱియు, కవి తనకుఁ గల కవిత్వశక్తిచేత వృత్తములకు నితివృత్తములకు సొంపు నింపునే గాని వృత్తములు నితివృత్తములును కవి కుత్కర్ష గూర్పఁజాలవు. కావున సత్కవి యగువాఁడు తన ప్రతిభావిశేషమున నే ఛందమునైన నందము నొందఁజేయఁగలఁ డని తన యుద్యమమును సమర్థించుకొని, ద్విపదకవిత్వము గూడ నిక్కముఁ బరికించినచో సమర్థత యున్న నే చెప్పఁజొప్పడు ననియు అందును ముఖ్యముగా ననర్థముఁ బొరయని రీతిని వళ్లును ప్రాసంబులును బొందు పడి యుండవలయు ననియు చెప్పుచు, ద్విపద యైహికాముష్మికము లగు పదద్వయమునకు సాధన మగుటవలన ద్విపద యని పేర్కొనఁ బడియె ననియుఁ జెప్పెను. చూడుఁడు:

... ... ... ద్విపద
కొలఁది నే పలుకుటకును మది మెచ్చి
వ్రేలి ముద్రిక రత్నకీలన సేయు
చో లేక మనఁగవచ్చునె? రత్న మెంత
సొట్టైన రత్నంబు చుట్టును బసిడి
గట్టుట యది వివేకం బది యట్లు!
దేసిగా రచియించు ద్విపదకు వళ్లుఁ
బ్రాసంబులును బొందుపడఁగఁ దా వలయు.
ననుచుఁ దదీయ సూక్తాక్షరపంక్తిఁ
జెనకక యిం తొప్పఁజెప్పునే యనుచు
సన్నుతి సేయుచు సత్కవు లలరఁ
దిన్నని సూక్తుల ద్విపద రచింతు
నదియును గా నైహికాముష్మికద్వి
పదహేతు వగుట ద్విపద నాఁగఁ బరఁగు.

ఈ యుదాహరించిన వాక్యసందర్భములఁ బట్టి పైని నేను చెప్పిన విషయములు యథార్థము లని తమకు తోఁపకపోదు. కాన, నిఁక నిప్పుడు ద్విపదతోఁ గవిత్వముఁ జెప్పిన కావ్యములు పద్యప్రబంధముల శైలికి సమముగా నుండునా? లేక న్యూనము లగునా? ఆధిక్యము నొందునా?—యను విషయములు నిర్ణయింపవలసియున్నది. నాకుఁ గల యభిజ్ఞానము కొలఁది పరికించి చూచిన (ద్విపద కావ్యములు పద్యప్రబంధములతో సామ్యతావిషయమునఁ బరీక్షించినచో) కవితయందుఁ గాని భావప్రపూర్ణతఁ గాని శైలివిషయమునఁ గాని ఉక్తివైచిత్ర్యమునఁ గాని ఏ మాత్రమును తీసిపోకుండుట యట్లుండఁగా—పై పెచ్చు ఒక వన్నె యందమును ఆధిక్యమునే ప్రదర్శించు ననుటలో నతిశయోక్తి యిసుమంతయు లేదు. కావున, నిటుపైని ద్విపద కావ్యములకును పద్యప్రబంధములకును పరస్పరసాదృశ్య మవ్యవహితముగఁ గలియు సందర్భముల నేర్పఱచి ప్రదర్శించుచున్నాఁడను. అందును, మనకు భారత భాగవత రామాయణములకంటెఁ బావనత్వమున నేమి ప్రమాణవిషయమున నేమి యసాధారణము లగు గ్రంథము లొండు లేకుండుటవలనను రమారమి పై మూఁడు గ్రంథములును గద్యపద్యాదులలోను ద్విపదలలోను పూర్వకవులే పరిణమింపఁ జేసియుండుటవలనను మున్ముందు భారత భాగవత రామాయణముల లోని ఘట్టములను స్థాలీపులాకన్యాయమున దోలనము నొనర్చి యటు పైని ద్విపదయందుఁ గల వర్ణనాచాతుర్యములను కృతులను సంగ్రహముగాఁ బేర్కొనియెదను. చూడుఁడు—భాగవతము నందు చతుర్థస్కంధములోని దక్షుఁడు శివుని ద్వేషించు కథాభాగము :

ఇందఱు నను గాంచి యెదు రేఁగుదెంచి
వందనంబు లొనర్చి వర్తింపఁ గనియుఁ
గంటిరే మునులు! ముక్కంటి తా నిచట
నొంటిమైఁ గదలక యున్న చందంబు.
గరువంబుతో నన్నుఁ గని లేవకున్నఁ
బెరిఁగనే బొజ్జ? తాఁ బెద్దవాఁ డగునె?
ఏ మాపనే? నాకు నీతఁ డల్లుండె?
కులము మాటలకు సోకూలి కాఁపురము.
కలుగూడు నడత రూపము చూడ రోత
ఎక్కుడు ముడిగిబ్బ యెమ్ములు సొమ్ము
కక్కురం బగు తోలు కట్టెడు వలువ
పునుక కంచము కాటిబూదియ పూఁత
ధనమును నహి యొందు తా వది సున్న
పుట్టువు దెలియ దెవ్వరు నొంటిగొట్టు
పెట్టువోఁతలు మందు ప్రియము దూరంబు
ఈ పిశాచంబుల యేలిక కకట!
నా పట్టి నిచ్చితి నా కర్మవశత
శ్రుతిఁ జతుర్థునకు నేర్పట గాదె తెలిసి
యితనికి నా బిడ్డ నిచ్చుట దెలిసి.

—ద్విపదభాగవతము.

సీ. పరికింప నితఁడు దిక్పాలయశోహాని
కరుఁ డీ క్రియాశూన్యపరునిచేతఁ
గర మొప్ప సజ్జనాచరితమార్గము దూషి
తం బయ్యె నన్నుఁ గతత్రపుండు
మహితసావిత్రీసమానను సాధ్వి న
స్మత్తనూజను మృగశాబనేత్ర
ననలభూసురబంధుజనసమక్షమున మ
ర్కటలోచనుఁడు కరగ్రహణ మర్థిఁ
జేసి తా శిష్యభావంబుఁ జెందు టాత్మఁ
దలఁచి ప్రత్యుద్గతాభివందనము లెలమి
నడపకుండిన మానవీ నన్నుఁ గన్న
నోరి మాటికిఁ దన కేమి గోరవాయె.

సీ. అనయంబు లుప్తక్రియాకలాపుఁడు మాన
హీనుఁడు మర్యాద లేనివాఁడు
మత్తప్రచారుఁ డున్మత్తప్రియుఁడు దిగం
బరుఁడు భూతప్రేతపరివృతుండు
తామసప్రమథభూతములకు నాథుండు
భూతలిప్తుం డస్థిభూషణుండు

నష్టశౌచుండు నున్మాదనాథుఁడును దుష్ట
వ్యాదయుఁ డుగ్రుఁడును పరేతభూని
కేతనుఁడు వితతప్రస్తకేశుఁ డశుచి
యైన తన కొక్క శివనామ మను ప్రవాద
గలిగెఁ గాని యశివుఁ డని కాన కెఱిఁగి
యెఱిఁగి వేదంబు శూద్రున కిచ్చునట్లు. —పద్యభాగవతము.

శ్లో. ఏష మే శివ్యతాం ప్రాప్తః, యస్మిన్ దుహితు రగ్రహీత్
పాణిం విప్రాగ్నిముఖత, స్సావిత్ర్యా ఇవసాధువత్,
గృహీత్వా మృగశాబాక్ష్యాః పాణిం మర్కటలోచనః
ప్రత్యుత్థానాభివాదార్హే వాచాప్యకృతనోచితమ్
లుప్తక్రియాయాశుచయే మానినే భిన్నసేతవే
అనిచ్ఛన్నప్యదాం బాలాం శూద్రాయేవోశతీంగిరమ్,
ప్రేతావాసేషు ఘోరేషు భూతైః ప్రేతగణైర్వృతః
అటత్యున్మత్తవన్నగ్నో వ్యుప్తకేశోహసన్ రుదన్,
చితాభస్మకృతస్నానః ప్రేతస్రఙ్నస్థిభూషణః
శివాపదేశోహ్యశివో మత్తోమత్తజనప్రియః
తస్మా ఉన్మత్తనాథాయనష్టశౌచాయ దుర్హృదే
దత్తాబతమయాసాధ్వీ చోదితోపర మేష్ఠినా.
సంస్కృతభాగవతము.—

పై నుదాహరించిన సంస్కృతాంధ్రగ్రంథభాగములను పరికించినవారికి పద్యద్విపదలయం దైన భాషాంతరీకరణములలోని భేదములు కనుపట్టకపోవు. ఉదాహరించిన గ్రంథములలోఁ దొలుతది కోనేరునాథకవి రచియించిన (ద్విపద) బాలభాగవతము. రెండవది పోతన గారి పద్యకావ్యము. మూఁడవది వ్యాసకృతి యని చెప్పఁబడుచున్న భాగవతము. ఇందు పరికింపవలసిన విషయములలో మూలమునకు సరిగా 'తుచ' తప్పకుండ భాషాంతరీకరణ మున్నదా లేదా యను విషయముకంటె 'ఎవ్వరి భాషాంతరీకరణము ప్రాకృతజనులకు నైతమింపు నింపెడి రచనలతో ముద్దులు మూటగట్టుచు నాచిత్యమును పరిహరింపక, చదువరుల నాకర్షించు నను విషయము ముఖ్యమైనది. ఇచ్చట నింత మాత్రము సహృదయులు పరికించినఁజాలును.

మఱియు, ఈ బాలభాగవతమునందలి కవిత్వపు సొంపుఁ జూపుటకై యందలి యొకటి రెండు ప్రదేశములను దిగ్దర్శనన్యాయమున ప్రదర్శించెదను.

వనవర్ణనము:—

పచరించు కన్నుల పండువు నెలమి
వచటి నైశ్శ్రేయసం బను నుపవనము
పల్లవవిలసనపదము గాకయును
బల్లవవిలసనాస్పద మనఁ బరఁగి
విలసితమధుపాయిసుకృతి గాకయును
విలసితమధుపాయివికృతి నాఁ బరఁగి.

గంగానదీవర్ణనము:—

కమలాధివాసతాకమనీయ యగుచుఁ
గమలలోచనుని వక్షస్స్థలివోలె
నమలకంకణయుక్తహంసక యగుచు
నమరఁ గై సేసిన యతివయు పోలె.

ఈ బాలభాగవతమును రచించిన కోనేరునాథకవి తన గ్రంథమును చంద్రగిరి రా జగు తిరుమలరాజు ప్రోత్సాహము చేత నతని తమ్ముఁ డగు చినతిమ్మరాజున కంకితముగా నొనర్చెను. మఱియు, నీ కవి నన్నయభట్టు తిక్కన భీమకవి మొదలగు నాంధ్రకవులు ప్రబలిన కాలమునందే తన భాగవతమును ద్విపదలతో వ్రాయుటం జేసి అప్పటి సామాన్యలోకమునకు ద్విపదపై నేపాటి గౌరవ ముండినదియు తేటతెల్ల మగుచున్నది. ఈ కవి తా నింతకు మున్ను పద్యకవిత్వమున భాగవతమును వ్రాసియే యున్నను, బాలురను స్త్రీలును సులభముగాఁ జదివి యానందించునట్లు దీనిని వ్రాయఁబూనుకొనుటయు తాను 'విలసితసాహిత్యవిశ్రాంతిమంతుఁ'డు 'వినుతాష్టభాషాకవిత్వప్రచండుఁ' డని ప్రఖ్యాతి గన్నవాఁ డైనను ద్విపదతో వ్రాయఁబూనుటయు ద్విపదకవిత్వమున కానాఁడు గల ప్రజాదరమును తప్పక సూచించుచున్నవి.

ఇఁక మహాకవి వాల్మీకిమునిపుంగవవిరచితరామాయణమును మన యాంధ్రవాఙ్మయమున నేరీతిని ద్విపదకవిత్వమునఁ గూర్చినదియు విచారింతము. అయోధ్యాకాండమునందు రాముని వనవాసము నర్థించు పట్టపుదేవి యగు కైకేయిని దశరథుఁ డాక్రోశించు పట్టును చూడుఁడు.

* కోమలి! కేకయకులమునఁ బుట్టి
ఈ మాట లాడ నో రెట్లాడె నీకు?

* ఉ. వేఁడిన వేఁడి మాట నృపవీరుఁడు నైఁపక కర్ణరంధ్రముల్
సూఁడిన భంగిఁ దాఁకుటయు స్రుక్కి మనంబున నొచ్చి నిన్ను నే
నాఁడు నృపాలపుత్త్రి వని నమ్మి వరించితిఁ గాక యిమ్మెయిన్
నేఁ డొక కాలసర్ప మయి నీ విటు సేయుట నాకుఁ దోఁచెనే?

ఉ. కీడున కోడ కించుకయుఁ గేకయభూపతి యింటఁ బుట్టి చో
ప్పాడక పాపజాతి వయి తక్కట యిట్లని వేఁడ నెట్లు నో
రాడెఁ ద్రిలోకభాఖ్యుఁ డగు నా కొడు కేమిట నీకు నొప్పఁడే
పాడి దలంప కీ పలుకుఁ బల్కితి దోసము నాక వాకడన్.—భాస్కరరామాయణము.

భాస్కరరామాయణము నే నీ వ్యాసమును వ్రాయునాఁటికి లభింపలేదు. కాని, పై నుదాహరించిన పద్యములు ద్విపదలకంటె భిన్నగ నున్న వని విన్నవించెదను.

ఆడవుల పాలు గమ్మని రాముఁ ద్రోయ
నెడపక తొల్లి నీ కెగ్గేమి చేసె?
కౌసల్యకంటె నిన్ ఘనతగాఁ జూచు
నీ సేవ లొనరించు నీ పనుల్ సేయు
నటువంటి సుగుణాఢ్యుఁ డైన శ్రీరాము
నెటులు పొమ్మని యంటివే దయ మాలి?
అడవుల కతని నీ వంపు మటన్న
యెడఁ జూచి చూచి నే నెటులు పొమ్మందు
నృపపుత్రి వని నిన్ను నెమ్మిఁ గైకొంటి
చపలలోచన కాలసర్పంబ వైతి.

రంగనాథరామాయణము.—

పై నుదాహరించిన ద్విపదగ్రంథమునకు మూలభూతము లగు వాల్మీకిరామాయణములోని యీ క్రింది శ్లోకములను చిత్తగింపుఁడు. పిమ్మట మీ మనములకు తనంత తానే రచనాసౌష్ఠవము గోచరింపఁ గలదు.

నృశంసే! దుష్టచారిత్రే! కులస్యాస్యవినాశిని!
కింకృతం తవ రామేణ? పాపే పాపం మయాపివా
సదా తే జననీ తుల్యాం వృత్తిం వహతిరాఘవః
తస్యైవ త్వ మనర్థాయ కింనిమిత్తమిహోద్యతా
త్వంమయాత్మ వినాశార్థం భవనంస్వం ప్రవేశితా
అవిజ్ఞానాన్నృపసుతావ్యాళీ తీక్ష్ణవిషాయథా. —వా. అ.

వాల్మీకిరామాయణమును తొలుదొలుత తెలుఁగు సేసిన కవి ఈ రంగనాథుఁడే. ఈయన పండ్రెండవ శతాబ్దివాఁడని కవిచరిత్రకారుల యభిప్రాయము. రంగనాథరామాయణమును కోనబుద్ధారెడ్డి తన తండ్రి యగు విఠలరాజు పేర రచించె నని ఈ గ్రంథమునందు కనుపట్టునే గాని రంగనాథుఁడు రచించినట్టు లిఖితదృష్టాంతములు గానరావు. అయినను, లోకమునందు రంగనాథరామాయణ మనియే ప్రతీతి కలిగియున్నది. కాని, రంగనాథుని గుఱించిన నైజమగు వార్త యింతటివఱకు నుపలబ్ధి కాకుండుటకై ఆంధ్రులు ఖేదింపఁదగియున్నది. రంగనాథుని గుఱించి పలువిధములఁ జెప్పికొందురు. నన్నయభట్టు రచించు భారతముఁ జూచి తానిఁకఁ బద్యరచనయందు ప్రావీణ్యము గాంచు టరిది యని యధైర్యపడి ద్విపదను రామాయణము రచించినట్టు గొందఱు వాక్రుచ్చెదరు. కాని, యిందుల కేవిధమైన ప్రబలాధారములును గానరాక పోవుట యట్లుండ కావ్య మంతయు కాగడా పెట్టి వెతకినను పైఁ జెప్పిన చొప్పదంటు శంక కెడ మీయఁగల పద మొక్కటి యైనఁ గానరాదు.

పైఁగాఁ గావ్య మంతయు రసోద్బోధకము లగు పదజాలము చేత నెచ్చటఁ జూచిన నచ్చట నింపు వెలయించుచు నన్నయాదులలో లేని యపూర్వవర్ణనాకౌశలమున వెలయుచున్నది. రంగనాథుని రామాయణము ఇప్పటికి నాంధ్రదేశపు పశ్చిమభాగములలో వీథిబడులలో పాఠ్యముగను పండితులకు పురాణపఠనగ్రంథముగను వెలయుచుఁ బూర్వకాలము ప్రజలకీ గ్రంథముపైని అందును ద్విపద కావ్యములపైని గల యసాధారణ మగు ననురాగమును వేయి నోళ్లఁ జాటి చెప్పుచున్నది.

కావ్యమునకు జీవితప్రాయ మగు నౌచిత్యమును గమనించుట లోను ద్విపద యైనను రస ముట్టిపడునట్టును పాత్రలిప్పుడు చదువరుల కన్నుల యెదుట నున్నట్లును వర్ణించు కౌశలము ఈ కవి కున్నట్టులు మఱి యితరులకు లే దనియే చెప్పవలసివచ్చును. ఈ విషయమును సాంతముగాఁ బరీక్షింపఁ దలంచువారు గ్రంథములోఁ దమ కిచ్చవచ్చిన యే భాగమును జదివినను తప్పక కృతార్థులు లయ్యెద రనుటలో సందియము లేదు.

ఇఁక భారతంబును పరామర్శింతము. 'ధర్మశాస్త్రజ్ఞులు ధర్మశాస్త్రం బని యధ్యాత్మవిదులు వేదాంత మనియు' నుపశ్లోకింపఁబడి, ఆర్యవిజ్ఞాననిధి యనఁదగిన దీగ్రంథము. వ్యాసమహర్షి లోకానుగ్రహాకాంక్షచే వేదసారము నిందు వెలయించెను గదా! మహర్షి యొక్క ఇట్టి పవిత్రమగు మనోరథమును ఆంధ్రకవితల్లజులు గమనించి ఆంధ్రమున సామాన్యజనుల కెల్లరకును ఛందముగానుండునట్లు విరచించి నందులకై ప్రతి యాంధ్రుఁడును తప్పక ఋణియై యుండవలసినదే?

సీ. తెల్లంబు గాదె మీ కెల్ల సుయోధను
చేసిన కుటిలవిచేష్టితంబు
లకట మాతో మీరు నడవుల నిడుమలఁ
బొందితి రొక భంగిఁ బోయెఁ గాల
మిది పదుమూఁ డగు నేడు మా కజ్ఞాత
వాసంబు సలుపంగవలయు నిందు
ధార్తరాష్ట్రులు సూతతనయసౌబలులును
చెలుపఁగా వేతురు చిన్న సన్న
యెఱిఁగిరేని చాల నెగ్గు వాటిల్లు న
ట్లగుట మమ్ము నింక నతిరహస్య
వృత్తిమై నిరస్తవిఘ్నులరై చరి
యింపుఁ డని యనుగ్రహింపవలయు. తిక్కన విరాటపర్వము.—

ఇత్యాది పాండవులు అరణ్యవాసకాలమును ముగియఁజేసికొని యజ్ఞాతవాసమున కుపక్రమింపఁబోవుచు నంతవఱకును తమతోఁ గలసిమెలసి తమ కష్టసుఖములఁ బారమార్థికచింతతోఁ బాలుగొనిన బ్రాహ్మణబృందమును వీడిపోవలసివచ్చినందులకు చింతిల్లుచు విడువలేక విడువలేక చివరకుఁ దమ దైన్యమును వెలిఁబుచ్చుచు ననుజ్ఞ నడిగెడి సందర్భము. ద్విపదకావ్యపద్యకావ్యములకు కథానకమున భేదము నంతయైన లేకున్నను, ఈ సందర్భమునందు ద్విపద కావ్యమునఁ గల యీ క్రింది బంతులను విలోకించినచో నిందలి పసందు పొందువడఁగలదు.

ఓ మహాత్ములార! యో పుణ్యులార!
ఓ మహీసురులార! యుగ్రాటవులకు
మామీఁదఁ గృప గల్గి మముఁ గూడి వచ్చి
యలవి సేయఁగరాని యలజళ్ల కోర్చి
కలసియుండితి రింత కాలంబు దనుక
నింక గోప్యము లేల నేఁ డాది మాకు
శంకింప కొక చోటి కరుగంగవలయు
రాయిడి పుట్టించి రారాజు మరల
కే యవస్థలు దెచ్చు టెఱుఁగరే మీరు?
వాఁ డింక నజ్ఞాతవాసంబువలనఁ
బోడిమి మము రోయఁ బుత్తెంచు జనుల,
మీరు మే మెంక చోట మెలఁగఁగాఁ జనదు
మీ రింక మముఁ బాసి మీ త్రోవఁ జనుఁడు,
ఏ కాలమున మిమ్ము నెడసిపోనీక
చేకూఱఁ బరిచర్య సేయుతే దయ్యె.

అర్జునుఁడు విరాటనగరమునందు ఉత్తరగోగ్రహణము జరిగినప్పుడు ఉత్తరుని సారథిఁగా జేసికొని కౌరవుల నెన్నంటుటకై

యుద్యమించి తొలుత వరివ్రాదయనిర్భేదన మగు జీవద త్తమును పూరించినప్పటి సందర్భమును పరిశీలింపుఁడు. ఇచ్చోటఁ బై స్థలము నందుకంటె విస్పష్టముగా నుభయకవితలకు గల తారతమ్యము తనంత తాను తెల్లము కాఁగలదు.

మ. కలఁగెన్ లోయధిస ప్తకంబు గిరివర్గం బెల్ల నాటాడె సం
చలతన్ బొందె వసుంధరావలయ మాశాచక్ర మల్లాడెఁ గొం
దల మందెన్ త్రిదశేంద్రు పట్టణము పాతాళంబు ఘూర్ణిల్లె నా
కుల మయ్యెన్ గ్రహతారకాకులము సంక్షోభించె నవ్వేళయున్.

తిక్కన విరాటపర్వము.—

ఆ మహారవమున నంభోధి గలఁగె
హేమాద్రి శిఖరంబు లిట్టట్టు వడియె
అద్రిజ భీతిల్లి హరుఁ గౌఁగిలించె
నిద్ర మేల్కని శౌరి నింగికై చూచె
బలభేది వెఱచి గీర్వృతి వంకఁ గాంచె
లలిఁ బద్మభవుఁడు కాలము నెన్నఁజొచ్చె
ఉత్తరుండును మూర్ఛ నొరగెను వారలుఁ
నెత్తిన లేవలే కిలపైఁదఁ బడియె.

(ద్విపద విరాటపర్వము.)

మహాభారతమును ద్విపదగా నొనర్చిన కవి తిమ్మకవి. ఈ యన వల్లభనూరికి కొమరుఁ డని గ్రంథాద్యంతముల వాక్యములవలన విశద మగుచున్నది. ఈ కవియొక్క కవిత్వము కొన్ని చోటుల మూలాతిగామి యైనను జాతీయములతో చెలువొప్పుచుండును. కొన్ని చోటుల తిక్కన్న ఫక్కికిఁ గూడ వన్నె పెట్టఁజాలియుండును. అట్టి సందర్భములను పైని ప్రదర్శించియే యున్నాఁడను.

ద్విపదకావ్యములను గుఱించిన ప్రస్తావనను ముగించుటకు ముం దింకొక విషయమును గుఱించి ముఖ్యముగా చెప్పవలసియున్నది. లోతుపాతులకు దిగి పూర్వోత్తరముల విచారణ సేయుటకుఁ గడంగెడి కొలఁదిని ఈ కావ్యములు శైవమతవిజృంభణ కాలమునందు వృద్ధి నొందె నని యనవలసివచ్చుచున్నది. మఱియుఁ బై కారణమే దృఢ మగునది యైనచో తొలుదొలుత ద్విపదయందే యాంధ్రకవితాలత స్వయంభూరూపమున జన్మించి రానురాను గీతములు కందములు సీసములు మున్నగువాని యాధారమున క్రొత్త త్రోవలఁ బట్టి యల్లుకొనియె నని నిశ్చయింపవలసివచ్చును. ఈ మా యూహ కాధారముగ కొందఱు విజ్ఞులు "శివకవులకు నవకవులకు" అను వేమన కందపద్యమునందలి శివకవి శబ్దమునకు శైవకవు లనియు నవకవిశబ్దమునకుఁ బ్రబంధరచయిత లగు కవిజన మనియు నర్థమును చెప్పుచున్నారు. పరికించినచో కవితాభివృద్ధిని మాతృగతి నరసినవారి కియ్యది నిక్క మనియే తోఁచును. కావున, ద్విపదకవితోజ్జృంభణ కాలమునందలి గ్రంథములను సంగ్రహముగాఁ బేర్కొని విమర్శింప వలసియున్నది. శైవసమయమునందు వెలసిన ద్విపదకావ్యము లన్నిఁటిలో బసవపురాణమును పండితారాధ్యచరిత్రము నను నీ రెండు గ్రంథములును ముఖ్యము లైనవి. ఇందు తొలిదానియందు శైవమతోత్పాదకుఁ డగు బసవేశ్వరుని యవతారచరిత్రములు ద్విపదలతో వర్ణింపఁబడినవి. రెండవదానిలో బసవేశ్వరుని శైవమతమును ప్రచారమునకుఁ దెచ్చి భక్తాళి కనేకము లగు మహిమలఁ గనఁబఱచి లోకము ననుగ్రహించిన పండితారాధ్యులవారి విజయమును మతప్రచార మార్గములను దెలుపు విషయములు వర్ణింపఁబడియున్నవి.

ఈ రెండు గ్రంథములు నెక్కడ చూచిన నక్కడ నవరసములు పొంగి పొరలిపోవునంతటి రసోదంచితములుగ ద్విపదలలోఁ గూర్పఁబడినవి. హిమవద్భూధరగుహాగ్రములనుండి యనర్గళముగా దుమికివచ్చెడు గంగాప్రవాహముం బోలె నీ మహామహుని కవిత్వము పాఠకుల మనంబుల నానందపూరమున నోలలాడించుచుండును. భక్తశిరోమణి యగు పోతన్న భక్తిపారవశ్యపు కవిత్వమునకును కవిసార్వభౌముఁ డగు శ్రీనాథమహాకవి నుడికారముల గడుసుతనంపు చిన్నెలకును కర్ణాటరాజ్యరమానాథుఁడు నాంధ్రభోజుఁడు నాంధ్రకవియు నగు కృష్ణదేవరాయమహారాజుల యాముక్తమాల్యద మున్నగు కృతులలోని యద్భుతవర్ణనపటిమ మగు సందర్భములకును, దీనికి దాని కని యేల ఇంతదనుక మన యాంధ్రసారస్వతమునఁ గల హృద్యము లగు రసవద్వర్ణనోదంచితము లగు కావ్యపు మెఱుఁగుల కన్నిటికిని, ఈ రెండు ద్విపదకావ్యములే మార్గదర్శకములై రాజిల్లినవి యనుటలో నేమియు సందియము లేదు. పాఠకుల మనఃపరితృప్తికై పై గ్రంథములలోని యొకటి రెండు సందర్భముల నీ క్రిందఁ బొందుపఱచుచున్నాను.

ఈ క్రింద నుదాహరించిన భక్త్యుద్రేకజనితము లగు పండితారాధ్యుఁ గూర్చిన నుతివాక్యములఁ జూడుఁడు.

చిరతమోగుణపరిస్ఫీతుండు శివుఁడు
వరసత్వగుణవికస్వరుఁడు పండితుఁడు
అసమలోకాధీశుఁ డంబికాధవుఁడు
అసమలోకారాధ్యుఁ డా పండితయ్య
లోకానుసారి త్రిలోచనుం డిల న
లోకానుసారిశీలుఁడు పండితయ్య
అసితకంఠుండు దా నసమలోచనుఁడు
భసితకంఠుండు దాఁ బండితస్వామి
మల్లికార్జుననామి మల్లికార్జునుఁడు
మల్లికార్జునకీర్తి మల్లికార్జునుఁడు.

వెలనాటిచోడుని యాస్థానమున నున్న పండితబృందము పండితారాధ్యుల పాండిత్యప్రకర్షను సహింపఁజాలక యందఱును గలిసి పండితుని వాదమునకు రప్పింపుఁ డని రాజును గోరి యనంతరము తా నొక పెద్ద సభఁ గూర్చి పండితునితో వాదముఁ జేసి యోడిన సందర్భమునందలి యీ క్రింది ద్విపదలు విష్ణుచిత్తీయమునందు విష్ణుచిత్తుఁ డొనరించిన వాదఫక్కిని మీఱి చదువరుల మనంబులకు ప్రత్యక్ష మయ్యెడిని పరికింపుడు.

గరిడి కెక్కిన యంకకాఁడును బోలె,
నెడ విడివడ్డ మత్తేభంబు వోలె
వడి మృగంబులఁ గన్న వ్యాధుండు బోలె
పరఁగఁగ పంతంపు బంటును బోలె
వగవంగ పసి గన్న వ్యాఘ్రంబు వోలె
నాసురవృత్తిఁ గోపాటోపవృత్తిఁ
దై సమయుల సమయాధముఁ జూచి
యొక్కడి వైదికుం డెక్కడి బౌద్ధుఁ
డెక్కడి వైష్ణవుం డెక్కడి జోగి
యొక్కడి చార్వాకుఁ డెక్కడి సాంఖ్యుఁ(డు)

* * * * * * *

ఉర్వీశు పరివార ముర్వీశు బంటు,
లుర్వీశు ప్రజలు నీ యున్నవా రెల్ల
ప్రకటింప వేయు నులక త్రాణ్ణిగాడి

యొక ప్రౌఢ సరి సభ్యుఁ డొకఁడైన వలదె
ఇందుఁ దా సభ యన నెద్ది వినంగ
నిందు సభాపతి యెవ్వండు చెపుఁడు?

ఇంక నీ విషయము నింత జాలించి ద్విపదకావ్యములఁలో లోని మనోజ్ఞవర్ణనములను ఒకటి రెండింటి నుదాహరించి యటుపైని ద్విపదకావ్యములలో రసవంతము లగు కావ్యముల పేరులను మనవి చేయుదును.

వనవర్ణనము:—

దిగ్గున వికసించి తెలు పొందు విరుల
వలుద గుత్తుల నెత్తు వలపుల మించి
నలికంపు పూపలై నలి నొగ లెక్కి
కాయలై పులుసునఁ గరిగట్టఁగలిగి
పాయక ఫలములై పదియారు వన్నె
బంగారు చాయ రాఁ బండిన పండ్లు
పొంగారు కొమ్మల బెంపున విరిగి
వనమహీరుహముల వరుసఁ బెంపెసఁగ.

ఈ వర్ణనము నవనాథచరిత్రమునందలిది. మత్స్యనాథుఁడు మొదలగు తొమ్మండ్రు సిద్ధుల చరిత్రము లిందు వర్ణింపఁబడినవి. ఈ గ్రంథప్రణేత సుప్రసిద్ధుఁ డగు గౌరనమంత్రి.

వర్షబాధ:—

ఫాలలోచను తీవ్రపావకశిఖలఁ
బొగసెడి దిగధీశపురముల నెల్ల
నెగసి భుగు ల్లను నెఱమంట లనఁగ
మెఱపులు తళతళ మెఱయక మున్నె
గుముఱములు పెళపెళ యుఱిమె నయ్యురము
లట మిన్ను తల ప్రొయు సంతఁసు మున్నె
పెటపెట నెటిలి పెన్పిడుగులు వడియె
బిడుగులు నుఱుములఁ బేర్చి వేగమున
బడబడ వడగండ్లు వడియె నెల్లెడల
వడగండ్లకంటెను వాన మున్నాడి
కడవల జలము లొక్కట వంచినట్లు
బోరన గురిసె నద్భుత మైన వాన.

ఇట్టి మనోహరము లగు వర్ణన లెన్నియేని ద్విపదసారస్వత మునఁ గలవు. చరిత్రాత్మకము లగు గ్రంథములలో (1) నవచోళ రాజుల చరిత్రము (2) పాండ్యరాజుల కథలు (3) పతివ్రతల కథలు (4) భళ్లాణరాజు కథ (5) కాటమరాజు కథ (6) కరికాళ చోళకథ (7) ప్రతాపచరిత్రము (8) పెలనాటి విజయము (9) పల్నాటివీరచరిత్ర (10) బొబ్బిలికథ మున్నగు గ్రంథములును, వేదాంత గ్రంథములలో (1) మాయాచిదానందమంజరి (2) ఆత్మైక్యబోధము (3) ప్రభులింగలీలలు (4) రాజయోగామృతసారము (5) తత్వాను సంధానము మున్నగునవియు, పురాణము లగు గ్రంథములలో భారత భాగవతరామాయణములు శివపురాణబసవపురాణములు మున్నగు నవియు మిక్కిలి ప్రముఖము లైనవి ద్విపదకవిత్వమునఁ గలవు. ఇందు గొన్నిటిని (అప్రసిద్ధములై యున్నవానిని) సూక్ష్మముగాఁ బేర్కొని యొండు రెండు బంతుల నందం దుదాహరించెదను:

(1) మాయాచిదానందమంజరి: కృతికర్త నాదెండ్ల యుమాపతి.

నవరత్నకనకాదినవలోహమయము
దివిజదానవయక్షతిర్యఙ్మనుష్య
పశుపక్షికీట విబంధురానేక
విశదరూపవిచిత్రవిస్మితాకరము
సకలవైశిష్ట్య సతత్వైధభాసురము
సకలంకసప్తాబ్ధి యను సరోవరము.

(2) ఆత్మైక్యబోధము: కృతికర్త లింగగురుని శిష్యుఁ డగు యోగానందుఁడఁట.

శ్రీమన్మహాభాగ్యశృంగార మగుచు
నామరూపుల కెల్ల నాటపట్టగుచు
వేదాంతములయందు వివరింపఁబడుచు
నాదాంతమై లోకనాయకుం డగుచు.

*     *     *     *     *     *     *

సకలవేదార్థంపు సారమై యున్న
యకలంక మాత్మైక్య మది విస్తరించి
ఒప్పైన ద్విపదగా నున్న దున్నట్లు
చెప్పితి విబుధులు చిత్తగింపుండు.

(3) లక్ష్మణమూర్ఛ: (ద్విపదశైలి నించుక భేదము గల ఛందము.)

కాఱుటడవులు దాఁటి కాలనే మంతలో
మకరి యున్నా బావి మందటను నిలిచె
మనోవేగము గల మారీచతనయుండు
మాయవనముల మధుమయము గావించె.

(4) ఇంద్రజిద్యుద్ధము:—

ఇంద్రజిత్తుఁడు వీరవిక్రంబునఁ జెలఁగి
రాజసుతుపై నేసె తేజశరములను
హనుమంతుపై నేసె నతిఘోరబాణముల
నక్షయునిఁ ద్రుంచె నను నలుక మదిఁ బూని.

మఱియు పైని పేర్కొనిన గ్రంథములు మాత్రమే గాక గోపీగోపాలసంవాదము, తారాశశాంకము, రంగనమంత్రి రచించిన శివభక్తిప్రదీపిక, నాదెండ్ల గోపప్రధానులచే రచిత మగు కృష్ణార్జున సంవాద మను భగవద్గీతాశాస్త్రము, కాచనకవినాథుఁడు కూర్చిన మైరావణచరిత్రము, కపోతవాక్యములు, చేమకూర అప్పయకవి ప్రణీత మగు సారంగధరచరిత్రము, రత్నాకరము గోపాలకవి యొక్క సౌగంధికాహరణము, పరమానంద ప్రణీత మగు శివజ్ఞానమంజరి, రుక్మిణీ కల్యాణము నలచరిత్ర లను సుప్రసిద్ధ కావ్యములు, యోగానందావధూతవిరచిత మగు గురుశిష్యసంవాదము మున్నగు ననేక గ్రంథములు పూర్వకవులచే లోకానుగ్రహార్థమై ద్విపదలఁ గూర్పఁబడి విరాజిల్లుచున్నవి. ఇయ్యవి ప్రాచీనము లగు పద్యకావ్యములకుఁ గాని ఆధునికము లగు గద్యపద్యోభయకృతులకుఁ గాని ఏ విషయమునను తీసిపోకుండుట మాత్రమే గాక ఆంధ్రులయొక్కయు నాంధ్రభాష యొక్కయు పూర్వపు టున్నతిని వేయి నోళ్లఁ జాటుచున్నవి. కావున, దేశాభిమానులును స్వభాషాభివృద్ధికాంక్షులు నగు నాంధ్ర మహాశయులు జీర్ణము లైపోవుచున్న ద్విపదకృతులను ప్రచారమునకు తెచ్చి యాంధ్రమాతృఋణమును దీర్చి దేశీయుల కృతజ్ఞతాసూచకము లగు వందనముల నభినందింప లయ్యెదరుగాక యని ప్రార్థించుచు నింతతో విరమించుచున్నాఁడను.

Sir K. G. Gupta.



సర్ కృష్ణగోవింద గుప్తగారు.

H. H. The Yuvaraja of Vizianagaram.



విజయనగరము యువరాజుగారు.

Hon'ble T. Rangacharlu.



ఆనరబిలు టి. రంగాచార్యులుగారు.

Mr. Kandi Subba Rao.



కంది సుబ్బారావుగారు.

Mr. N. PATTABHI RAMA RAO.
President, Andhra Conference.



నెమలి పట్టాభిరామారావు పంతులుగారు.
(ఆంధ్రమహాసభాధ్యక్షులు.)

HON'BLE B. VENKATAPATHI RAZU.
President, Andhra Provincial Conference.



ఆనరబిలు భూపతిరాజు వేంకటపతిరాజుగారు.
(ఆంధ్రరాష్ట్రీయసభాధ్యక్షులు.)

Mahatma M. K. Gandhi.



మహాత్మ గాంధిగారు.

Mr. S. Kasturi Ranga Iyyengar.



ఎస్. కస్తూరి రంగయ్యంగారు.

# హిందూ ధర్మశాస్త్రములు

గోబ్బూరు వేంకటరాఘవానంద రావు గారు, బి. ఏ.

ఆంగ్లరాజుల ప్రత్యేకశాసనముల (Charturs) వలన హిందూ దేశమున వివిధరాజధానులలో నెలకొల్పఁబడియున్న ఉన్నతన్యాయస్థానముల (High courts) యందును, వానికి లోఁబడి ప్రతిమండలమునందును ఏర్పఱుపఁబడిన మండలన్యాయస్థానములందును అనఁగా డిస్ట్రిక్టుకోర్టులు సబార్డినేటు జడ్జికోర్టులు మునసఫుకోర్టులు లోనగువానియందును విచారింపఁబడు హిందూప్రజల తగవులలో, వైవాహిక (Marriage) దత్తక (Adoption) రిక్థ వారసత్వ-(Inheritence) స్త్రీధన, వితంతుధన (Widow's estate) సమష్టి కుటుంబక (Joint Family) విభక్తక (Partition) ఋణ (Debts) భరణ (Maintenance) ఉయిలు (Wills) దానధర్మ (Gift religians and endowments) సంబంధము లయిన సివిలు తగవులను పరిష్కరించుటకు అవసరము లైన న్యాయశాస్త్రవిషయములు ఎందెందునుండి కైకొనఁబడుచుండునో అను విషయమునుగూర్చి సంగ్రహముగ నిట వ్రాయుచున్నాఁడను:

1. శ్రుతులు:—ఋగ్యజుస్సామాథర్వణము లను చతుర్వేదములు. వీనియందు ప్రస్తుతకాలమున కనుకూలము లయిన న్యాయవిషయములు బహుస్వల్పముగఁ గలవు. దానినిఁ గూర్చి యీ క్రింద వ్రాయుదుము:

2. స్మృతులు:— శ్రౌతసూత్రములు గృహ్యసూత్రములు ధర్మసూత్రములు ధర్మశాస్త్రములు అని నాలుగు విధములుగ నున్నవి. వీనిలో ధర్మసూత్రములు గద్యరూపమున నే వెలసియున్నవి. ఈ సూత్రకర్తలలో ముఖ్యులు పదునొకండ్రు గలరు. వా రెవ రెవరనఁగా.— 1. గౌతముఁడు, 2. బోధాయనుఁడు, 3. ఆపస్తంబుఁడు, 4. వసిష్ఠుఁడు, 5. విష్ణుఁడు, 6. హారీతుఁడు, 7. హిరణ్యకేశి, 8. ఉశనసుఁడు, 9. యముఁడు, 10. కశ్యపుఁడు, 11. శంఖుఁడు. ధర్మశాస్త్రములు పద్యాత్మకములు. అందు ముఖ్యము లయినవి నాల్గు గలవు. 1. మనుస్మృతి, 2. యాజ్ఞవల్క్యస్మృతి, 3. నారదస్మృతి, 4. పరాశరస్మృతి.

మనుస్మృతి క్రీస్తుశకము రెండు శతాబ్దములకు పూర్వము వ్రాయఁబడె ననియు యాజ్ఞవల్క్యస్మృతియు నారదస్మృతియు నేఁటికి కించు మించుగ 1400 సం॥ల క్రింద వ్రాయఁబడె ననియు పాశ్చాత్యపండితులు కాలనిర్ణయమును చేసియున్నారు. పరాశరస్మృతి కాల మింకను నిశ్చయింపఁబడినట్లు గానరాదు.

బృహస్పతి, కాత్యాయనుఁడు మున్నగు ఋషులచే రచింపఁబడిన ధర్మశాస్త్రములు పై రెండింటియంత ముఖ్యములు కావు. ఇవి క్రీస్తుశక మేడవ శతాబ్దమున రచింపఁబడినట్లు తలంపఁబడుచున్నవి.

పైని వివరింపఁబడిన ధర్మశాస్త్రములే హిందూ లాలోని ధర్మసూక్ష్మములను నిర్ణయించుటకు ముఖ్యముగా నాధారభూతము లయినవి. ఇవిగాక, పరిమాణమునం దేమి, ప్రముఖతయం దేమి, రెండవ పక్షమునకు చేరవలసిన ధర్మశాస్త్రములు మఱికొన్ని అంగీరసాత్రి, దక్ష, దేవల, ప్రజాపతి, యమ, లిఖిత, వ్యాస, శంఖ, వృద్ధశాతాతప లను మహర్షులచే రచింపఁబడినవి.

కాలక్రమమున నీ స్మృతులు సుబోధకములు గాక, దురవగాహములుగ నుండుటచేత వీనికి టీకలును వ్యాఖ్యానములును అవసరము లయ్యెను. మనుస్మృతికి వ్యాఖ్యాకర్తలు, 1. మేధాతిథి, 2. ధారణీధరుఁడు, 3. గోవిందరాజు, 4. కుల్లూకభట్టు, 5. వరరుచి, 6. ధారేశ్వరుఁడు, 7. శ్రీకరుఁడు, అని ఏడుగురు.

1. మేధాతిథి—ఈతను 9-వ శతాబ్దివాఁ డనియు, దక్షిణహిందూస్థానమునకు సంబంధించినవాఁ డనియుఁ దెలియుచున్నది. ఈతని టీక దక్షిణదేశములలో నెక్కడను లభింపలేదు. ఢిల్లీనగరమున కుత్తరముగ యమునానదీతీరమున నున్న కాష్ఠరాజ్య మేలిన మదనపాలునియొద్ద నీ టీక భద్రపఱుపఁబడియుండె, ఇటీవల పరిశోధకులకు లభించెను.

4. కుల్లూకభట్టు: ఈతని వ్యాఖ్యానము సుప్రసిద్ధము. ఈతనినిఁ గూర్చి Sir William Jones గా రిట్లు చెప్పిరి. "It is the shortest but most enmivous, deepest but the most agreeble commentary or any author ancient or modern, European or Asiatic" అనఁగాఁ బ్రాచీనకాలములం దేమి, నవీనకాలములం దేమి, ప్రాక్ప్రతీచీదేశములయం దెచ్చటను, ఏ (మూల) గ్రంధమునకును, ఇట్లు లఘుతమ మయ్యు నింతటి ప్రతిభావంతమై, నింత గంభీరమై యింత మనోజ్ఞమై వెలసిన టీక మఱియొకటి లే దని వక్కాణించియున్నాఁడు.

మననిమిత్తము హిందూ లాను రచించిన మేయో దొరగారు సందేహము గలచోట్ల నెల్ల కుల్లూకభట్టుని వ్యాఖ్యానముల నుల్లేఖము గావించుచు నే యుండును.

2. యాజ్ఞవల్క్యస్మృతి: దీనికి 1. విజ్ఞానేశ్వరయోగి, 2. అపరార్క, 3. విశ్వరూప, 4. దేవబోధ, 5. లక్ష్మీదేవి బాలంభట్టు, 6. విశ్వేశ్వరభట్టు, 7. జీమూతవాహనుఁడు అని వ్యాఖ్యాకర్త లుండిరి. వీని యన్నింటిలో నతి ముఖ్య మైనది విజ్ఞానేశ్వరమహాయోగిచే రచింపఁబడిన వ్యాఖ్యానము. ఈ వ్యాఖ్యానమునకే మితాక్షర మని పేరు. ఈ మహాయోగి విక్రమార్కమహారాజు కాలములో దక్షిణాపథమున నుండె నని తెలియుచున్నది. ఈయన పదునొకండవ శతాబ్దివాఁడు. పద్మనాభ భట్టరు కుమారుఁడు. ఉత్తమపాద గురువరేణ్యుని శిష్యుఁడు. ఈ మితాక్షరబోధిత మైన ధర్మశాస్త్రము సంపూర్ణమై క్రమనిర్మాణము కలదై పరస్పరవిరుద్ధాంశశూన్యమై ఏకత్వము ననుగుణత్వమును గలిగి యొప్పుచుండుటచే 'ఉదయాస్తాచలసేతునగపర్యంతము' భరతభూమియందు అప్రతిహత మైన యధికత నొంది పూజనీయ మగుచున్నది. వంగదేశమునందు మాత్రము జీమూతవాహనకృతము లైన దాయభాగసిద్ధాంతము లంగీకృతములై శిష్టాచారములుగ నభ్యాసములో నున్నచోట్ల మితాక్షరదాయభాగమునకు భేదము గలచోట్లను, మితాక్షరసిద్ధాంతము లమలులో నుండవు. ఈ విజ్ఞానేశ్వరమహాయోగి మితాక్షరమును గూర్చి శ్రీ

కౌన్సిలువారు బుద్ధాసింగు. వి. లాల్తాసింగను గొప్పవ్యాజ్యమునందు (Please see I. L. R. 37 Allahabad 604) ఈతీరున వ్రాసియున్నారు. "మహాత్ముఁడగు యాజ్ఞవల్క్యఋషి మూలగ్రంథము నితఁడు చక్కఁగ విమర్శించి పృథక్కరించి విపులముగ చర్చించును. అందలి గూఢార్థములఁ జేటపఱచును. మూలమునందు విడువఁబడిన విశేషాంశముల నతఁడు పేర్కొని యుదాహరించును. పరస్పరవిరుద్ధములుగఁ గన్పట్టుతావులందు పూర్వీకు లగు ధర్మకర్తల సిద్ధాంతముల నుల్లేఖముఁ గావించి చర్చించి సిద్ధాంతమును చేయుచుండును. ఈతని తర్కపాండిత్యప్రకర్షయును, కుశాగ్రబుద్ధియు నసాధారణము లైనవి.

మఱియు రామచంద్ర వి. వినాయక (42 Calcutta Series) అను వ్యాజ్యమునందు ప్రీవీ కౌన్సిలువారు మితాక్షరమును గూర్చి ఇట్లు చెప్పియున్నారు. "ఈమితాక్షరము యాజ్ఞవల్క్యస్మృతిపై వ్యాఖ్యానముగఁ గన్పట్టుచున్నది. మూలగ్రంథము వ్రాయఁబడినతరువాత వేయిసంవత్సరములకే వ్యాఖ్యానము వ్రాయఁబడినది. అతని పూర్వీకుల ధర్మ (న్యాయ) భావన లాతనివలన విశేషముగఁ బెంపు వడసినవి.

## లక్ష్మీదేవి (బాలంభట్టు) రచిత మైన బాలంభట్టి

ఈ ధర్మశాస్త్రము లక్ష్మీదేవి యను నారీమణిచే రచింపఁబడినట్లు కానవచ్చుచున్నది. పురుషుఁడే యొకఁడు రచించి ఆమెయందుఁ గల గౌరవముచే నామె పేరుఁబెట్టె నని మఱియొక ప్రతీతి కలదు. మితాక్షర మెచ్చోనైన సులభగ్రాహ్యము కాకపోయినను అస్పష్టముగ నున్నను బాలంభట్టి ప్రయోజనకారిగ నుండును. ఇది బొంబాయి కాశీప్రాంతములయందు వాడుకలో నున్నది. విష్ణుస్మృతిపై వ్యాఖ్యానమునకు వైజయంతి యని పేరు. నారదస్మృతిపై నసహాయు లనువారు వ్యాఖ్యానమును వ్రాసియున్నారు.

పరాశరమాధవీయము:—పరాశరస్మృతిపై వ్యాఖ్యానమును వ్రాసి ప్రసిద్ధి చెందినవారు మాధవాచార్యులవారు. ఈతఁడు సకలవిద్యాపారంగతుఁడు. 17-వ శతాబ్దిలో విజయనగరరాజ్య మేలిన శ్రీ బుక్కరాయలయొద్ద ప్రధానమంత్రిగ నుండెను. సకలశాస్త్రములందును కళలందును సమముగఁ బ్రవీణత కలవాఁడగుటచే నీతనికి హిందూదేశపు అరిస్టాటిలు (Aristatll of India) అను ప్రసిద్ధి కలదు. ఇది కేవలము వ్యాఖ్యానముమాత్రమే కాదు. ఒకింతసూచనమాత్రము. మూలమునందుఁ గల ముఖ్యాంశములు పెక్కిందు విపులముగ వ్రాయఁబడి యున్నవి. ధర్మసూత్మము లొక్కసరణి ననుసరించి వ్రాయఁబడి చక్కఁగ పెంపుచేయఁబడియున్నవి. ఈశాస్త్రము చెన్నపురిలో మిగుల పూజ్యతఁ గనుచుండును. పైని వివరింపఁబడిన వ్యాఖ్యానములు గాక స్మృతులం బోలిన మఱి కొన్ని గ్రంథములను కొందఱు ధర్మశాస్త్రవేత్తలు రచించిరి. ఇవి యన్నియు మితాక్షరము తరువాతనే రచింపఁబడినవి. ప్రాముఖ్యతయందుఁ గూడ నివి రెండవ పక్షమునకు చేరినవే యగును. అవి యేవనఁగా:—దేవన్నభట్టు విరచిత మైన స్మృతిచంద్రిక. ఈ స్మృతిచంద్రికకు చెన్నపురిలో మిగుల పూజ్యత యున్నది. మితాక్షర మస్పష్టముగ నున్నచోట్ల స్మృతిచంద్రికయే ముఖ్యాధారముగ నుండును. విశ్వేశ్వరభట్టవిరచిత మైన మదనపారిజాతము కాష్టప్రభు వగు మదనపాలున కంకితముచేయఁబడినది. కాశీదేశములో నిది ముఖ్యధర్మశాస్త్రముగ నంగీకరింపఁబడియున్నది. లక్ష్మీధర రచిత మైన కల్పతరువు గూడ కాశీదేశమునందు గౌరవము నందుచున్నది.

ఖండేశ్వరరచిత మైన వివాదరత్నాకరము మన్నారుమిశ్రకృత వివాదచంద్రికయును వాచస్పతిమిశ్రుఁడు రచించిన వివాదచింతామణియును, మిథిలదేశమునఁ బూజ్యతఁ గనుచున్నవి. వంగదేశమునందు జీమూతవాహనకృత మగు దాయభాగశాస్త్రము ముఖ్యమైన ధర్మశాస్త్రము. దాయభాగ మనుసులలో నుండుచోట్ల మితాక్షరము ప్రమాణము కానేరదు. రఘునందనకృత మైన దాయతత్త్వము కూడ వంగదేశమునందు ముఖ్య మైన ప్రమాణము. ఉత్కలదేశమునందు ప్రతాపరుద్రదేవులు రచించిన సరస్వతీవిలాసము ముఖ్యప్రమాణము. మిత్రమిశ్రకృత మగు వీరమిత్రోదయము ముఖ్యప్రమాణము.

నీలకంఠభట్టవిరచిత మైన మయూఖము గుజరాతులోని ధర్మశాస్త్రములలో నగ్రస్థాన మలంకరించుచున్నది. మితాక్షరమయూఖములకు భేదముగలచోట్ల ఘూర్జరదేశములో మయూఖమే యుత్తమప్రమాణముగ నంగీకరింపఁబడుచున్నది. మఱియు కమలాకరవిరచితము లగు నిర్ణయసింధువివాదతాండవములు పశ్చిమదేశములలో ప్రమాణములుగ సంగీకరింపఁబడుచున్నవి. వరదరాజులు రచించిన వ్యవహారనిర్ణయము చెన్నపురిలో గౌరవింపఁబడుచున్నది. అనంతదేవుఁడు రచించిన స్మృతికౌస్తుభము మహారాష్ట్రులకుఁ బ్రమాణము. 19-వ శతాబ్ద్యారంభమున శ్రీకృష్ణతర్కాలంకారులు రచించిన దాయక్రమసంగ్రహము వంగదేశమునఁ గొంత పూజ్యత నొందుచున్నది. కువేరరచిత మగు దత్తకచంద్రికయు నందపండితులు రచించిన దత్తకమీమాంసయు నను రెండు ధర్మశాస్త్రములును దత్తకవిషయములందు భరతభూమియం దంతటను ముఖ్యప్రమాణములుగ నున్నవి.

మఱియు హీరన్ హేస్టింగ్సు గవర్నరు జనరలుగ నుండిన కాలములో హిందువుల నిమిత్తము వివాదార్ణవసేతు వను ధర్మశాస్త్రమును వ్రాయించెను గాని అది యెవ్వరికిని ప్రయోజనకారి కాదయ్యె. తరువాత సర్ విలియము జోన్సు గారి ప్రయత్నముల వలన జగన్నాథతర్కపంచాననులు వివాదభంగార్ణవమును రచించిరి. వంగదేశమునందు దాయభాగము తరువాత ప్రమాణ మీ గ్రంథమే యని న్యాయమూర్తి మిత్తరు గారు నుడివియున్నారు.

ఇప్పుడు వీని యన్నింటికంటె ప్రధానము లైనవి హైకోర్టుల యొక్కయు ప్రీవీకౌన్సిలు యొక్కయు తీర్పులు ముఖ్యము లగు ప్రమాణములుగ నున్నవి. ఒక కేసు విచారణ జరుగుచున్నప్పుడు హిందూ లా విషయములో ప్రీవీకౌన్సిలువారిట్లు చెప్పిరి. ఫలానా హైకోర్టువారిట్లు చెప్పిరి అనియు ప్రమాణములు నొక్కి చెప్పఁబడునట్లు "మను విట్లు చెప్పెను. యాజ్ఞవల్క్యుఁ డిట్లు చెప్పెను. ఈ సంగతిని పూర్వకాలపు ఋషులు చెప్పలేదు" అను విషయములు నొక్కి వక్కాణింపఁబడవు. అట్టి తీర్పులే అన్నిటికంటె నెక్కుడు ముఖ్యములుగ గన్పట్టుచున్నవి.

# ప్రస్తుతపుటాంధ్రులస్థితి

బి. గురురాజారావు గారు

రాజకీయ సాంఘిక మత దేశాభిమాన శారీరక విద్యాదివిషయములలో ప్రస్తుతపు టాంధ్రుల స్థితి మిక్కిలి శోచనీయ మని చెప్పక తప్పదు. మన ద్రవిడసోదరులు మనలను ప్రత్యేకాంధ్ర రాష్ట్రము కావలయునని యీ జిల్లాలలో ఇప్పుడా మీలో నెవరైన నొకరు 'ఇండియాకౌన్సిలు' సభ్యుఁడుగఁ గాని రాజప్రతినిధి యొద్ద కార్యనిర్వాహకసభ్యుఁడుగఁ గాని, లేనిచో గవర్నరునొద్ద కార్యనిర్వాహకసభ్యుఁడుగఁ గాని లేక జాతీయమహాసభాధ్యక్షుఁడుగఁ గాని చివఱకు భరతఖండమునంగు లేసను బెంపును బొందిన మహనీయుఁడు గాని ఒకఁడైన నున్నాఁడా యని అడిగినచో మనము మిన్నకుండవలసినదే గాని ప్రత్యుత్తరమును పేర్కొనుటకు వీలులేక యున్నది. ఇట్టి శోచనీయ మగుస్థితికి కారణము లేవియై యుండనోపు?

ఆంగ్లేయవిద్యావ్యాప్తికలన నాంధ్ర లోక మెంతవఱకు నజ్ఞానతిమిరమునుండి వెలువడి విజ్ఞానదీప్తిని తమ్ము సార్థకము గావించుకొనుచున్నదో తెలుసు మనము విచారింపవలయు. విద్యయే కదా! నాగరకతకు నాధారము. సంఘమున సభ్యు లెంతటి విద్యాధికులై యున్న నా సంఘ మంత నాగరక మని చెప్పఁబడును. తెలుఁగుదేశమునందు ప్రస్తుతము విద్యాధికుల సంఖ్య యత్యల్ప మనుట సర్వజనవిదితము. ద్రవిడరాష్ట్రమునఁ బల్లె కొందఱో పట్టపరీక్షఁ గృతార్థులైనవా రున్నా రని లెక్కవేయఁబడుచుండ మన సీమలో పట్టణములలో నైన నిందఱు బి. ఏ. లున్నా రని చెప్పుటకు వీలులేకున్నది. పట్టపరీక్షోత్తీర్ణులు లేకున్నను ప్రావేశికపాఠశాలాంత్యపరీక్షలలో నైనను గృతార్థులైన వారిసంఖ్యయైనను అల్ప మనియే చెప్పవలయును. తూర్పుజిల్లాల స్థితిగతులు అనుభవమున లేకున్నను దత్తమండలము లందలి ప్రతికార్యశాఖయందును నరవవారే నిండియున్నారు. 'పబ్లిక్ వర్క్సు'లో, తెలుఁగువాఁడు మందుకైనను దొరకఁడు. 'సాల్టు పోస్టల్, రెయిల్వే రివిన్యూ డిపార్టుమెంటులలో కూడ అయ్యరులే యున్నారు. పదునొకండవశతాబ్దమున నింగ్లాండు నార్మనులు జయించి నప్పు డద్దేశమున నింగ్లీషు పోయి ఫ్రెంచిభాషయే కోర్టుభాషగ పరిణమించినట్లు మన జిల్లాలలో ప్రస్తుతపు టుద్యోగస్థులభాష అరవమై యున్నది. తెలుఁగుదేశమున నందునను ముఖ్యముగ దత్తమండలములలో విద్యావ్యాపక మింత యసంతృప్తికరముగ నుండుటకుఁ గారణములను విచారింతము. ప్రథమమున వారికి విద్యయం దభిమానమే తక్కువ యని తెలియుచున్నది. పిత్రార్జితధనము గలవారు చదువేల యని దలఁచి దుష్టులసహవాసముతోఁ దమ జీవితమును వ్యర్థపఱచుచుఁ బలవంతముగ పాఠశాలల కేగినను నచ్చట విద్యను నేర్వక ఉపాధ్యాయులకుఁ గంటిలోని నలుసులై చరించెదరు. తల్లిదండ్రులు తమ బిడ్డలను మిక్కిలి గారాబమునఁ బెంచి బుజ్జగించుచుండ బాలురకు చదువునం దెటుల నభిలాష పొడమును? ఆలోచింపుఁడు. ఇఁకను ధనహీనులు ఏవిధమున నైన తమ బిడ్డలు చదువరులై తుదకు మెట్రిక్ పరీక్షయం దైనను గృతార్థులైనఁ జాలు నని యువ్విళ్లూరుచుందురు. ఇట్టివారే మన దేశమున నధిక సంఖ్యాకులు. వీరికిఁ గడుపునిండ భోజనము దొరకుటకైన మార్గము లేదు. కుటుంబమున సంపాదకుఁ డొకఁడు తినువా రిరువదియుండి. శూద్రులలో నందఱును కూలినాలిచేసి యైన బ్రతుకఁగలరు. కాని బ్రాహ్మణులైనచో వారికిష్టములగు మేనయే లేదు. వారికి భూసంపద ఉద్యోగము అను వీనిలో ఏదియును లేనియెడల భిక్షాటనమే గతి. ఇఁక వీరిబాలురు పురాణవిద్య నేరీతి నేర్చుకొందురు? ఉన్నతవిద్య నొసఁగు పాఠశాలలు దత్తమండలములఁ గొన్నియే కలవు. కళాశాల దత్తమండలములకెల్ల 1916-వ సంవత్సరము వఱకు మదనపల్లిలో నొక్కటి మాత్రమే యుండెను. సర్కారువారు ఒకకళాశాల ననంతపురంబున నుంచిరి గాని గత సంవత్సర మనిబెసంటమ్మపై గల ద్వేషముచే, మదనపల్లిలో నుండిన కళాశాలకు బహిష్కార మొసంగిరి. జీతము లెక్కువగ నీయవలసి యున్నందున విద్యార్థులకు తమ నివాసస్థలములనే చదువు దుస్సాధ్యముగ నుంటే వారు వేఱొక గ్రామమున కేగుట ఆకాశహర్మ్యనిర్మాణమే యగు. ఉత్తరసర్కారువం దన్ననో విద్యాభివృద్ధికి ఉన్నతపాఠశాలలును కళాశాలలును వలయునన్ని యున్నవి. ప్రజలును నిర్ధనులుగారు. కృష్ణా గోదావరీమండలములు సారవంతములును సస్యసమృద్ధములునై యున్నవి. ఆమండలములఁ బెక్కుమంది రాజులును మహారాజులు నున్నారు. కావున విద్యావ్యాపకమున కన్ని అనుకూలముల నొసఁగూర్పవచ్చును. మహమ్మదీయులు దత్తమండలములను స్వాధీనపఱచుకొని నప్పటి నుండియు నిచ్చటివారి బుద్ధివికాసమును చాకచక్యమును నదృశ్యము లైనవి. తాళికోట యుద్ధమున నణంగిన ఆంధ్రుల బుద్ధివైభవములు నేటిదనుక మఱల మొలక లెత్తలేదు. చెన్న రాజధానిలో నన్ని జిల్లాలును నాగరకతఁ జెందుచుండ దత్తమండలములు మాత్ర మింకను జాల వెనుకబడుచు నితరులచే మిక్కిలి నికృష్టముగఁ జూడఁబడుచున్నవి. ఇట్టితఱి సహృదయులు నుదారమనస్కులు నగు నాంధ్రులయ్యరుల నుండి నేర్చుకొనవలసిన యంశములు పెక్కులు గలవు. వారు జన్మభూమి వియోగమున కోర్చి శీతోష్ణస్థితిభేదము లున్నను సరకుగొనక వేషభాషాచారాదులు క్రొత్తవైనను వాని నతిత్వరితముగ నలవఱచుకొని వంగదేశము మున్నగు దూరదేశములకు సహిత మేగి యచ్చటి ప్రజలను పరిచితులఁ గావించుకొందురు. ఇది మిగుల శ్లాఘ్యము. దూరదేశగమనాభిలాష యుండినందుననే పాశ్చాత్త్యులు సకలఖండములలోను తమ రాజ్యములను స్థాపింపఁ గల్గిరి. ఉత్తరసర్కారులలో కొందఱు వంగరాష్ట్రాదులకు పోయి యచ్చటనే యున్నారని వినుట కెంతయు సంతస మయ్యెడిని. అరవవారి దేశాటనమును బ్రకటింపఁబూనియే షాకిల్టన్ దొరగారు ఉత్తరధ్రువమును గనిపెట్టుటను హాస్యపు కథనుగా, నెవ్వరో కల్పించియుందురు. గాథ యెట్లున్నను దత్తమండలములో విద్యావ్యాప్తి మిక్కిలి హీనదశయం దుండుటవిషయము నిక్కము. చెన్నపురి క్రైస్తవ కళాశాలాధికారులు నయితే మిచ్చటివిద్యార్థులకుఁ బ్రోత్సాహము కలుగఁ

జేయుటకై కొంతకాలమువఱకు బళ్లారి అనంతపురము జిల్లాలకును గడప కర్నూలు జిల్లాలకును కొండుపకార వేతనముల నుంచిరి. ఏకారణముచేతనో 1913-వ సంవత్సరమున వానిని దీసివైచిరి. దొరతనమువా రీవత్సరమున దత్తమండలపువిద్యార్థులలో పదిమందికి వైద్యకళాశాలలోఁ జదువుకొనునెడల జీతము నిచ్చెద మని ప్రకటించిరి. ఐనను దేశీయు లగు ధనికు లుదారమనస్కులై విద్యాదానమును లోపరహితముగఁ జేయు నేర్పాటులు చేయుదాక విద్య మనదేశమున వ్యాపింప నేరదు. సర్కారువారు రాను రాను బాలురకు విద్యార్జనమున కాటంకములను గల్గించుచున్నారే కాని కష్టములఁ దొలగింప నుద్యమింప రైరి. కనుక ప్రజలే యీవిషయమున నెక్కువశ్రద్ధను వహింపవలసి యున్నది. ఇట్టిలోపముల నివారించుటకు మనకు దానకర్ణులని ఖ్యాతివహించిన శ్రీకలవల కణ్ణక్ శ్రేష్ఠి రామానుజం శ్రేష్ఠిగారివంటి మహనీయులు పెక్కుమంది యుండిన గాని కొన్నియేండ్లకైనను మనము కృతకృత్యులము కాఁజాలము.

దత్తమండలములందు ఒక్క హూణవిద్యమాత్రమే గాక సంస్కృతాంధ్రభాషాసంపత్తియును క్రమముగ నదృశ్యత నొందుచున్నది. వైదికవృత్తికి మర్యాద పోయినందున వారును ధనమున్నచో హూణవిద్యకై తమకాలమును గడపుచున్నారు. ఇఁక సంస్కృతవిద్యను అడుగువా రెవ్వరు? భారతీయులు తమబిడ్డల కుగ్గు మొదలుకొని ఇంగ్లీషునే నూరిపోయఁ దలంచెదరే కాని సంస్కృతమును నేర్ప దలంపరు, ఇట్టిస్థితిలో నిఁక తెలుఁ గెవనికిఁ గావలయు? ప్రవేశపట్టపరీక్షాదులయందు మాతృభాష నిర్బంధపాఠముగ నుండవలసిన యవసరము లేకుండుటయు, గోరుచుట్టుపై రోకలిపోటును బోలి గ్రామ్యభాషావాదమిందుపైఁ బయలుదేరుటయు భాషాపాండిత్యము[illegible]ఁగంటి నది. అందఱును తోఁచిన చొప్పున గ్రంథములు వ్రాయ [illegible]దలిడిరి. ఇట్లగుటచేత మాసమున కొక ప్రబంధము పక్షమున కొక నాటకము, వారమున కొక నవల చొప్పున వెలువడుచున్నవి. తక్కిన విషయంబులందువలెనే గ్రంథరచనయందును వార్తాపత్రిక ప్రకటనలయందును దత్తమండలములు ఉత్తరసర్కారులకు మిక్కిలి తీసియున్నవి. తూర్పుజిల్లాలలో గ్రంథమాల లెన్నియో యుండగ పశ్చిమమండలములలో ననంతపురమునందలి బాలభారతీప్రచురములు తప్ప నెచ్చోటను పేరు పొందిన గ్రంథమాలలు లేవు. ఇఁక నుత్తరసర్కారులందు ఆంధ్రపత్రిక, కృష్ణాపత్రిక, ఆంధ్రప్రకాశిక, ఆంధ్రప్రదీపిక, దేశమాత, హితకారిణి, స్వధర్మప్రకాశిని, సావిత్రి మొదలగు దైనికవారపాక్షిక మాసికపత్రిక లెన్నియేని వెలువడుచుండ, దత్తమండలములలో బళ్లారి నుండి వేదప్రదీపిక యను నొకమాసపత్రిక మాత్రము ప్రకటిత మగుచున్నది.

ఆంధ్రులలో సాంఘికదురాచారములు పెక్కులు కలవు. మనదేశములోఁ బురుషులకే తగినంత విద్య లేదనిన నిఁక స్త్రీవిద్య సంతృప్తికరముగ లే దని వేఱుగఁ జెప్ప నవసరము. ఇల్లాండ్రకు బొంబాయి రాజధానిలోనున్న పాఠశాలలలాంటివి మనలో లేకపోవుటయే గాక కన్యకలకైన విద్య నొసగుటకైనను ఏర్పాటు చేసి యుండలేదు. బాల్యవివాహము లింకను యథేచ్ఛముగ జరుగుచుండుటచే బాలవితంతువులసంఖ్య హెచ్చుగనే యున్నది. ప్రస్తుతము వీరివిలాపములఁ జెవినిడువా రొక్కరును గన్పట్టరు. వంగదేశమున నీశ్వరచంద్రవిద్యాసాగరుఁడును ఆంధ్రరాజ్యమున వీరేశలింగముపంతులుగారును బాలవితంతువుల ఘోరకష్టములను గొంతవఱకును శమింపఁజేసిరి. కాని వీరి తరువాత నీమహోత్కృష్టప్రయత్నమునకై తమజీవితములను ధారవోయ నే దేశభక్తుఁడును సాహసింపలేదు. మూఢాచారపిశాచము మనల నింకను బాయకున్నది. నిమ్నజాత్యుద్ధరణ విషయమునను బ్రాహ్మణేతరుల విషయమును ఇప్పు డేమియు మేలుగ లేదు. వైదికబ్రాహ్మణుఁడు మాలవాని నీడ తనపైఁ బడినంతనే స్నానమును జేయుచునే యున్నాఁడు. వైశ్యశూద్రు లెన్నిలక్షల ధనమును సంపాదింపఁగల్గియు నెంతవిద్యాధికులయ్యు, విద్యాగంధములేక సకల దురాచారములకు బానిసలైనట్టి బ్రాహ్మణాధముల సహపంక్తిభోజనమునకైన నర్హులు గాకున్నారు. మఱియు సద్విద్యలేమి దత్తమండలపు మోటుకాఁపులు పాపభీతి నెఱుఁగక తమశత్రువుల నెట్టివారినైనను నిశ్శంకతోఁ బట్టపగలె చంపుచున్నారు. ఇఁక సురాపానవ్యభిచారదేవతలు మనపై నెక్కుచున్నవి.

రాజకీయవిషయములఁ జర్చింప నేనంతఁగాఁ బూనుకొనను గాని ఆంధ్రలోకమునకు సాంఘికవ్యవస్థ కావలయు నన్న తెలుఁగుజిల్లా లన్నిటిలో నైకమత్యమును తొలుదొల్త స్థాపింపవలయు. ప్రత్యేకాంధ్రరాష్ట్రముకై యుత్తరసర్కారువారు ఆందోళనమును చేయుచుండుటయు దత్తమండలములో గొంద ఱాంధ్రప్రముఖులు మనకు వల దనుచుండుటయు నై యున్నది. ఇట్టిస్థితిలో మనయుద్యమము లేరీతి సఫలము లగును? ఆంధ్రమహాసభకు దత్తమండలముల నుండి సభికులను ఆహ్వానించు నాచారమున్నను, మనవారికి నిజముగ నందొకటియుఁ గాబట్టదు. వీరు (అనఁగా దత్తమండలపుఆంధ్రులు) ఇంతదనుక తమకాల మంతయు నేయాటలందో యేపాటలందో గడపుచు దేశహితైకచింత యనుపీడను దప్పించుకొని కూపస్థమండూకములవలె బయట నేమిజరుగుచుండినను లెక్కగొనక యితరప్రాంతములనుండు భారతీయ సహోదరుల విచారింపక తమజీవయాత్రలను గడపుచున్నారు. అయినను ఇప్పు డిప్పుడు వీరును గాఢనిద్రనుండి మేల్కాంచుచున్నట్లు దోఁచుచున్నది ఓదత్తమండలపుటాంధ్రులారా! లెండు మీపైఁ బ్రయోగింపఁబడిన సమ్మోహనాస్త్రమును వీడఁగొట్టుఁడు. అర్థహాని మానహానులకోర్చుచున్న భారతమాతృదీననమును దిలకింపుఁడు. కన్నుల నీరుగుక్కకొనెడి మీయనుంగుతల్లి నోదార్పవలయు నని మీయంతరాత్మ మిమ్ములను బోధించుట లేదా? మీపూర్వికులు విజయనగరాధీశులు దక్షిణహిందూదేశము నంతయు నేకచ్ఛత్రాధిపత్యముగ నేలిన కాలమును మీ రప్పుడే మఱచితిరేల?

పూర్వము ఒకసమయమున మగధరాజ్యమును జయించి ఇంకొకప్పుడు రోమునగరమునకు రాయబారుల నంపి మఱియొకతూరి క్విలక్ లంక మొదలగు ద్వీపాంతరములనుండి కప్పములు గైకొనిన యాంధ్రరాజ్యము నాగార్జునవిద్యారణ్యకృష్ణదేవరాయ తిమ్మయామాత్యాది మహామహులకు జన్మభూమియై ప్రసిద్ధి కెక్కిన యాంధ్రరాజ్యము నేఁడు సర్వవిషయములందును వెనుకంజ వేయుచుండుట విషాదకరము. కావున నీ కళంకమును దొలఁగింపఁ బ్రయత్నించుట ప్రతియాంధ్రునికిని ముఖ్యము.

# విద్యానగరము : రెండవ రాజవంశము

మంచివేముల వేంకటశాస్త్రి గారు, బి. ఏ.

దక్షిణహిందూస్థానమునఁ గల పురాతనస్థలములలో విద్యానగరము కడు ప్రసిద్ధి నొందినది. ఓరుగంటిరాజ్యమున గొంతకాల ముద్యోగులై యుండి, యారాజ్య మన్యమతిస్థు లగు మ్లేచ్ఛుల యధీన మైనప్పుడు కాఁబోలును, హరిహరరాయలు నతని సోదరుఁడును దక్షిణముగ వచ్చి తుంగభద్రానదియొడ్డున నీనగరమును గట్టింపఁ జేసిరి. మహాత్ము లగు విద్యారణ్యుల పనుపున నీపురనిర్మాణము జరిగె నని యొకవదంతి కలదు. కట్టించిననాఁటనుండియు నది దినదినప్రవర్ధమాన మై సమస్తవిద్యలకును సంపదలకు నాకర మై యొప్పుచు వచ్చెను. విద్యారణ్యుల ప్రోత్సాహమున నిర్మింపఁబడుటచే నయ్యది విద్యానగర మాయె నని వాడుక కలదు. క్రమముగ నెల్ల విద్యలకు నాకర మగుచు వచ్చుటచే నాపురమునకీ నామధేయము సార్థకము. కారణ మేదియైనను, నిరంతరమును కనకవృష్టిని గురియించుచు, నాంధ్రకవిభూజములు చిగురించి పుష్పించునట్లు చేసి, యాంధ్రభోజుఁ డనుపౌరుషనామము నొందిన కృష్ణదేవరాయల కాలమున నది నిశ్చయముగ విద్యానగరమే! నానాఁట జరిత్రలలోను పుక్కిటి పురాణములలోను పడి, విద్యానగరమే విజయనగరముగ మాఱియుండును. విద్యాపుర మని యాకాలమునఁ బిలువబడెననుటకు, ప్రసిద్ధులైన కవీశ్వరుల ప్రబంధములే చక్కని నిదర్శనములు. నంది తిమ్మనార్యుఁడు "విద్యాపురమ్మునఁ గైకొని నిజప్రౌఢి నెఱపె" నని కృష్ణదేవరాయల పూర్వుఁ డగు నరసరాజును వర్ణించెను. మఱియు నీనగరమును గుఱించిన గాథ లన్నియును జక్కఁగ బరిశీలించి చూడఁగ, విద్యారణ్యుల కీపురముతో నేదో సంబంధము కల దనియును పైని సూచింపఁబడిన విధమున విజయనగర మను పేరు క్రమముగ దానికి వచ్చినట్లును నమ్మఁదగి యున్నది.

అట్టి విద్యానగరమును తమకు రాజధానిగాఁ జేసికొని, మూఁడు రాజవంశములు విజయనగరసామ్రాజ్యమునుఁ బరిపాలించినవి. అందు మొదటివంశమునకు హరిహరరాయలు మూలపురుషుఁడు. అతఁ డారాజ్యమును క్రమముగ దక్షిణహిందూస్థానమం దెల్ల విస్తరించునట్లు చేసి క్రీ॥ శ॥ 1336 సం॥ నుండియు రాజ్యపరిపాలనముఁ జేయుచుండెను. ఈ వంశము రమారమి నూటయేఁబది యేండ్లు ప్రభుత్వము నొంది, చివఱకు మిగిలిన రాజశేఖరుఁ డతిదుర్బలుఁడును, విషయాసక్తుఁడు నగుటచేఁ బదభ్రష్టత్వము నొందెను. ప్రజలహితము నొక్కింతయును గుర్తెఱుఁగక పరిపాలన చేయుచుండుటచే, నతని యుద్యోగులును బ్రజలలోఁ బ్రధానులు నేకీభవించి, రాజశేఖరుని రాజ్యమునుండి తొలఁగించిరి. అతని సేనానాయకుఁ డగు నరసింహరాజును బట్టాభిషిక్తునిఁ గావించిరి. ఇది సరి కాదనియును, నరసింహుఁడే తన యజమానుని యయోగ్యతను బ్రకటించి, క్రమముగా రాజ్యభారముఁ బూనుకొనియె ననియు, నందుకు ప్రజలు విధిలేక సమ్మతించి రనియును మఱికొందఱు చెప్పుదురు. ఏకారణమున నతఁడు రాజ్యభారము నొందినను నరసరాజు కాలమున విజయనగరము నేలుచుండె ననుట నిర్వివాదాంశము. విజయనగరచరిత్రను వ్రాసిన న్యూయెల్ దొరవారు, వీనిని సాళువ నరసింహరాజనియు, నీవంశస్థుఁ డగు తిమ్మరుసు కృష్ణదేవరాయలకు మంత్రిగా నుండె ననియును వ్రాసిరి. ఈ నరసింహరాజే రెండవవంశమునకు మూలపురుషుఁ డని వ్రాయుచు, రెండవ వంశక్రమమును దెలుపు నీపట్టిక నొసఁగిరి.

| | |
|---|---|
| 1. నరసింహరాజు. | క్రీ॥ శ॥ 1490—? |
| 2. నరస, లేక, వీరనరసింహరాజు. | ?—1509 |
| 3. కృష్ణదేవరాయలు. | 1509—30 |

దీనినిఁ బట్టి చూడఁగా నీరెండవవంశపురాజులు 1490 నుండియుఁ బరిపాలించుచుండినట్లు తెలియుచున్నది. మొదటివంశమునఁ జివఱకు నిలిచియున్న రాజశేఖరుని నంతమొందించియో, లేక ప్రజల యనుమతినో రాజైన నరసింహుఁడు క్రీ॥ శ॥ 1487న రాజ్యమునకు వచ్చెను. వీ రిరువురు నొక్కరే యనియును ఆమూఁడు సం॥లును మొదటి వంశస్థుల పేరనే రాజ్యము పరిపాలింపఁబడుచుండె ననియును పట్టికలో వారు సూచించినకాలము నుండియే రెండవ వంశము పరిపాలింప మొదలిడె ననియును దొరవా రూహించిరి. రాజశేఖరుని వెనుక రాజ్యభారమును బూనిన నరసరాజు సాళువవంశస్థుఁ డనియు, నతఁడే రెండవ వంశమును స్థాపించె ననియును వీరు చెప్పుట సందర్భముగఁ గానరాదు. ఏల యనఁగా కృష్ణదేవరాయల యాస్థానకవి యగు పెద్దన తన యజమానుఁడు తుళువ వంశస్థుఁ డని వ్రాసియున్నాఁడు. రెండవ వంశము తుళువవంశ మని పెద్దన వర్ణించుచుండఁగా నీవంశమునకు సాళువ నరసరాజు మూలపురుషుఁ డెట్లగును? మఱియును దొరవారి పట్టిక ననుసరించినచో నతని వంశమునఁ గృష్ణదేవరాయలు మూఁడవపురుషుఁడుగాఁ గనఁబడును. 'ఆంధ్రకవితాపితామహుఁ' డని చిరకీర్తి నొంది, రాయల యాస్థానమున గల యష్టదిగ్గజములలోను మేటియైన పెద్దన తన మనుచరిత్రమును రాయల కంకిత మొనరించి, కృతిపతివంశమును వర్ణించుచు నిట్లు వ్రాసెను. రాయలు తుళువవంశస్థుఁ డనియు నా వంశమునకు తిమ్మరాజు మూలపురుషుఁ డనియు తిమ్మరాజున కీశ్వరరాజును ఈశ్వరరాజునకు నరసవిభుఁడును తిమ్మభూపతియును నను కుమారు లిరువురు కలిగి రనియును వ్రాసెను. ఆ నరసింహవిభుని

కుమారు లిరువు రైనట్లు ఈ క్రిందిపద్యమునఁ దెలిపెను.

గీ. ఆ నృసింహప్రభుండు తిప్పాంబవలన
నాగమాంబికవలన నందనులఁ గాంచె
వీరనరసింహరాయ భూవిభుని, నచ్యు
తాంశసంభవుఁ గృష్ణరాయక్షితీంద్రు.

వారిలో వీరనరసింహరాయఁడు మొదట పరిపాలించె ననియు నతని వెనుక కృష్ణదేవరాయ లధిపతి యాయె ననియును వ్రాసెను. నరస రాజునకు కృష్ణదేవరాయలతల్లి యగు నాగమాంబ ధర్మపత్ని కా దనియు, నా కారణమున రాయలు దాసీపుత్రుఁ డనియును జాల కాలమువఱకును గొంద ఱూహించుచుండి రఁట! ఆకాలమున రాజులకు బహుళముగఁ గళత్రస్వీకార మొనరించు వాడుక యుండుటచే నిది యెంతయు విశ్వసనీయము కాదు. కృష్ణదేవరాయ లధిపతియై రాజ్యభారమును బూనుకొనిననాఁటనుండియు విజయనగరము రామ రాజ్యమై యుండె నని పెద్దన వర్ణించెను. పెద్దన వ్రాసినతీరున వంశ వృక్షము నీ క్రిందివిధముగ వ్రాయఁదగును.

(1) తిమ్మరాజు.
|
(2) ఈశ్వరరాజు (బుక్కమాంబ)
|
(3) నరసరాజు — తిమ్మరాజు
|
తిప్పాంబ = | = నాగమాంబ
(4) వీరనరసింహరాజు. (5) కృష్ణదేవరాయలు.

ఈ వంశవృక్షమునఁ గృష్ణదేవరాయ లైదవపురుషుఁ డైనట్లు కనఁబడుచున్నది. కావున దొరగారిప్రకార మతఁడు మూఁడవపురుషుఁ డా? లేక పెద్దనప్రకార మాతఁ డైదవపురుషుఁడా? అని చూడవలసి యున్నది. ఇప్పుడు మనము చూడవలసినసంగతులు రెండు: 1 రెండవ వంశమునకు మూలపురుషుఁడును రాజశేఖరుని వెనుకనే పరిపాలన మును బూనినయతఁడు నొక్కఁడా? అయిన నతఁడు సాళువవంశ జుఁడా? కాఁడా? 2. రెండవవంశమున కృష్ణదేవరాయలు, దొరగారు వ్రాసినట్లు మూఁడవపురుషుఁడా? లేక పెద్దనవ్రాసిన ట్లైదవపురు షుఁడా? అను ప్రశ్నములకు సమాధానమును చూడవలయును. రాజ శేఖరుని యనంతరము రాజ్యభారముఁ బూనిన నరసరాజు సాళువవంశ స్థుఁ డని దొరగారు వ్రాసిరి. అట్టి నరసరాజునకుఁ గృతి యీయఁబడిన జైమినిభారతమునందు—

... ... ... ... జగద్వ్యాపారలీలావతా
రాలంకారవిహారి శౌరి సదయుండై సాళ్వగుండక్షమా
పాలాగ్రేసర నారసింహుని నదభ్రశ్రీయుతుఁ జేయుతన్.

—అని వ్రాయఁబడి యున్నది.

ఇతఁడే దొరవారిచే నిరూపింపఁబడిన నరసరాజు. ఇతని వంశ మునసే మంత్రి తిమ్మరుసు పుట్టెను. సాళువ నరసింహరాజు ఒకఁడు కలఁడు; గాని, యతఁడే రెండవ వంశమునకు మూలపురుషుఁ డైనట్లు కనఁబడదు. పెద్దన తన విభుని వంశము తుళువాన్వవాయ మనియు, నందు తిమ్మరాజు మొదటివాఁ డనియు వ్రాసినట్లు చూచియుం టిమి. పరిశీలనఁ జేయఁగా నీ తిమ్మరాజును జైమినిభారతమునకుఁ గృతిపతి యగు సాళువనరసింహరాజును సహోదరు లైనట్లు కనఁబడి నది. కృతిపతి వంశమును వర్ణించుచు, జైమినిభారతకర్త యగు పిల్లలమఱ్ఱి పినవీరభద్రకవి —

ఉ. ఆమహితానుభావునకు నా సుచరిత్రకు నుద్భవించి రు
ద్దామయశోధనుల్ విజయధాములు విక్రమభీము లాహవ
స్థేములు సార్వభౌములు ప్రసిద్ధులు తిమ్మనరేంద్రచంద్రుఁడున్
శ్రీమదహోబలేశ్వర నృసింహుని యంశమునన్ నృసింహుఁడున్.

—అని వ్రాసెను.

ఈపద్యమున నరసరాజునకు జ్యేష్ఠభ్రాతయగు తిమ్మభూపతిని పేరునకుమాత్ర ముదాహరించెను; కాని యాకవి యతనిఁగుఱించి యిం చుకేనియు విశేషముగ వ్రాయలేదు. పెద్దనార్యుఁ డీ తిమ్మభూపతినే రెండవవంశమునకు మూలపురుషుఁ డైనట్లు వ్రాసియుండు నని యూ హింపఁదగును. ఇది యొకవిధముగ మన సందేహమునకు సమాధానము కాఁగలదు. సాళువ నరసింహరాజున కితఁ డన్న యగుటచేతను, తిమ్మ భూపతి వేరొకవంశమునకు మూలపురుషుఁ డగుటచేతను, వీ రిరువురు (నరసరాజులు) నొక్కరే యని తలఁచుట కవకాశము లేదు.

ఈ సాళువ నరసింహరాజు రెండవవంశమునకు మూలపురు షుఁడు కాఁడని స్పష్టముగఁ గనఁబడును. పెద్దనార్యుఁడు రాయల వంశమునంతను వర్ణించెనే కాని, యందెవ్వరికాలమున వీరు విజయనగర రాజ్యమునకు ప్రభువు లైరనియును, నెవరెవ రెంతెంతకాల మెచ్చట నేలినదియు నించుకేనియు వ్రాయఁబూనఁడు. రాయలకు పూర్వులగు నలువురును రాజులై విజయనగరము నేలిరా? అని సందియము పొడము చున్నది. ఈవిషయమున నాకాలపు కవులలో మఱి కొందఱియభి ప్రాయముఁ గనుఁగొనవలయును. రాయల యాస్థానమున నాకాలము ననే యుండి ప్రకటయశుఁడగు నంది తిమ్మనార్యుఁడు పారిజాతాప హరణ మను ప్రబంధము నొకదానిని రచించి దాని నాయన కంకిత మొనరించెను. కావున, తన కృతిపతి వంశానుక్రమణికను దెలుపుచు నతఁ డీవిధముగ వ్రాసెను. పెద్దన తన ప్రభువంశమును తిమ్మరాజుతో మొదలుపెట్టెను. నంది తిమ్మనార్యుఁ డామార్గము నంటియే వ్రాసెను గాని యతనికుమారుఁ డీశ్వరరాజుతోఁ బ్రారంభము చేసెను. ఈశ్వర రాజు కుమారుఁ డగు నరసరాజును వర్ణించుచు తిమ్మకవి—

సీ. ఎవ్వానివిజయంబు లెఱిఁగించు శాసన
స్తంభంబు లాశాంతశైలవితతు
లెవ్వాని యరిగాపు లేపారు కాళింగ
యవనాదివివిధదేశాధినాథు
లెవ్వాని నిత్యదానైకవిలాసంబు
లాయాధతరతులాపూరుషంబు
లెవ్వాని చిరకీర్తి యింద్రలోకాంగనా

భోగినీగీతికాభోగపదము
వాఁడు పొగడొందు సర్వసర్వంసహాధి
దేవతాముఖదర్పణ విజయనగర
భద్రసింహాసనస్థుఁ డున్నిద్రతేజుఁ
డీశ్వరాధిపు నరసపృథ్వీశ్వరుండు.

అతఁడు విజయనగరసింహాసనస్థుఁ డని వ్రాసెను. తత్పూర్వ మావంశమునఁ జనించిన యీశ్వరనరసింహుఁ డనురాజు, పరాక్రమవంతుఁ డనియును, ధీవిశారదుఁ డనియును, కరుణారసపూర్ణుఁ డనియును, రణవీరుఁ డనియును మాత్రము వర్ణించెనే కాని, యతఁ డేరాజ్యమును గాని పరిపాలించినట్లును, ఎచ్చటనైన శిలాశాసనము లున్నట్లును గాని వర్ణింపలేదు. దీనినిఁబట్టి చూడఁగ నీశ్వరరాజుకుమారుఁ డగునరసరాజు విజయనగరమును బరిపాలించుచుండె నని నిశ్చయముగఁ గనఁబడుచున్నది. ఇట్లు నిశ్చయించినచో, స్యూయెల్ దొరగారు వ్రాసిన పట్టిక ననుసరించుటకు కూడ, మనయూహ సరిపడును. ఏది యెట్లున్నను, నరసరాజు సాళువవంశస్థుఁడు కాఁడు. సాళువనరసరాజున కీరెండవవంశపు నరసరాజు సహోదరుని మనుమఁడు. దొరగా రీవిషయమున మాత్రము పొరపాటు పడిరి. కావున రెండవవంశస్థులకు నరసరాజుకాలముననే రాజ్యాధిపత్యము లభించియుండును. దీనిని సమర్థించునట్లు వెనువెంటనే తిమ్మకవి—

సీ. కుంతలేశ్వరుఁడు పిక్కువడంగ విద్యాపు
రంబుఁ గైకొని నిజప్రౌఢి నెఱపె
పారసీకునకు దుర్భరమానవత్వంబుఁ
దొలఁగించె మానవదుర్గసీమఁ
జోళవల్లభునకు సురవధూమధురాధ
రము లిచ్చి మధురాపురంబు గొనియె
శ్రీరంగపట్టణసీమ ఖడ్గవటీవి
నోదంబు యావనేంద్రునకుఁ జూపె

గీ. నతఁడు నతికెక్కె రాయసేత్వంతరాళ
కలితషోడశదానవిఖ్యాతయశుఁడు
మండలీకరమేఘమార్తాండబిరుదుఁ
డీశ్వరాధిపు నరసపృథ్వీశ్వరుండు.

అని నరసరాజు విద్యాపురమును గైకొనినట్లు రూఢిగ వ్రాసెను. కావున నతనికాలముననే వారు విజయనగరమునకు ప్రభువులైరని తెలిసికొనఁగలము. మిగిలినవంశము నంతను పెద్దనవలెనే ఇతఁడును వర్ణించెను. కృష్ణరాయల దిగ్విజయమును గుఱించి, ఇరువురును ప్రౌఢమార్గములనే వర్ణించిరి.

పైని జరిగిన చర్చవలన సందియము లన్నియును దీరినవి. కాని మొదటివంశము ననుసరించియే మూఁడు సంవత్సరములవఱకు (1487-90) పరిపాలించిన సాళువనరసరాజునకుఁ గుమారులు లేరా? కలరా? ఉండినచో నీరెండవవంశమున కెట్లు రాజ్యము వచ్చియుండు నని సందేహము తోఁచును. సాళువ నరసరాజు తనమరణసమయమునఁ గుమారు లిరువు రుండినను, వారు బాల్యదశయం దుండుటచేఁ, దనయన్నమనుమఁ డగు నరసరాజునకు వారిని రాజ్యము నొప్పఁజెప్పె ననియును, వారిబాల్యము దీరునంతకు తానే రాజ్యాధిపతియై యుండి, పిదప వారిని బట్టాభిషిక్తులఁ జేయు మనియును గోరె నఁట! అందుకుఁ సమ్మతించి నరసరాజు, వారిలో నొక్కని రాజ్యమున కధిపతినిఁ జేసి పట్టాభిషేకముఁ జేయించె నఁట! కాని యతఁ డెవ్వనివలననో చంపఁబడఁగా, నరసరాజు రెండవవానిని రాజుఁ జేసె నఁట! తనయన్నను జంపిన ద్రోహి నితఁడు చేరఁదీసినట్లు తెలిసికొని, తుళువనరసరాజు తనప్రతాపమును జూపి, వానిని బందిఖానలో వేయించి, రాజ్యాధిపత్యము నొందెనఁట! ఇట్లు రెండవవంశము వారు రాజ్యారూఢులైరనియును, నరసరాజు స్వామిభక్తిపరాయణుఁడై యుండెననియును నవీనచరిత్రకారులు కొందఱు వ్రాయుచున్నారు.

# శమదమాదుల మహిమ

కాశీనాథుని వీరేశలింగము అయ్యవారు

మానవుఁడు తనకుఁ గల యంతర్బహిశ్శక్తుల నుపయోగించుటకు ఇంద్రియములు ముఖ్యములు. శమదమము లింద్రియనిగ్రహసాధనములు. శమదమములు దేహమనస్సంబద్ధములు. దేహము ప్రత్యక్షము. మనస్సు పరోక్షము. మనస్సత్తావలన బహిరింద్రియములకు సమర్థత కలుగుచున్నది. ఈ విషయము ప్రతివ్యక్తికిని సహజము. ప్రతివాని హృదయమునందును లీనమైయున్న శక్తిలో ప్రతిశకలమును మనస్సుద్వారా ప్రభవించి విరాడ్విశ్వరూపునందు సంకలితమై దేశకాలాదులచే పరిణామదశను పొంది వ్యక్తమగుచుండును. అందువలన కించిజ్ఞుఁడైన ప్రతిజీవియును అనుకూలప్రతికూలముల వలన సుఖదుఃఖముల ననుభవించుచుండును. దేహమనఃపాటవములు గల పురుషుని వికాసమున కాద్యంతము లుండవు. ఆ పురుషుని భుజబలమునకు, బుద్ధిబలమునకు, ఆత్మజ్ఞానమునకును ఒరులు తీసిపోదురు. ఇట్టివాఁడే స్థితప్రజ్ఞుఁడు. స్థితప్రజ్ఞుఁడు ఏమాత్రమును లోపములు లేక తాను మార్గములను దెలిసికొని నడచి ఒరుల నడిపింపఁగలఁడు. అందుకు తగినబోధను జేయగలఁడు. యార్యుల సాంప్రదాయధర్మము లివియె. హింద్వార్యులు నాగరకు లయ్యును, దేహాలంకరణాదుల కనువగు రత్నకాంచనాంబరాదివిభవసాధనమును నిరంకుశాధికారమును నిచ్చెడి సామ్రాజ్యములను సైతము శమదమాదుల మహిమచే తుచ్ఛసుఖము లని త్యజించి నారచీరలు మున్నగువానిని విభవములుగ పరిగణించి స్వాత్మానందము నొంది లోకరక్షణార్థ మనేకమార్గములను ప్రదర్శించిరి. ఇట్టివారే మహనీయులు. వీరిహృదయము లతిగంభీరములు. ఊహ లుదారములు. చర్యలు విచిత్రకరములు. ఆ మహామహులు వేదశాస్త్రపురాణేతిహాసాదులలోని సాంప్రదాయముల ననువదించి శిష్యులకు సదాబోధించెడి ఆచారము పూర్వము కలదు.

శ్లో. శమో దమ స్తప శ్శౌచం క్షాన్తి రార్జవ మేవచ
జ్ఞానం విజ్ఞాన మాస్తిక్యం బ్రాహ్మ్యం కర్మ స్వభావజమ్.

అనునట్లు భారతవర్ష పురాజు లనేకు లీధర్మము నాశ్రయించి సత్పరిపాలకులై స్వరాష్ట్రమును కాపాడుకొనుచు జనుల న్యాయధర్మమార్గముల నడిపించిరి. రాజు సత్పరిపాలకుఁడై కృషివాణిజ్యాది వృత్తుల నేర్పఱచి "చాతుర్వర్ణ్యం మయాసృష్ట" మను న్యాయమున యుగధర్మముల ననుసరించి చతుర్వర్ణములను కాపాడవలయును.

మానవుఁడు బాల్యమునుండియే ఐహికవిద్యతోఁ బాటు శమదమాదుల కనువై నైతికమార్గములను తెలుపగలిగిన ఆధ్యాత్మికతత్త్వపుధర్మములను సైతము మన పూర్వులు బోధించుచుండెడివారు.

వేదచోదితము లగు కర్మల గుఱించి వారు త్రొక్కిన మార్గములు నేఁడు మృగ్యము లైనవి. (1) అక్షరాభ్యాసము:— అక్షరాభ్యాస మనఁగ "క్షరస్సర్వాణి" అను శ్లోకము ననుసరించి అక్షరుఁ డనెడి కూటస్థుఁడు పరమాత్మస్వరూప మని గుర్తెఱుంగుట యని వారి యభిప్రాయము. ప్రణవసహిత మైన పంచాక్షరిని ('ఓం నమశ్శివాయ' అనెడి మంత్రమును) బాలురకు విద్యాభ్యాసకాలమందే 'సిద్ధం నమః' అనెడి వాక్యరత్నములతో నుపదేశించుచుండెడివారు. (2) ఉపనయనము:— ఉపనయన మనఁగ జ్ఞాననేత్ర మని వారి తాత్పర్యము. చర్మచక్షుస్సులచే ప్రపంచకము అందఱకును తెలియుచునే యుండును గనుక జ్ఞానచక్షుస్సుచే తద్విలక్షణ మైన స్వరూపమును గుర్తెఱింగించుట కిట్లు ఏర్పఱుపఁబడినది. అధ్వర్యుఁడు బ్రహ్మోపదేశమును చేయుటయును శ్రోత తెలిసికొనుటయును పూర్వపు టాచారములు. ఇప్పు డావిధు లుండినను నామమాత్రములుగ నున్నవి. ఇంద్రియాదులకలన ఆత్మకు స్వప్రకాశత కలదు. ఆత్మ తాను ప్రకాశించి సమస్తేంద్రియములకును ప్రకాశము నిచ్చుచున్నది. ఆత్మ ఆనందస్వరూపమున నున్నది. "ఆనందో బ్రహ్మేతి వ్యజానాత్" అని శ్రుతికలదు. జీవసముదాయమునకు స్వానుభవమువలన జీవాత్మ కల దని చెప్పవచ్చును. విషయేంద్రియసన్నికర్షమున జ్ఞాన మేర్పడుచున్నది. జీవాత్ముఁడు విషయజ్ఞానమును భావించి కర్మేంద్రియములద్వారా వెలిబుచ్చుచుండును. ఇది అందఱకు తెలిసినదియే! కనుక ఇంద్రియార్థసన్నికర్షలో విషయానందము పొందక బాహ్యవిషయము మనకు గోచరించుచున్నను నిర్విషయానందము నొందవలసియుండెను. 'యద్దృశ్య' మను ప్రమాణముచొప్పున దృశ్యపదార్థము నశించును. సత్పదార్థము నశింపదు. ఇట్టి మార్గముల నన్వేషించుటకై ఆర్యులు బాల్యమునుండియే ఇంద్రియములు మనస్సు బుద్ధి ఆత్మానందమును జేరుటకు ప్రాణాయామము మొదలుగాఁ గల విధుల నలవరించియుండిరి.

ప్రతిమానవుఁడును ప్రాణాయామాదుల నొనర్చుకొలఁదిని అంతరింద్రియ దృష్టి వికసింపవచ్చును. పిమ్మట రేచక పూరక కుంభకాదు లలవడును. అందువలన వాయునిరోధన మేర్పడును. మూలాధారాది షట్చక్రములును తద్వర్ణములను అధిదేవతలను హంసప్రచారమును గుర్తెఱింగి ప్రణవమే హంసస్వరూపమని శివస్వరూప మని తెలియవలయును.

హంసమున్నగు పర్యాయనామములతో నొప్పుచుండెడి ఆ పరతత్త్వమును శమదమాదులమహిమచే దెలిసికొని ఈజీవాత్మ నా పరమాత్మయం దైక్యము నొందింపవలసియుండును. ఇట్టి యోగి మహత్త్వములను ప్రదర్శించుటయును కలదు. మన నవనాగరకులు ఏ ఖండాంతరవాసులో వచ్చి మెస్మరిజములను ప్రదర్శించిన భ్రమించుచున్నవారే కాని మన గ్రంథరాజములందుఁ గల విశేషములను గుర్తించుటకు ప్రయత్నింపరైరి. కావున మన మార్యసంతతివార మైనందులకు శమదమాదుల నలవఱచుకొనుటకు ప్రయత్నపడవలయును. ఇట్టి బాధ్యత భారతీయులందఱకును కలదని సూచించుచున్నాను.

శమదమాదుల మహిమచే నరుఁడు ధీరుఁడును శూరుఁడును కాఁగలఁడు. ధీరుఁడై సేనాని కావచ్చును. జ్ఞానియై ఆచార్యుఁడు కావచ్చును. వివేకసామరస్యాదులచే భక్తుఁడు కావచ్చును. ప్రజ్ఞావంతుఁడైన నరుఁడు మౌనియై సిద్ధుఁడై తుదకు శివుఁడు కాఁగలఁడు.

The Sixth Andhra Conference, Cuddapah.

ఆఱవ ఆంధ్రమహాజనసభా ప్రతినిధులు, కడప.

Prof. K. Ananda Rao.



కె. ఆనందరావుగారు.

Mr. N. S. Venkaramaiah.



ఎన్. ఎస్. వేంకట్రామయ్యగారు.

Rao Saheb Sithapathi Pantulu.



రావుసాహెబు సీతాపతి పంతులుగారు.

Hon'ble C. P. Ramaswamy Iyyer.



ఆనరబిల్ సి. పి. రామస్వామి అయ్యరుగారు.

T. Vijayaraghavacharlu



టి. విజయరాఘవాచార్యులు గారు.

Garden Party To Their Excellencies.



గవర్నరు దంపతులకు తోటవిందు.

Arrival of Their Excellencies.



గవర్నరు దంపతుల ఆగమనము.

Rangoon Andhra Mahajana Sabha.



రంగూను ఆంధ్రమహాజనసభ.

# ఆంధ్రభాషాభిమానశాఖావిద్యార్థులయవస్థ.

వన్నాల సత్యనారాయణ గారు

మన మాతృభూమి యైన యీ యాంధ్ర దేశము మన ప్రభువు లగు బ్రిటిషువారికి 1758-వ సంవత్సరమున వచ్చినది. 160 సంవత్సరములనుండి వారిచే బరిపాలింపఁబడుచున్నది. మన యాంధ్ర దేశమే బ్రిటిషు పరిపాలనము క్రిందికి వచ్చిన మొట్టమొదటి రాష్ట్రము. మొట్టమొదటనే వచ్చి పూర్తిగా 160 సంవత్సరముల నుండి పరిపాలింపఁబడుచున్న మన దేశపు విద్యార్థుల కష్టములఁ గొన్నిటి నైనఁ బాపుట యుక్తము.

సామాన్యమును ప్రయత్నముచే సులభసాధ్యము నయిన యొక కష్టమును దొలఁగింపఁజేయు మని వేడుటయే ప్రకృతమున నీ వ్యాసోద్దేశము. ఆ కష్టమేది యన: అభిమానశాఖల (Optional Groups)లో మూఁడవ గుంపు (Group III)లోని దగు మాతృభాష తోడిదగు నింగ్లండు చరిత్రతో సమ మైన విలువ గలదిగాఁ జూడఁబడక పోవుటయే.

ఉద్యోగాదికముల కుపయోగించు రాజభాష (ఇంగ్లీషు) ముఖ్యము గాన ముఖ్యస్థానము నలంకరించుచున్నది. దానితోఁడి భాగములోనివగు సామాన్యగణితమును (Elementary Mathematics) దేశభాషావ్యాసరచనయు (Vernacular Composition) రాజభాషకుఁ గ్రింది వగుటచే పైదాని సాయము బడయుట యుక్తము. అంద అన్ని విషయములఁ బ్రవీణు లగుట దుర్లభము. కాన నభిమానశాఖాపద్ధతి సమంజసము.

భాషాచరిత్రల కన్యోన్యసంబంధ మెక్కుడు కావున నవి యొక గుంపు (Group III) లో నుండుటయు దగినదే. రాజభాషావిషయ మంతయు ముఖ్యభాగము (Group A) లో నుండుటచే నీ యభిమానశాఖలో మాతృభాష యుండవలసివచ్చెను. మాతృభాషకును మాతృదేశచరిత్రకును చాల సంబంధ మున్నను, నవీనులచే దేశభక్తిని పురికొల్పునట్లు వ్రాయఁబడని హిందూదేశచరిత్రకంటె రాజభక్తిని కలుగఁజేయునదియు గవర్నమెంటువారి సేవఁ జేయ ననుకూలించునదియు బ్రిటిషుజాత్యభివృద్ధిక్రమమును వారి నాగరకతాగ్రగణ్యతఁ జూపు పార్లమెంటు విషయమును తెలియఁజేయునదియు నగు నింగ్లండుచరిత్ర మభిమానశాఖలో నుండుట శ్రేష్ఠతరము. ఇప్పు డభిమానశాఖలో మాతృభాషయు నింగ్లండుచరిత్రయు నుండుట యర్హము.

ఆ రెంటికిని సమానమైన విలువ యుండవలెనా? అక్కఱ లేదా? ఇప్పు డెట్లున్నది? అను విషయములను చూతము. 1918-వ సంవత్సరము నవంబరు ఫోర్టు సెంటు జార్జి గెజెట్టు (Fort St. George Gazette) ను పట్టి చూడఁగా నింగ్లండు చరిత్రకును మాతృభాషకును సమాన మైన విలువ లేదని ఉండఁగూడ దని ఈయ రని తెలియుచున్నది. కళాశాలలోఁ జనుటకుఁ దగినవానికిగల పద్ధతులు ఇవి. (S. S. L. C. Public Examination).

(1) మొదటి రెండు గుంపులలో నేదో యొక దానిలో 40 గుణములును (Marks) రెండవదానిలో 35 గుణములును వచ్చినవాఁడు కృతార్థుఁడు. మూఁడవ గుంపులో నన్ననో మాతృభాషలో 35 గుణములు వచ్చినను ఇంగ్లండుచరిత్రలో 40 గుణములు వచ్చితీరవలయును.

(2) మొదటి రెండు గుంపులలో నే 'సబ్జక్టు'లో నైన 35 గుణములకుఁ దక్కువ వచ్చిన రెండవ సబ్జక్టులో 40 కి పైని తక్కువకు రెట్టింపు గుణములు వచ్చినవాఁడు కృతార్థుఁడు. మూఁడవ గుంపులో నన్ననో మాతృభాషలో 35 కుఁ దక్కువ వచ్చినచో, ఇంగ్లండు చరిత్రలో 40 గుణములకుఁ బైని ఆ తక్కువ గుణములకు రెట్టింపు వచ్చినవాఁడు కృతార్థుఁడు. ఇంగ్లండు చరిత్రలో 40 కి పొల్లుపోయిన విద్యార్థికి వాని వత్సరత్రయక్లేశము నష్టము; బూడిదలోఁ బోసిన పన్నీరు. భాషలో నెన్ని గుణము లెక్కువ వచ్చినను కప్పిపెట్టికొనవలసినదే.

(3) మొదటి రెండు గుంపులలో దేనిలోనో యొక దానిలో "ప్రెసిడెన్సీ ఏవరేజి"కిఁ బైఁగ 5 గుణములును తక్కినదానిలో ప్రెసిడెన్సీ ఏవరేజియు వచ్చినవాఁడు

కృతార్థుఁడు. మూఁడవ గుంపులోనో మాతృభాషలో ఆ "ఏవరేజి" వచ్చినను ఇంగ్లండు చరిత్రలో ప్రెసిడెన్సి ఏవరేజికి పైని 5 గుణములు వచ్చి తీరవలయును. (4) హెచ్చుతగ్గుల విషయము (2) లో వలెనే,

ఇట్లు మాతృభాష ఇంగ్లండు చరిత్రకంటెను తక్కువగాఁ జూడఁబడుటకుఁ గారణ మేమియో? 'ఇంటర్మీడియేటు'లో మూఁడవ గుంపులో చరిత్రభాగ మెక్కువ యగుటచే "స్కూల్ ఫైనలు" చరిత్రవిషయము కట్టుదిట్టముగా నుండవలె నని కొంద అనవచ్చును. కాని, అందులోని భాషాభాగ (Language Group) విషయమో! చరిత్ర సాయముచే స్కూలుఫైనలులోఁ గృతార్థు డైన విద్యార్థి భాషాభాగమును దీసికొని యందుఁ బండితుఁడు కాఁగలఁడా? స్కూలు ఫైనలులో నించుక మాతృభాషా సాహాయ్యముతో రాజచరిత్రలోఁ గృతార్థుఁడు చేయఁబడఁదగినవాఁడు, ఇంటర్మీడియేటులో భాషాభాగము నైనఁ దీసికొనఁదగఁడు?

మొదటి రెండు గుంపులలో నొక సబ్జక్టులోని తక్కువ గుణములకు రెట్టింపు గుణములు రెండవ సబ్జక్టులో వచ్చిన సరిపోవుచుండఁగా, మూఁడవ గుంపులో చరిత్రలోఁ గొద్ది గుణములు తక్కువ వచ్చిన, తక్కువకు, పది రెట్లు గుణము లైనను గూడ మాతృభాషలో వచ్చిన సరిపోవదా? మాతృభాషాభిమాన శాఖావిద్యార్థి యవస్థ యింతయేనా?

ఇదియే దేశములోని యనేకవిధము లైన యాందోళనములకుఁ గారణము. జాతీయవిద్య కావలయు నని కోరుటకుఁ గారణము. జాతీయవిద్యావాదుల రుజువులఁ బట్టి మాతృభాష యగ్రస్థానము నలంకరింపవలయు నని తెలియుచున్నది. వారి వాదములఁ జూచిన మాతృభాష రాజభాషతోఁ గాని అథవా ఇంగ్లండు చరిత్రతోఁ గాని సమాన మైన స్థానమున నుండఁదగిన దని ప్రతివానికిని నచ్చకపోదు. దేశీయులకును ముఖ్యముగా విద్యార్థులకును నష్టదాయక మగు మాతృభాష విలువ యొక్క తక్కువను బోఁగొట్టఁ బ్రభువులును సమర్థులును నతివినయమునఁ బ్రార్థితులు.

తరువాత మాతృభాషను రాజభాషతో సమాన మైన స్థితికిఁ దీసికొనిరావలయును. అనఁగా, మాతృభాష నభిమానశాఖనుండి తొలఁగించి ముఖ్యశాఖ (Group A) లో నున్న మాతృభాషను రాజభాషతో సమ మైన విలువ గలదానినిగాఁ జేయుట. రాజభక్తిని బురికొల్పు నింగ్లండుచరిత్రతోఁ బాటు దేశభక్తిని పెంచు దేశచరిత్రయు మూఁడవ గుంపులో నుండవలెను.

క్రిందటేటివఱకు దేశచరిత్రలో నేదియో యొక భాగము అనవసరశాఖ (B Group) లో నుండెడిది. క్రిందటేఁడా దేశచరిత్రను భూగోళశాస్త్ర (Geography) చిత్రలేఖనము (Drawing)ల తోఁ బాటు లాగివేసినారు. ఇప్పుడు, దేశచరిత్రకు మా ఱెండు (B Group) గూడ ఇంగ్లండు చరిత్రయే చెప్పఁబడుచున్నది. దేశభక్తిని పెంచలేని దేశచరిత్రకంటె నభిమానశాఖకు సంబంధించిన ఇంగ్లండు చరిత్ర కుపకరించు రాజ చరిత్రమే లాభకరము.

జాతీయవిద్యకొఱకు వాదించువారి కిది యొక యాధారము. దేశభక్తిని గల్గించు దేశచరిత్రను చెప్పితీరవలయు నని వారి వాదను. ఇదియే చాలమంది విద్యార్థుల యసంతుష్టికిఁ గారణము. "ఆల్ఫ్రెడు" "హెన్రి ది సెకండ్సు" "ఎడ్వర్డు ది ఫస్టు" "హెన్రి ది ఫిఫ్తు" మొదలగువారలఁ గుఱించి చదువునపు డింగ్లీషువారి కెట్టి దేశభక్తి కలుగునో చంద్రగుప్తుఁడు అశోకుఁడు విక్రమార్కుఁడు శ్రీహర్షుఁడు మొదలగువారిని గూర్చి చదువునపుడు గూడ హిందువుల కట్టి దేశభక్తినిఁ గల్గించు దేశచరిత్రలు వ్రాయించి అట్టి దేశచరిత్రలను పఠనీయ గ్రంథములుగాఁ బెట్టించి ఇంగ్లండు చరిత్రతోఁ బాటు దేశచరిత్రయు సమముగాఁ జూడఁబడిననే ఈ జాతీయ విద్యాందోళనలు ఉపశమించును. ప్రజల మనములకు సంతుష్టియుఁ గలుగును.

మధ్యేమార్గమున మొట్టమొదట ఇంగ్లండు చరిత్ర మాతృభాషల సమత్వమును తరువాత మాతృభాషా రాజభాషల సమత్వమును మాతృదేశచరిత్ర రాజదేశచరిత్రల సమత్వమును స్థాపించి సామ్రాజ్య శాంతిని గలుగఁజేసినట్లు ప్రజలకు మనశ్శాంతినిఁ జేయఁ బ్రభువులను సమర్థులను భక్తితోఁ గోరుచున్నాను.

# ఐరోపా సంగ్రామము

## 1918 సంవత్సరము

లోకస్వరూప మేక్షణమునందు మారునో గుర్తించుట సాధ్యము కాదు. కాలప్రవాహమునం దెన్నియో యవాంతర సంఘట్టనము లగోచరములుగ జరిగిపోవుచుండును. మానవాతీతమైన భావాంతరసంఘట్టనములకు 1918-వ సంవత్సరము ప్రబలనిదర్శనముగ నుండును. సంవత్సరారంభము నందు అంధకారబంధురమై యుండిన లోకవ్యవస్థ సంవత్సరాంతమునందు నూతన తేజముతో ప్రకాశించెను. ఏనిమిదిమాసము లెడ తెఱపి లేకుండ బ్రహ్మాండముగ జరిగిన సంగ్రామ కోలాహలమునుండి ధర్మదేవత యావిర్భవించి క్రమముగ స్థూల దృష్టికి ప్రత్యక్షమయ్యెను. కాలగతి నెఱుగను సంవత్సరాదియందు నిరూపింపలేక పోయిరి కాని నూతనయుగానుకూలమైన పరిమార్పు వేసవికాలమునందు ఏర్పడినప్పుడు రణవ్యవస్థయందు విజయచిహ్నములు విజ్ఞులకు గోచరములయ్యెను. పీడ యతిశయించినకొలదిని ప్రజల ధర్మదీక్ష ప్రకాశింపకమానదు. లోకమునందు దాస్యవినాశమునకును స్వాతంత్ర్యవిజయమునకును తార్కాణమై వెలయుచున్న 1918-వ సంవత్సర చారిత్రమునందు ప్రజలకు సంభవించిన సుఖదుఃఖములలో నీశ్వరసంకల్పమే దృశ్యమగుచుండును. రణరంగమునం దావిర్భవించిన ధర్మదేవత భావప్రవంతియందే క్రీడించుచుండ లోకమునందు క్షుద్బాధయు, వ్యాధిపీడయు విచ్చలవిడిగ విహరింపసాగినవి. రణసంజాతమైన నూతనయుగధర్మము సర్వదేశములకు వ్యాపింపక పోయినను విషజ్వర మన్నిదేశములందు ప్రవేశించి కోట్లకొలది ప్రజల నెత్తుకొనిపోయెను. క్షామముచేతను, జ్వరముచేతను బాధపడనిదేశమే లేదు. సంవత్సరముపొడుగునను ప్రజలు కష్టములనే పొందుచుండిరి. మానవంతుల ప్రజలు వారినన్నిటి నోర్చుకొనిరి. యుగసంధియందు గోచరించు దుర్భరదశ శాశ్వతము కాదని 1918-వ సంవత్సరము వ్యక్తపరచెను. రణస్థితియందు నూతనశక మారంభమగుట తోడనే యేండ్లును పూండ్లును పట్టునని భావించిన కార్యసంసిద్ధి క్షణములో సంభవమయ్యెను. దుర్భేద్యములైన నిరంకుశవ్యవస్థలు శీఘ్రముగ నశించుట కారంభించెను. రాజ్యములు విచ్ఛిన్నము లయ్యెను; రాజులు పతితులైరి. స్థిరపాలనముల కాకరములైన దేశములందు పరివర్తనమునకు సులువేర్పడెను. రాజులు, రాకొమారులు దేశభ్రష్టులై యన్యదేశములకు శరణాగతులైరి. ఒకమాసములో ఓడలు బందీలైనవి. నందు ఓడలైనవి. రాజుల భాగ్యభోగము లెంత యస్థిరములో క్షణ క్షణము వ్యక్తమగుచుండెను. నవంబరు 11-వ తేదిని రాద్రము ముగించెను. ఆనాటితో రాజులనిరంకుశప్రభ యస్తమించెను. మానవుల భాగ్యదశయం దరుణోదయ మయ్యెను. ధర్మసంస్థాపనమునకు చేసిన త్యాగ మగణితమైనను మిత్రమండలి నాల్గేండ్లనుండి పడిన క్లేశము ఫలించి మిత్రరాజ్యములు సుఖపడుటకు వీలుకలిగెను. ప్రజలకు కలిగిన ఈతిబాధలవలనే 1918-వ సంవత్సరము చారిత్రమునందు సుప్రసిద్ధముగ నుండగలదు. అంతకంటెను మించినది మరియొకటికలదు. రుష్యాదేశమునందు తలయెత్తిన "బోల్షివికు" ఉద్యమము లోకకంటకముగ పరిణమించుట గొప్ప విశేషము. అంటు జాడ్యమువలె నది ఆదేశ మంతట వ్యాపించెను. ఇతరదేశములకు వ్యాపించునని భీతికూడ కలిగెను. వ్యక్తిస్వాతంత్ర్యమున కుండవలసిన అధికార మొప్పుడా దేశమునందు నశించెనో అప్పుడే రుష్యారాజ్య మల్లకల్లోలమై పోయెను. ఆ యల్లకల్లోలము 1918-వ సంవత్సరమునం దతిశయించి ప్రజలు బాధపడిరి. శత్రురాజ్యములందు రాజ్యాధికారము సడలి అరాజకము వృద్ధియయ్యెను.

### సంగ్రామదశ

పందొమ్మిది వందల పదునెనిమిదవ సంవత్సరారంభమునందు సంగ్రామదశ విషమముగ నుండెను. ఉభయపక్షములును తమ బలాబలములను కనుపరచవలసిన తరుణ మాసన్నమయ్యెను. రుష్యారాజ్యము రణరంగమునుండి నిర్గమించుటయు 1917 సంవత్సరాంతమునందు ఇటలీ దేశమునకు కలిగిన పరాభవమును శత్రువునకు తాత్కాలికముగ కొంతబలము కలిగించెను. ఆంగ్లపరాసు సేనలు ఇటలీవారికి పరాజయము కలుగకుండ కాపాడి శత్రువుల యత్నమును భగ్నపరచెను. ఇటలీదేశమును సంహరించి వేసవికాలములో ఆంగ్లపరాసుల తాళము పట్టవలయునని శత్రువు సంకల్పించెను. సంవత్సరారంభమున శత్రువు తిరిగి ఇటలీరంగమున విజృంభించునను భయముండెను. ఇటలీరంగ మప్పటి కింకను దుర్బలముగనే యుండెను. తురుష్కరంగమునందు జరూసలెము పట్టణము ఆంగ్లులకు స్వాధీనమగుటవలన రణస్థితి మిత్రమండలి కనుకూలముగనే యుండెను. కాని రుష్యా యుద్ధమును మానివేయుటవలన మెసపొటేమియాయందు ఆంగ్లసైనికపార్శ్వము సురక్షితముగ నుండలేదు. అక్కడి స్థితిగతులు నిలుకడగ లేనందున ముందు జరుపవలసిన విజయయాత్రకు ధైర్యము చాలకుండెను.

యుద్ధారంభమునుండియు శత్రువుల దృష్టి యేమి మిత్రమండలి దృష్టి యేమి పశ్చిమ రంగముమీదనే ప్రసరించుచుండెను. ఉభయసేనలలో చాలభాగ మారంగమునందే యుండెను. ప్రచండ యుద్ధము లక్కడనే జరుగుచువచ్చెను. రణవీరులు తమ శౌర్యము నక్కడ ప్రకటించుటయే యదృష్టమని భావించుకొనుచుండిరి. మతి యే రంగమునందును జరుగని ప్రబలయత్నములు పడమటిరంగము

నందే జరిగినవి. రుష్యాముఖమునందలి తన యక్షౌహిణీసేనలను శత్రువు మరలించి పడమటిరంగమునందు నిలువజేసెను. శత్రువు తనకు తాత్కాలికముగ గలిగిన సైనికబలాధిక్యముచే విజయయాత్ర కుపక్రమింపఁదలచెను. రణోపక్రమణతంత్రము శత్రు హస్తగత మయ్యెను. మిత్రమండలి కాలవిలంబముకొఱకు రక్షణతంత్రము నవలంబింపవలసి వచ్చెను. యుద్ధావసానదశకు వారు నిరీక్షించి తమ బలము నప్పుడు వినియోగించి శత్రువు నోడించుటకు సకలప్రయత్నములను చేసిరి. 1918 వ సంవత్సరమునందు మిత్రమండలి పడమటిరంగమునందు రక్షణతంత్ర మవలంబించి శత్రుబల ముడిగిన వెనుక అమెరికాసేనల సాహాయ్యముచే 1919 వ సంవత్సరములో అవస్కందన మారంభింపవచ్చునని రణతంత్రజ్ఞులు భావించిరి. కాని మానవబుద్ధి కగోచరముగ ఈశ్వరోద్దేశము నడచుచునే యుండెను.

## జర్మనుల యవస్కందనము

మిత్రమండలి తలచినట్లే జర్మనులు పడమటి రంగమునందు దారుణసంగ్రామము నారంభించిరి. విజయమును పొందిన, 1918-వ సంవత్సరములోన మెరికా సేనలు రాక పూర్వము పొందవలయు ననియు లేదా, యుద్ధమునకు జలాంజలి వదలవలయు ననియు జర్మనులకు తెలియును. వా రందున కెంత ప్రయత్నముచేయుటకు సాధ్యమగునో అంత ప్రయత్నమును చేసిరి. నాల్గువత్సరములనుండి యుద్ధములో వారికి కలిగిన యనుభవమును వారు సార్థకపరుచుకొనిరి. కాంబ్రెయి యుద్ధమునందు కలిగిన ప్రత్యేకానుభవమును వారు మఱచిపోలేదు. సూచీముఖవ్యూహమునందలి లోపములను నివారించికొని యుద్ధారంభమునందే అపరిమితముగ విజృంభించి భేద్యమైన తన సేనాముఖమును శత్రువు క్రమ్ముకొనుటకు వీలులేకుండ జేయుటయే జర్మనులు తలపెట్టిన నూతనతంత్రమునందలి ప్రధాన విషయము. లూడెన్డ్రాఫ్ సేనాని నూతనతంత్రము ననుసరించి సైనికులకు శిక్షణ మిప్పించెను. రుష్యాముఖమునుండి మఱలించిన యోధుల కనుదినమును నూతనతంత్రానుకూలముగ రణనీతిని నేర్పిరి. కేవలము శత్రుసేనాముఖమును భేదించుటకే చాల సైనికులను శిక్షించిరి. భేదితమైన సైనికముఖమునుండి నిర్గమించి యుద్ధము చేయుటకు ప్రత్యేకసైనికుల నియమించిరి. దీని కంతకును లూడెన్డ్రాఫ్ సేనాని కారకుడని చెప్పుదురు. ఏది యెట్లుండినను జర్మనులు విజయప్రాప్తికై పడమటిరంగమునందు తమ సర్వస్వమును నొడ్డిరని చెప్పక తప్పదు.

సెయింటు క్వెనిటను ముఖమునందు జర్మనులు మార్చి 21-వ తేదిని అవస్కందనమును ప్రారంభించిరి. ఆంగ్ల ఫరాసు సేనలను వేరుపఱచి సమయానుకూలముగ నొకరి తరువాత నొకరిని సంహరించుట జర్మనుల సంకల్పమని చెప్పుదురు. ఆంగ్ల ఫరాసు సేనల కూడలిస్థానము సెయింటు క్వెనిటను పట్టణమునకు దక్షిణభాగమునందు కలదు. అక్కడనే యుద్ధము ప్రారంభ మయ్యెను. అక్కడ ఆంగ్లసేనాముఖము మొదటిరోజున చీలిపోయెను. ఫరాసు సేనలు వచ్చి చీలిపోయిన ముఖమును వెనుకనుండి క్రమ్ముకొనెను. 21-వ తేదీ మొదలు మార్చి నెలాఖరువఱకును క్రమక్రమముగ యుద్ధము అమీన్సు పట్టణమువఱకును వ్యాపించెను. సేనాముఖముఁ గ్రమ్ముకొని యుద్ధము సాగు నిమిత్తము ఆంగ్ల, ఫరాసులు, సెయింటుక్వెనిటను, పెరోను, బాపాము, నాయను, మాంటిడిడరు పట్టణములను, సోమునదీ ముఖమును త్యజింపవలసి వచ్చెను. అమీన్సు పట్టణముమీద జర్మనులు శతఘ్నులను ప్రయోగించుచుండిరి. సోమునదీతటమునుండి విశాలమైన లోయ నిర్గమించుచున్నది. దానికి అమీన్సు పట్టణము రక్షణస్థానముగ నుండెను. దానిని జర్మనులు వశపఱచుకొనినయెడల ఉత్తరదక్షిణ పార్శ్వము లందలి మిత్రమండలి సేనలకు సంయోగము నశించియుండును. రానురాను జర్మనులకుట్టడి చప్పపడి సైనికనష్టము వృద్ధి యగుచుండెను. అమీన్సు పట్టణప్రాప్తికై సర్వసేన నొడ్డుటయా, సేనాముఖమునందలి మఱియొక ప్రదేశమునం దవస్కందనము ప్రారంభించుటా యను సమస్య జర్మను సేనానికి గోచరించెను. అమీన్సు పట్టణముకొఱకు యుద్ధముచేసి సైనికనష్టమును పొందుచు జర్మనులు ఆంగ్లముఖమునందు ఆర్మెంటీర్సు,లాబాసీల మధ్య నూతనావస్కందనము ప్రారంభించిరి. తత్ఫలితముగ న్యూషాపెలుపట్టణమునొద్ద సేనాముఖమును వారు భేదింపగలిగిరి. కాలే మున్నగు రేవుపట్టణములను పట్టుకొనుటకు జర్మనులు సంకల్పించియుందురు. 1914-వ సంవత్సరములో వైప్రెసు యుద్ధము లిందుకొఱకే జరిగినవి. ఆంగ్లు లప్పుడు జర్మనులయెత్తు నెంతమాత్రము సాగనియ్యలేదు. జర్మనుల నూతనయవస్కందనమువలన యుద్ధమునందు విషమస్థితి యేర్పడెను. ఆ విషమస్థితియందు ఆంగ్లసేనాధ్యక్షుడు సర్ డగ్లసు హేగు, ఆంగ్లసేనలకు పంపిన సందేశప్రభావము నెవరు వ్యక్తపరుపగలరు? జర్మను సేనలను ఆంగ్లఫరాసులు నివారింపగలిగిరి. వైప్రెసు పట్టణమునకు తూర్పుభాగము నందు గతవత్సరములలో ఆంగ్లులు పట్టుకొనిన ప్రదేశమును త్యజింపవలసివచ్చెను. న్యూఇగ్లిసు, పట్టణమును, కెమ్మెలు కొండను జర్మనులు పట్టుకొనిరి. వైప్రెసుపట్టణమునుండి సేనలను మఱలించుకొని వెనుకకు పోవుటకు ఆంగ్లులు ముందుగనే కట్టుదిట్టములను చేసికొనిరి. అమీన్సుముఖమునందువలెనే వైప్రెసు ముఖమునందును జర్మనులయెత్తు సాగిరాలేదు. గ్వెన్షి పట్టణమును ఆంగ్లు లద్భుతపరాక్రమముతో సంరక్షింపగలిగిరి. ఫూర్మెజిలు, వైప్రెసు దక్షిణప్రాంతములందు జర్మనులను ముందుకు కదలనియ్యలేదు. అంతలో ఫరాసులు వచ్చి తోడ్పడిరి.

శత్రువున కింకను విజయము కలుగుచునేయుండెను. అమీన్సు, ఆర్మెంటీర్సు ముఖములందు ప్రయోజనము లేనప్పుడు శత్రువు షామిన్-డి-డేమ్సు ముఖమును ముట్టడించెను. జర్మను లామార్గమును పట్టుకొని ఎయిను వీశెలునదులను దాటి క్రమక్రమముగఁ బట్టుదలతో యుద్ధము చేయుచు మారనునదిని సమీపించి పశ్చిమైల్ల ముఖమునందు నదినిదాటి షాటోతియరీ, డార్మనుల మధ్యను గల ప్రదేశము నాక్రమించుకొనిరి. రీమ్సు పట్టణమునకు తూర్పుపశ్చిమములలోకూడ జూలై 15-వ తేదీని జర్మనులు ముట్టడించి విఫలమనోరథులైరి. జర్మను లవలంబించిన అవస్కందనములలో నిదియే కడసారి అవస్కందనము.

తరువాత మిత్రమండలివారు ప్రతిఘటించి జర్మనులతో యెడతెగ కుండ నవంబరువఱకు యుద్ధముచేసి వారి నోడించిరి.

## మిత్రమండలి ప్రతిఘట్టన

యుద్ధస్థితియంతయు జూలై 17 వ తేదిని ముహూర్తమాత్రములో తారుమారయ్యెను. అమెరికాసేనలు రణరంగమునకు వచ్చిన ప్రయోజనము వెంటనే కనిపించెను. ఆంగ్ల పరాసు జర్మను సేనలలసిపోయిన సమయమునందు అమెరికాసేనలు వద్దతువచ్చెను. నిష్కామ సేవయు లోకోద్ధరణమును ఆదర్శముగఁ బెట్టుకొనిన అమెరికాసేనలు యుద్ధానుభవము లేకపోయినను చిరకీర్తిని సంపాదింపగలిగినవి. వారవలంబించిన యుత్తమమార్గము సంస్తవనీయము. యుద్ధానుభవము లేని లోపము కనిపింపకుండఁ జేయుటకై అమెరికాయోధులను ఆంగ్ల పరాసు పటాలములలోఁ జేర్చిరి. అందు కమెరికావా రంగీకరించుట వారి ధర్మప్రియత్వమునకు నిదర్శనముగ నుండగలదు. లోకమునందు సభ్యతకు భంగము కలుగుచుండినప్పుడు మానవు లేయుత్కృష్టభావముతో సంచరించుదురో అట్టిభావముతో అమెరికావారు తమ అహంత్వమును పాటింపక సంచరించిరి. మిత్రమండలి విజయదశకు మఱి యొక కారణము గలదు. శత్రువునకు గల సంయుక్తసేనాధిపత్యము మిత్రమండలికిలేదు. వివిధరాజ్యముల సేనలు కలిసి యుద్ధము చేయవలసి యుండినప్పుడు సర్వసేనాధిపత్యమున కుండిన యవకాశముల కంటె భిన్నభిన్నములగు నేర్పాటుల కెక్కువ వీలుండును. అయితే మిత్రమండలి మూడేండ్ల యుద్ధానుభవమువలన సంయుక్తసేనాధిపత్యము సంయుక్తరణతంత్రములవలన కలుగు లాభాలాభములను గ్రహింపగలిగెను. ఇటలీ సేనలకు కలిగిన పరాభవానంతరము మిత్రమండలి సేనాధ్యక్షులు వెర్సేల్సుపట్టణమునందు గూడి ఆలోపములను నివారించుకొనిరి. అక్కడ జరిగిన యేర్పాటుల ననుసరించి మార్షలుఫాషు సర్వసేనాధిపతి యయ్యెను. జర్మనుల అవస్కందనదశాపరిణామము నతఁడు ప్రారంభమునుండియుఁ గనిపట్టియుండెను. శత్రుబల ముడుగుటయే మిత్రమండలి విజయయాత్రకు ముఖ్యకారణము. శత్రువు దుర్బలుడగుచువచ్చినకొలదిని యుద్ధము జోరై బలము తరుగజొచ్చెను. యుద్ధపుజోరు శత్రువునకు దుర్బలసూచకముగాని బలహేతువు కాదని ఫాషుసేనాని ప్రతిఘట్టనతరుణమునకు వేచియుండెను. శత్రువునకు భంగపాటుకలిగి అతని యెత్తులన్నియు తారుమారై పోగలిగిన నంత శీఘ్రతాడనము విజయమునకు ముఖ్యసాధనము. యుద్ధమునకు ముందు శత్రుపంక్తిమీద నగ్నివర్షము కురియించుటవలన శత్రువు ముట్టడించు నని తెలిసి ముందుగ జాగ్రత్తపడుటకు వీలుండును. మామూలుపద్ధతిని విసర్జించి శత్రువునకు తెలియకుండ నాంగ్లులు మొదటి కెంబ్రెయియుద్ధమునందు "టాంకుల" సాహాయ్యముతో ముట్టడించిరి. దానికి ప్రతిక్రియగ జర్మను లట్లే చేసి సూచీముఖము నందు ఆంగ్లులకు కలిగినవిజయమును నిష్ప్రయోజనము చేసిరి. శత్రుముఖమును భేదించి చాలదూరము సేనలుపోయి అలసిపోవుటవలనను ఆసేనలకు ఆధునికయుద్ధములలోఁ గావలసిన ఆహారసామగ్రి, సాధనసంపత్తి తరుణమునకు చేరకపోవుటయు విజయమునకు ప్రతిబంధకమని కెంబ్రయియుద్ధమువలన జర్మనులకేమి ఆంగ్లులకేమి పరిపూర్ణముగ వ్యక్తమయ్యెను. ఏకముఖమునందే శత్రుతాడన ముపక్రమించుటవలన తక్కినముఖములను దుర్బలపరచి అవసరమునకు తగినప్రాంతమును బలపఱచుకొనుటకు తటస్థించుచుండును. కావున సమయానుకూలముగఁ దాడనము రణరంగమునందలి వివిధప్రాంతములకు వ్యాపింపవలయును. రణరంగమునందలి రక్షణానుకూలమైన ముఖములను దుర్బలపఱచి యేకకాలమునం దంతటను అవస్కందనమును ప్రారంభించినయెడల శత్రువు నిర్జితుఁ డగును. ఆధునికయుద్ధవిజయమున కివి సాధనాంతరములు. లూడెన్డ్రాఫ్ నకును ఫాషు సేనానికిని పూర్వోక్తములైన యంశములు తెలియనివికావు. జర్మనులు అవస్కందనమునందు ప్రదర్శించిన రణకౌశలమును ఫాషుసేనాని జర్మనులమీఁద నే ప్రయోగించి శత్రువును నిర్జింపఁగలిగెను.

జూలై 17-వ తేదీతో జర్మనుల యుద్ధప్రభ యస్తమించెను. 18-వ తేదిని ఫాషుసేనాని అవస్కందనము నారంభించెను. 27 మైలుల ముఖమునందు సిస్సాను పట్టణపు పడమటిభాగము మొదలు పాటోతియరీ వాయవ్యభాగమువఱకును శరవేగముతో జర్మనులను మిత్రమండలిసైనికులు ముట్టడించిరి. మిత్రమండలి ముట్టడించునని శత్రువునకు తెలియనే తెలియదు. మారను నదీప్రాంతమును శత్రువులు పదిమైళ్ళ దూరము నాక్రమించుకొనియుండిరని పైని తెలియజేసి యుంటిమి. మిత్రమండలి తాడనము ప్రారంభమైనతోడనే శత్రువు పరాఙ్ముఖుడయ్యెను. వారమునాటికి శత్రువు మారను నదిని దాటి వీసెలు నదీముఖముగ పారిపోవుచుండెను. శత్రువు మే జూను నెలలలో రక్తము ధారపోసి గెలుచుకొనిన ప్రదేశములో చాలభాగము నెలాఖరునకు మిత్రమండలి స్వాధీన మయ్యెను. జూలై నెలలో మిత్రమండలికి కలిగిన విజయమువలన శత్రువున కుండిన పారిసు నగరపు దండయాత్ర తుదిముట్టెను. ఆ నగరమునకు శత్రుభయము పోయెను. పరాసులరాజధాని సురక్షిత మయ్యెను. మూఁడువారములలో ఫాషుసేనానికి జర్మనుల దుర్బలత పరిపూర్ణముగ బోధపడెను. దానినిబట్టి యతఁడు మహావ్యూహాన్వితమైన సంగ్రామమున కుపక్రమించెను. ఆరంభమునందు యుద్ధము దీర్ఘకాలము చేసినఁగాని శత్రుబలము తరుగనేరదని యెంచిరి. అనవసరముగ ఫాషుసేనాని యొకరోజైనను యుద్ధమును దీర్ఘము చేయలేదు, శత్రువుల బలాబలము కరతలామలక మగువఱకును ఫాషుసేనాని సూచీముఖ ప్రస్థానముతో సరిపెట్టెను గాని విరోధి యథార్థస్థితి తెలిసిన యుత్తరక్షణమందే రణరంగమునం దంతటను సంగ్రామము నారంభించెను. అందువలన యుద్ధము నలుగురును తలచినట్లు గాక శీఘ్రముగ సమాప్తి నొందెను.

## మిత్రమండలి మహావస్కందనము

ఆగస్టు మొదటివారములో పశ్చిమరంగమునందు ప్రారంభమైన మహావస్కందనము నవంబరు నెలారంభమువఱకును నిర్విఘ్న

ముగ కొనసాగెను. పడమటిరంగమునందు రణపంక్తి కొంచెమించుమించుగ ధనురాకారముగ నున్నదని పడమటిరంగ స్వరూపమును తెలుపుచు గత యేడు సంచికయందు వ్రాసితిమి. ఫాకు సేనాని యవలంబించిన వ్యూహమును గ్రహించినగాని మిత్రమండలి మహావస్కందనదశలను పూర్ణముగ దెలిసికొనజాలము. శత్రురక్షణ పంక్తియొక్క స్వరూపమునుబట్టి మిత్రమండలి తమ వ్యూహమును పన్నిరి. శత్రుపంక్తికి వెనుకను దుర్గసదృశములై యుండిన కొన్ని పట్టణములు రక్షణస్థానములుగ నుండెను ; అవి ఒకదానికొకటి చాల దూరమునందు లేవు. వాని బలిమిని చూచుకొనియే శత్రువు సమయోచితముగ యుద్ధముచేయుచు నవసరమునుబట్టి ముందుకు వెళ్లవలసి యుండినప్పుడు ముందుకు పోవుచును, వెనుకకు మఱలవలసి యుండినప్పుడు వెనుకకుపోయియును నాల్గేండ్లనుండి పరరాజ్యములందు పీఠము వేసికొని యుండుటకును తన దేశమునకు యుద్ధమువలన నిసుమంతయు నుపద్రవము లేకుండుటకును వీలయ్యెను. శత్రుసేనాముఖమును దుర్బలపఱచుటకు అందలి ఒకొక స్థానమును పట్టుకొనుటకంటె నుత్తమమార్గము వేరొకటి యుండదు. కొంచెమించుమించుగ నా బలిష్ఠపట్టణములను ఏకకాలమునందు వశపఱచుకొని సేనాముఖమును భేదించుటకు సౌభాగ్యమగునట్లు పార్శ్వములందు అవస్కందనము నారంభించి మధ్యఖండమునందలి సేనలు పారిపోవుటకు వీలు లేకుండ మార్గావరోధముం గల్పించి శత్రువు మూలబలమును సంహరించుటయే ఫాకు సేనాని రణతంత్రమని ఆగస్టు మొదలుకొని నాలుగుమాసములు జరిగిన యుద్ధస్వరూపమును బట్టి యూహింపవచ్చును. అమీన్సు పట్టణముమీద జర్మనులు శతఘ్నులను ప్రయోగించుచుండుటవలన ప్యారిసునగరమునుండి దానికి పోవు రైలు మార్గము మిత్రసేనల కుపయోగముగ లేదు. ఆ ప్రతిబంధకమును నివారింపజేయుటకై మొదట ఆంగ్లులు అమీన్సుయుద్ధమును ప్రారంభించిరి. యుద్ధము ఆగస్టులో 8 మొదలు 12-వ తేదీవఱకును జరిగెను. అందువలన మిత్రరాజ్యములు తమ సేనలకు కావలసిన సామగ్రిని పంపుకొనుటకా మార్గమును నిర్విఘ్నముగ నుపయోగించుకొనుటకు వీలయ్యెను. ఆ యుద్ధములో 22 వేలమంది బందీలును 400 శతఘ్నులును విజేతలకు దొరకినవి. బాపాము యుద్ధము ఆగస్టు నెల చివఱను 10 దినములు జరిగెను. అందులో 35 వేల మంది బందీలును 270 శతఘ్నులును శత్రువునకు నష్టమయ్యెను. ఆయుద్ధము ముగియకుండనే అర్రాసు యుద్ధము ప్రారంభమయ్యెను. ఆయుద్ధము సమాప్తియగునప్పటికి హిండెనుబర్గు రక్షకపంక్తికి సింహద్వారముగ నుండిన డ్రోకరు క్వీంటు ముఖము ఆంగ్లులవశమయ్యెను. ఆగస్టు 26 సెప్టెంబరు 3-వ తేదీల మధ్య 19 వేల మంది బందీలును 200 శతఘ్నులును వారికి లభించెను. ఇట్లు యుద్ధము జరుగుచుండగనే అర్రాసున కుత్తరభాగమునందు డబాయిపట్టణముకొఱకు ఆంగ్లులును, లేను పట్టణముకొఱకు ఫరాసులును యుద్ధమును జరిపిరి. సెప్టెంబరు మొదటివారము దాటువఱకును పూర్వోక్తమైన ముఖములందు యుద్ధము జరిగెను. శత్రుసేనయంతయును యుద్ధము జరుగుచున్న ముఖములందుండెను. వేసవికాలమునందు శత్రువు జరిపిన అవస్కందనములకు ఫలితముగ నతని సేనయందలి నిలువ సైనికులు చాలవఱకు క్షయమైపోయిరి. ఒక ముఖమును బలహీనపఱచకుండ రెండవముఖమును బలపఱుపలేనిస్థితియందుండెను. అట్టి తఱుణమునందు షాంపేను, ఆర్గోనులందును, మ్యూజు ముఖమునందును ఫాకు సేనాని యుద్ధమును సంకల్పించెను. షాంపేనునందు ఫరాసులు శత్రువులను భంజించుచుండిరి. ఆర్గోనులోనుండి శత్రువును తఱుముటకు అమెరికావారు పూనుకొనిరి. సెప్టెంబరు 12-వ తేదిని అమెరికను సైన్యములు సెయింటు మిహేలు ప్రస్థమునందు 5 మైలుల ముఖమునందు జర్మనులను ముట్టడించి 12 మైళ్లు దూరము ముందునకు పోయి, 15 వేల మంది ఖయిదీలను వశపఱచుకొనిరి. సెయింటు మిహేలు ముఖము భిన్నమైనప్పుడు శత్రువు మ్యూజునదీముఖమును శరణము చేసికొనవలసియుండును. అట్లు సావకాశముగ మఱలుటకు వీలు లేకుండ శత్రుసేనను చిందఱ చేయుటయే మిత్రసేనాని యుద్దేశము. నవంబరు నెలవఱకును జరిగిన యుద్ధమువలన జర్మనుల కట్టి యవకాశము దొరకక చివఱకు వారు తమ పరాజయము నొప్పుకొని యుద్ధమును విరమించుటకుం గోరిరి. ఇంతవఱకును విజయసాధకమైన యుద్ధసన్నాహము జరిగెను. ఇక మిత్రసైనికుల కేమాత్రము పురోగమనము కలిగినను శత్రువులకు కావలసిన ఆహారపదార్థములకును, యుద్ధద్రవ్యములకును సైనికుల గమనాగమనములకును నిరోధము కలుగక మానదు. హిండెనుబర్గు పేరుతో నిర్మించి అది యుండగ మాకేమి కొదవయను ప్రగల్భములకు ఆధారభూతమైన సైనికపంక్తికి సింహద్వారము మిత్రమండలిసైనికులకు స్వాధీనమయ్యెను. సెప్టెంబరు అక్టోబరు నెలలందు మిత్రసైనికులు జర్మనుపంక్తికి బలిష్ఠమైన హిండెనుబర్గు పంక్తిని చూర్ణముచేసి బహిఃప్రదేశమునందు యుద్ధము చేసి నిరుత్సాహులై క్షణక్షణమును ఓడిపోవునట్లు జర్మను సైనికుల నోడించిరి. ఆ పరాజయమునకు వెఱచి జర్మనులు యుద్ధమును విరమించుకొనిరి.

## మిత్రసేనల విజయయాత్ర

ఇంతవఱకును మిత్రమండలి మహావస్కందనమునందలి ప్రధానాంశములను తెలిపియుంటిమి. అందువలన కలిగిన మహాఫలితములను వివరించి యుద్ధ మెట్లు పశ్చిమరంగమునందు విరమించెనో తెలియజేయుదుము. హిండెనుబర్గు సేనాముఖమునకు రక్షణయోగ్యముగ నుండిన ముఖము నాక్రమించుకొని మిత్రసేనలు హిండెనుబర్గు పంక్తిని ముట్టడించెను. సెప్టెంబరు 18 వ తేదీని ఈఫె పట్టణమును మిత్రమండలివారు పట్టుకొనిరి. ఆ పట్టణపు స్వాధీనమువలన మిత్రసైనికులు శత్రువుల రక్షణపంక్తి నతిక్రమించి నోర్దుకాలువ నాక్రమించుకొనిన శత్రుసైన్యమును ముట్టడించుటకు వీలయ్యెను. ఆ కాలువయొద్ద నుండిన సైనికపంక్తి దుర్భేద్యముగ నుండెను. సెప్టెంబరు 27-వ తేదీని అర్రాసు ముఖమునందలి సేనల మద్దతుతో నాంగ్లులు నోర్దుకాలువ ముఖమును దొమ్మిచేసి పట్టుకొనిరి. శత్రుసేన లగ్నివర్షముం గురియించుచుండ ఆంగ్లసేనలు ఆ కాలువను దాటగలుగుటయు

